త్వరలో

శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచిత

## శ్రీమద్ధయవదన శతకమ్

ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్యములు


ముళ్ళపూడి విశ్వనాథ శాస్త్రి

రీడర్, శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,

తిమ్మసముద్రము.





సాధన గ్రంథ మండలి, తెనాలి


శ్రీ నీలకంఠాచార్యకృత

# వేదమంత్రరామాయణమ్

## ద్వితీయ భాగము

(అయోధ్యాకాండము-అరణ్యాకాండము-కిష్కింధాకాండము)

తెనుగుసేత : మైత్రేయ




సాధన గ్రంథ మండలి, తెనాలి





వెల : రూ. 60/-

శ్రీ నీలకంఠాచార్యకృత

# వేదమంత్ర రామాయణమ్

## ద్వితీయ భాగము

(అయోధ్యాకాండము-అరణ్యకాండము-కిష్కింధాకాండము)

తెనుగుసేత : మైత్రేయ



సాధన గ్రంథ మండలి, తెనాలి

 వెల : రూ. 60/-



శ్రీనీలకంఠాచార్యకృత

వేదమంత్ర రామాయణమ్ - ద్వితీయ భాగము

(అయోధ్యాకాండము-అరణ్యకాండము-కిష్కింధాకాండము)

తెనుగుసేత :

మైత్రేయ

ప్రథమ ముద్రణ:- చిత్రభాను సంవత్సరము-విజయదశమి
అక్టోబరు 15, 2002

ప్రతులు : 1000
పేజీలు : 160
వెల రూ.: 60-00


**C/o. R. MOHANA RAO,**
4-103, ILTD Colony Extn., Kothapet,
**CHIRALA** - 523 157.
Phone : 08594-34054.



DTP by
VIKRAM GRAPHICS
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 37658

# ముందు మాట

'రామో విగ్రహవాన్ ధర్మః' -మూర్తిమంతమైన ధర్మమే రాముడు అని చెప్పబడ్డ మారీచవాక్యాన్ని వ్యాఖ్యానించే ప్రయత్నంలో, ఋక్కులను అడ్డుపెట్టుకుని హృదయగత భావాలను వెలువరించే ప్రయత్నం చేశాడు మైత్రేయ. ఇతడికి రామాయణంలో నచ్చిన పాత్రలు రెండు. ఒకటి దశరథుడు, రెండు సుగ్రీవుడు. ఎందుకంటే మైత్రేయలో సుగ్రీవుడి జంతు ప్రవృత్తి, పిరికితనం, భోగలాలసత, కృతఘ్నత; దశరథుడిలాగా ధర్మాన్ని ఎరిగిన విజ్ఞత (దశరథుడే స్వాయంభూ మనువు) కానీ దాన్ని ఆచరించలేని అసహాయత వున్నాయి.

శాశ్వత ధర్మాన్ని పాటించక కొందరు, వ్యావహారిక ధర్మాన్ని పాటించక కొందరు, ఈ ధర్మాలను ఏకాలంలో పాటించాలో ఆ కాలంలో పాటించక కొందరు, ఏయే ధర్మాలు ఏయే విధానాలలో పాటించాలో ఆ రకంగా పాటించక కొందరు, ఏ ప్రాంతాలలో (ఏయే సమాజాలలో) పాటించాలో అక్కడ పాటించక కొందరు, ఎవరి ఎడల ధర్మం పాటించాలో వారి ఎడల పాటించక కొందరు, తమ అధర్మానికి అతి తెలివితో, తర్కంతో ధర్మం ముసుగు వేసి కొందరు పతనమవుతూ ఉంటారు.

ఏ వయసులో (ఏ కాలంలో) పాటించవలసిన ధర్మం ఆ వయసులో పాటించకపోవటం వల్ల దశరథుడు పుత్రశోకంతో మరణించాడు. ధర్మానికి వక్రభాష్యం పలికిన వాలి, రావణులు మరణం కొనితెచ్చుకుంటే, శూర్పణఖ ముక్కు, చెవులు పోగొట్టుకున్నది. స్వయంగా తాను ధర్మానికి వక్రభాష్యం చెప్పకపోయినా, అలా చెప్పగల దాసీదాన్ని గురువుగా చేసుకున్నందుకు కైకేయిమాత కుకీర్తిని, వైధవ్యాన్ని తెచ్చిపెట్టుకుని జీవితాంతం కుమిలి పోయింది. ధర్మాన్ని ఎలా పాటించాలో అలా పాటించలేకపోవటం వల్ల పరశురాముడు, విశ్వామిత్రుడు తమ తపస్సును వ్యర్థం చేసుకున్నారు.



శీలం అనే ధర్మం పాటింపకున్నా శ్రద్ధ అనే ధర్మాన్ని పాటించిన సుగ్రీవుడు రక్షింపబడ్డాడు. సామాజిక ధర్మమైన సోదరధర్మాన్ని పాటించినన్ని రోజులు అష్టకష్టాలపాలైన విభీషణుడు శాశ్వత ధర్మమైన రామశరణాగతిని పొంది సుఖించాడు. కేవలం శాశ్వత ధర్మాలకే ప్రాధాన్యతనిస్తూ గుహాదుల ఎడల అస్పృశ్యతను పాటించిన వసిష్ఠాదులు కష్టాలపాలైనారు. సాధువైన భరతుడిని అనుమానించిన లక్ష్మణుడు సీత చేత అవమానింపబడ్డాడు. సాధువైన లక్ష్మణుడిని దూషించిన సీత కష్టాలపాలైంది. ఈ రెండు చరిత్రలు వ్యక్తుల ఎడల ధర్మపాలన జరగకపోవటాన్ని సూచిస్తున్నాయి.

ఇలా అసంఖ్యాకమైన పురాణ ఇతిహాస పాత్రలను ధర్మత్రాసులో కూర్చోబెట్టి బరువు తూచ ప్రయత్నించాడు మైత్రేయ. రాముడు భరతుడి మనోమథనం చేయటం ద్వారా ఆయనలో దాగున్న ప్రేమరసాన్ని బయటకి తీశాడని తులసీ చెప్పాడు. అలాగే ప్రకృతి మైత్రేయ మనసును మథిస్తే అతడి నిజజీవితంలో నుండి ఈ ధర్మవిశ్లేషణ బైటికి వచ్చింది. మొదట్లో ప్రకృతి తన ఎడల ఎందుకింత కఠినంగా వ్యవహరిస్తోందో మైత్రేయకు అర్థం కాలేదు. ఇప్పుడే అది బోధపడుతోంది.

ప్రత్యక్ష పదార్థాలకు ఇంద్రియాలు ఎలా ప్రమాణమో, అలాగే పరోక్ష పదార్థాలకు శబ్దం ప్రమాణం. కంటికి కనబడేది చెవికి కనపడదు. చెవికి వినపడేది కంటికి వినపడదు అని మనకు తెలుసు. మరి ఇంద్రియాలకు అందని దానికి శబ్దం ఎందుకు ప్రమాణం కాగూడదు? శబ్ద ప్రమాణాన్ని స్వీకరించకపోతే లోక వ్యవహారమే నడవదు. శబ్దాన్ని ప్రమాణంగా స్వీకరించని నాస్తికులు, హేతువాదులు కూడా తమ అభిప్రాయాలను శబ్దాల ద్వారా (మాటలు, గ్రంథాలు) ప్రకటిస్తూనే ఉంటారు, ఇది ఏమి విచిత్రం!

ప్రత్యక్షం కాని భూత భవిష్యత్తులు, వర్తమానంలో ప్రత్యక్షం కాని దేశ దేశాంతర విషయాలను కూడా శబ్ద ప్రమాణంతోనే కదా అందరూ తెలుసుకునేది.

ఇద మన్ధం తమః కృత్స్నం జాయేత భువన త్రయమ్।
యది శబ్దా హ్వయం జ్యోతిరా సంసారం నదీప్యతే
- ఆచార్య దండి

అన్నింటినీ ప్రకాశింపజేసే శబ్దం అనే మహోజ్వలమైన దీపం లేకపోతే ప్రపంచమే అంధకారబంధురమైపోదా? అని ప్రశ్నిస్తారు దండి వారు.

యథార్థాన్ని పలికేవాడే ఆప్తుడు. ఎటువంటి స్వార్థం, స్వలాభాపేక్ష లేకుండా యథార్థాన్ని పలికేవాడు భగవంతుడు. ఆయనే ఆప్తుడు. ఆయన ఉచ్ఛ్వాస నుండి ప్రభవించిన శబ్దప్రమాణమే వేదం.

ఋషులు, అవతారపురుషులు ఈ వేదాలను స్మరించి వివరించినవే స్మృతులు. ఇవి అయిదు రకాలు. (1) దృష్టార్థ స్మృతి - రాజకీయాలు, సంధి విగ్రహాలు, సామదానాదులు ప్రయోగించే విధానాన్ని నిరూపించేది దృష్టార్థ స్మృతి. (2) అదృష్టార్థ స్మృతి - సంధ్యోపాసనా విధానం, మాంస భక్షణ నిషేధం మొదలైనవి బోధించేది అదృష్టార్థ స్మృతి. (3) దండ ధారణాదులను బోధించేది దృష్టాదృష్టార్థ స్మృతి (4) జపహోమాది క్రియలను తెలియజేసేది న్యాయమూల స్మృతి. (5) వేదోక్త విషయాలను అనువాదం చేసి చూపేది అనువాద స్మృతి.

ఇతిహాసాలు రెండు- రామాయణం, మహాభారతం. 'ఇతిహ ఆస' ఈ విధంగా మేము విన్నాము అని ఇతిహాసానికి అర్థం. ఇవి చరిత్రలు. భగవంతుడు వేదాలను ఉచ్ఛ్వాస ద్వారా సృష్టించగానే అందులో తాను ప్రకటించబోయే అవతారాలు, ఆయా అవతారాల కాలంలో ధర్మసంస్థాపన కొరకు ఆ అవతారాలు వేదోక్త ధర్మాన్ని తమ చరిత్ర, లీలల ద్వారా ప్రకటించే విధానాలు నిక్షిప్తం చేసి ఉంచాడు......

అందుకే మహాద్రష్ట అయిన శ్రీ నీలకంఠాచార్యులవారు వేదమంత్రాలలో ఈ రెండు ఇతిహాసాలను దర్శించారు. ఆయన వేదాల నుండి మంత్రరామాయణం, మంత్ర భారతాలను ఉద్ధరించాడు.



వేదవేద్యేపరే పుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా॥

వేదవేద్యుడైన భగవంతుడు దశరథాత్మజుడిగా ఆవిర్భవించగా, వేదమే రామాయణమై దిగివచ్చింది.

'భారతం పంచమో వేద :' 'సర్వశ్రుతి సమూహో2యమ్'

భారతం పంచమవేదం. ఇందులో మొత్తం వేదసమూహమంతా దాగి వుంది. ఈ రెండు ఇతిహాసాలు వేద సమూహాలకు వ్యాఖ్యలు కనుక వీటిని అనువాద స్మృతులుగా చెప్పుకోవచ్చు. కానీ ఇవి వేదాలు కావు కేవలం స్మృతులే అని చిన్నచూపు చూసేవారి కొరకు శ్రీ నీలకంఠాచార్యుల వారు సూటిగా వేదమంత్రాలలోని రామాయణ భారతాలను ఆవిష్కరించారు.

వేదాలలో విషయాన్ని బట్టి రెండు విభాగాలున్నాయి. (1) విధులు (2) అర్థవాదాలు (విధులను స్తుతించే రూపంలో చెప్పబడే గాథలు) శ్రీరామచంద్రుడు, ఋషులు ప్రసంగించినప్పుడు విధులను ఉపదేశించారు. తక్కిన సమయాలలో తమ చరిత్ర ఆచరణ ద్వారా అర్థ వాదాన్ని కండ్లముందు నిలిపారు.

శ్రీరామనవమి దగ్గరకు వచ్చిందంటే చాలు రామాయణ పాత్రలైన దశరథ, జనక, సీత, లక్ష్మణాది పాత్రల ఉల్లేఖనం వేదాలలో ఉంది అంటూ ఎందరో విద్వాంసులు అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ ఉంటారు.

కానీ ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే అనేక శతాబ్దాల పూర్వమే ప్రఖ్యాత భాష్యకారులు శ్రీ నీలకంఠాచార్యులవారు 156 ఋగ్వేద మంత్రాలను సమీకరించి, వాటికి ఒక సంస్కృత వ్యాఖ్య వ్రాయటం ద్వారా మంత్రరామాయణ నిర్మాణంలో కృతార్థులైనారు. ఈ మంత్రాల ద్వారా కొన్ని రామాయణ పాత్రల ఉల్లేఖన పరిచయాదులో లేక కొన్ని ఘట్టాల సాక్షాత్కారమో మాత్రమే గాక సంపూర్ణ రామకథ ప్రత్యక్షమవుతుంది.

అయితే వేదమంత్రాలలో ఉపయోగించిన పదజాలానికి అనేక రకాలుగా విస్తృతమైన అర్థవివరణ ఇవ్వవచ్చు. కనుక రామాయణపరంగా తాను ఇచ్చిన అర్థం సరైనదే అని నిరూపించటానికి శ్రీ నీలకంఠాచార్యుల వారు తమ తాత్పర్యంలో ఎంతో కృషి చేశారు. శ్రీ నీలకంఠాచార్యులు ఎన్నుకున్న ఆ 156 మంత్రాలకు వారే సంస్కృతంలో టిప్పణి వ్రాశారు. తాత్పర్యం అంటూ ప్రతి మంత్రం క్రింద మైత్రేయ ఇచ్చినది వారి సంస్కృత టీకా అనువాదమే. వ్యాఖ్యగా మైత్రేయ వ్రాసిన విస్తృత వివరణ అంతా అతడి సొంతం. ఇది అంతా శ్రీ నీలకంఠాచార్యుల వారి సంస్కృత భాష్యానికి అనువాదమని కొందరు భావిస్తున్న కారణంగా ఈ వివరణ ఇవ్వటం జరిగింది. 17వ శతాబ్దానికి చెందిన శ్రీ గోస్వామి తులసీదాసుగారి 'రామచరితమానసం' అనే అవథ భాషా (అయోధ్య పరిసరాల్లో మాట్లాడే హిందీ భాష) రామాయణాన్ని ఈయన కన్నా పూర్వుడైన శ్రీ నీలకంఠాచార్య ప్రతిపాదితమైన 'మంత్రరామాయణం' పైన వ్యాఖ్య వ్రాయటంలో ఉపయోగించుకోవటమే ఇందుకు ప్రమాణం. 5-6 సంవత్సరాల పాటు ఈ వ్యాఖ్యానాన్ని 'రామకృష్ణప్రభ' మాసపత్రికలో సుందరకాండలోని కొంత భాగం వరకు ముద్రించిన రామకృష్ణమఠం, మైలాపూర్, మద్రాసు వారికి, బాలకాండ వరకు పుస్తక రూపంలో ముద్రించిన 'సాధన గ్రంథమండలి' తెనాలి వారికి మైత్రేయ సర్వదా కృతజ్ఞుడు.

మహాభారత వ్యాఖ్యానకారుడు మహాభాష్యకర్త అయిన శ్రీ నీలకంఠాచార్యుల వారు కేవలం వేదమంత్రాలను ఉద్ధరించి వాటికి వ్యాఖ్యానం వ్రాయకుండా ఉంటారా? అని అనుమానిస్తారు. కానీ ఇది నిజం. ఆయన శ్రీరామరక్షాస్తోత్రానికి వ్యాఖ్యానం వ్రాస్తూ దానికి అనుబంధంగా ఈ వేదమంత్రాలను చేర్చారు. వాటికి సంస్కృతంలో కేవలం టిప్పణి వ్రాశారు. వేదమంత్రాల అర్థాన్ని సూటిగా గ్రహించగల శక్తి మైత్రేయకు లేదు. ఎవరు వేదమంత్రాలను వ్యాఖ్యానించినా నిరుక్తాన్ని



(యాస్కాచార్య ప్రణీతమైన వేద నిఘంటువు) ఆశ్రయించాల్సిందే. కానీ శ్రీ నీలకంఠాచార్యుల ఎడల గల అచంచల విశ్వాసం వల్ల మైత్రేయ వారి టీకను ప్రమాణంగా స్వీకరించి ఈ సర్వసంపూర్ణమైన వ్యాఖ్యానం వ్రాశాడు. ఇది సుదీర్ఘంగా సాగిన రచనా వ్యాసాంగం. ఎప్పుడెప్పుడు ఆ వాగ్దేవి ఏది పలికిస్తే అదే పలికాడు మైత్రేయ. ఈ వ్యాఖ్యానంలో మైత్రీయ కుసంస్కారా లేవైనా కనిపిస్తే క్షంతవ్యుడు. శుద్ధప్రతిని వ్రాసి ఇచ్చిన గోళ్లమూడి దుర్గా ప్రసాద్ గారికి, సమీక్షించి బాలకాండ వరకు డి.టి.పి. చేసి ఇచ్చిన మోహనరావుగారికి, అయోధ్యకాండ నుండి కిష్కింధాకాండ వరకు రెండవ భాగంగా ముద్రిస్తున్న సాధన గ్రంథమండలి (బాలకాండ వరకు లోగడ వీరే ముద్రించారు) వారికి కృతజ్ఞతలు.

మైత్రేయ

03-06-2002
చేబ్రోలు

# అయోధ్యాకాండము

అవతారిక:- 40 మంత్రాలలో బాలకాండ కథాభాగాన్ని పూర్తిచేసిన వేదం ఐదు మంత్రాలలో అయోధ్యకాండను చెప్పబోతోంది.

**41వ మంత్రం :**

**మధ్యా యత్కర్త్వమభవదభీకే కామం కృణ్వానే పితరి యువత్యామ్। మనానగ్రే తోజహతుర్వియన్తా సానౌ నిషిక్తం సుకృతస్య యోనౌ॥** (ఋగ్: 10-61-6)

తాత్పర్యం :- దశరథుడి ద్వారా కైకేయికి 'రాముడి స్థానంలో భరతుడికి పట్టాభిషేకం జరగాలి, రాముడు అరణ్యానికి వెళ్ళాలి' అనే వరాలు ఇవ్వబడటం అనే కార్యం దేవతల ప్రేరణవల్ల రామరావణ యుద్ధం సానుకూలం అవడం కొరకు జరిగింది. రామలక్ష్మణులు తండ్రిని విడిచి అరణ్యానికి వెళ్ళిపోవడంవల్ల, ఆ విరహాన్ని సహించలేక దశరథుడు సుకృతులు పొందే ఉన్నతస్థానమైన స్వర్గానికి వెళ్ళిపోయాడు.

వ్యాఖ్యానం :- స్వాయంభూమనువు, శతరూప, వృద్ధావస్థలో ఘోరమైన తపస్సుచేసి మహావిష్ణువును కుమారుడిగా పుట్టమని వరం కోరడంవల్ల తరువాత జన్మలో దశరథ, కౌసల్యలుగా జన్మించారని వారికి శ్రీమహావిష్ణువే రాముడై జన్మించాడని కొన్ని పురాణాలలోనూ, రామచరిత మానసాది రామాయణాలలోనూ కనిపిస్తుంది.



సృష్టి ప్రారంభంలో అంతా జలమయంగా ఉండేది. ఆ నీటిపైన పవ్వళించిన మహావిష్ణువు నాభినుండి కమలం ఆవిర్భవించింది. అందులో ప్రకటమైన బ్రహ్మ, సృష్టి ప్రారంభించాడు. మొదట్లో ఆయన మానసిక సృష్టి చేశాడు. అయితే ఆయనచేత సృష్టించబడ్డ వారంతా నివృత్తి పరాయణులై సృష్టిని కొనసాగించడానికి ఇష్టపడలేదు. వారంతా తపస్సు కొరకై వెళ్ళిపోయారు. తన సృష్టి విస్తరించడానికి ఇది మార్గం కాదని తలచి బ్రహ్మ మైథునసృష్టి సాగించడానికి మను, శతరూపలను సృష్టించాడు అని పురాణాలు చెబుతున్నాయి.

మను, శతరూపలనుండే మనుష్యజాతి ఉత్పన్నమైంది. ఉత్తానపాద, ప్రియవ్రతులనే ఇద్దరు కొడుకులు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే కూతుళ్ళ వల్ల సృష్టి విస్తరించింది. ఈ ప్రవృత్తితో బాటు అసంఖ్యాకంగా సమస్యలు కూడా పెరిగాయి. సృష్టి యొక్క భిన్నత్వంలో సౌందర్యంతో బాటు స్పర్ధలు కూడా మొదలయ్యాయి. దీన్ని అదుపుచేయడానికి నీతి, ధర్మశాస్త్రాలు అవసరమైనాయి. సృష్టిలో సమతౌల్య, సమన్వయత్వం తేవడానికి మనువు ఒక స్మృతిని చిత్రించాడు. దాన్నే మనుధర్మశాస్త్రం అన్నారు. ఆయన ఈ స్మృతిధర్మం ద్వారా చేసిన సంతులిత సమాజ వ్యవస్థాపన నిజంగా శ్లాఘనీయమైంది. "విషయసుఖాలు నెయ్యిలాంటివి, కామాగ్నిలో ఇవి ఎంతపోసినా అగ్ని మరింత ప్రజ్వరిల్లుతుందే గాని శాంతించదు'' అని తన జీవితసారాన్ని ఆయన తన స్మృతిలో వ్రాస్తాడు. విషయసుఖాలు ఎప్పుడూ సంపూర్ణ సుఖాన్ని, శాంతిని ఇవ్వలేవు అనేది నిస్సందేహ నిర్ణయం. ఎందుకంటే వాటిని అనుభవించే ఇంద్రియాలే సీమితమైనవి. హద్దు పద్దులు కల్గినవి. ఒకవేళ వాటిని శక్తికిమించి ఉపయోగించినా అది రోగాలకు దారితీస్తుంది. ఈ సత్యాన్ని గ్రహించిన వ్యక్తికి వైరాగ్యం ఉత్పన్నమౌతుంది. కాని ధర్మంవల్ల వైరాగ్యం ఉత్పన్నం అవుతుంది అనడం కన్నా ధర్మం ద్వారా వైరాగ్యం ఉత్పన్నమయ్యే అవకాశం

ఉంది అనడం మంచిది. ఎందుకంటే ఎంతో మంది ధర్మమార్గంలో జీవించినవారిలో కూడా వైరాగ్యం ఉత్పన్నం కాకపోవడం మనకు కనిపిస్తుంది. అందుకు ప్రత్యక్ష సాక్ష్యం స్వాయంభువ మనువు జీవితమే. వృద్ధాప్యంలో 'రాజభవనంలో కాలం గడుపుతూ వృద్ధాప్యం సమీపించింది ఇంతవరకు విషయ వస్తువులపైన వైరాగ్యం కలగలేదు. జీవితం అంతా భక్తిరహితంగా వ్యర్థమైంది' అను కోవడం మొదలుబెట్టాడు. ఈ పరిస్థితిలో వ్యక్తి ఎంతైనా అనుభవించ గల ఇంద్రియశక్తిని సాధించుకుందామని చూస్తాడు. అదే స్వర్గం. అక్కడ రోగం, వృద్ధాప్యం అనే సమస్యలుండవు. కానీ అక్కడ కూడా సంపూర్ణంగా సమస్యలనుండి బైటపడటం జరగదు. కారణమేమంటే పుణ్యం యొక్క స్థాయిని బట్టే స్వర్గంలో వేరు వేరు వ్యక్తులకు వేరు వేరు స్థితులు ఏర్పడతాయి. కనుక తక్కిన సమస్యలు లేకున్నా ఈర్ష్యాద్వేషాలు మాత్రం ఉండి తీరుతాయి. పైగా పుణ్యం అయిపోగానే స్వర్గంనుండి జారిపోవడం కూడా జరుగుతుంది.

మనువు, శతరూపలు వృద్ధాప్యంలో కూడా వైరాగ్యం కలగక పోవడంతో విసుగెత్తి అరణ్యాలకు వెళ్ళి ఘోరమైన తపస్సు చేయడం మొదలుబెట్టారు. వారి తపస్సుకు మెచ్చిన శ్రీమహావిష్ణువు వారి ముందు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే నీలాంటి కొడుకు నియ్యమన్నారు. ఈ అడిగిన వరంలో కూడా భోగప్రవృత్తి కనిపిస్తోంది చూడండి. వైరాగ్యంతో కూడుకున్న భక్తిలోనయితే ఎవరన్నా సాలోక్యముక్తి, సారూప్యముక్తి లేదా సాయుజ్యముక్తి కోరుకుంటారు కాని భోగసంస్కారాలు ఇంకా మిగిలి ఉన్న మనువు కనిపించిన అందమైన వస్తువును గాని వ్యక్తిని గాని సొంతం చేసుకొని తన ఆజ్ఞను పాలించే వ్యక్తిగా చేసుకొని తాను సుఖపడదామని చూసే వరాన్నే కోరుకున్నాడు. అప్పుడు పరమాత్మ "తప్పక త్రేతాయుగంలో మీకు కొడుకునై పుడతాను కానీ ముందు మీరు స్వర్గానికి వెళ్ళి సుదీర్ఘకాలం వరకు భోగాలు అనుభవించండి ఇది నా ఆజ్ఞ" అంటాడు. అంటే ఇంకా



భోగాపేక్ష ఉన్న మనువు భగవంతుడిని తనయుడిగా పొందగల పవిత్రత పొందడానికి భోగించయినా అర్హత సంపాదించే అవకాశం ఇచ్చాడు. ఇటు కృతయుగం లో కొన్ని లక్షల సంవత్సరాలు, ఆ తరువాత త్రేతాయుగంలో కూడా కొన్ని వేల సంవత్సరాలు స్వర్గసుఖాలు అనుభవించిన మనువు తిరిగి అజమహారాజుకు తనయుడై పుట్టి దశరథుడనే నామంతో ప్రసిద్ధుడై నాడు. తండ్రి తరువాత సింహాసనాన్ని అధిరోహించి ఇటు రాజ్య భోగాలతో పాటు 350 మంది స్త్రీలను, ముగ్గురు పట్టమహిషులను వివాహమాడి అరవైవేల ఏండ్లు నిర్విరామంగా విషయసుఖం అనుభవించాడు. యుద్ధానికి వెళుతూ కూడా కైకేయిని వెంటపెట్టుకు వెళ్ళడం ఇందుకు ప్రమాణం. అయినా ఆ వృద్ధావస్థ వరకు ఆయనకు ఇచ్చినమాట ప్రకారం సంతానంగా పరమాత్మ దిగిరాకపోవడానికి కారణం కేవలం దశరథుడిలో ఇంకా మిగిలి ఉన్న భోగాపేక్షతే.

షుగర్‌వ్యాధి (మధుమేహం) లాంటి రోగం వచ్చినప్పుడు, రక్తపోటు పెరిగినప్పుడు డాక్టర్‌లు పంచదార విడవమని, రాత్రిపూట వరి అన్నం తినడం మానమని చెప్పినప్పుడు రోగి అన్నం విడిచిపెట్టక తప్పదు. కానీ దూరదృష్టి కలిగిన వ్యక్తి ముందే కొన్ని ఆహారనియమాలు పాటిస్తే అప్పుడు ఆహారసేవనం భోగంగా కాక కేవలం అవసరంగా మారుతుంది. కాబట్టి వ్యక్తి వైరాగ్యమార్గంలో ప్రయాణించడానికి కేవలం ఏది అవసరం, ఏది అనవసరం లేదా ఎంత అవసరం, ఎంత అనవసరం, ఏది ధర్మం, ఏది అధర్మం అనే అవగాహనతోబాటు దాన్ని సరియైన సమయంలో ఆచరించడం కూడా చాలా అవసరం. దశరథుడి గానూ, మనువు గానూ ఉన్నప్పుడు ఆయనలో ఈ అవగాహన లోపించిందనడానికి వీల్లేదు. మనుధర్మశాస్త్రం ఇందుకు ప్రమాణం. కాని వృద్ధాప్యం వరకు ఆగి పశ్చాత్తాపపడకుండా ముందే దాన్ని ఆచరించలేకపోవడమే ఆయన లోపం.

వృద్ధాప్యం అనేది సాయంకాలం వ్యాపారి వ్యాపారాన్ని కట్టేసి ఆ

రోజు వ్యాపారంలో వచ్చిన లాభ, నష్టాలను లెక్కచూసుకునే సమయం లాంటిది. కానీ ఆ సమయంలో దశరథుణ్ణి ఇంకా సంతానాపేక్షే వెంటాడు తోంది. సర్వసమర్థుడైన కులగురువు వసిష్ఠుడిని, ఋష్యశృంగుడిని ఆశ్రయించడంతో ఆ కోరిక తీరింది. పూర్ణ పురుషుడు, లోపరహితుడు, సర్వగుణ సంపన్నుడు అయిన రాముణ్ణి సృష్టించిన కీర్తి బ్రహ్మకు దక్కక పోయినా ఆయనను కన్న దశరథుణ్ణి సృష్టించిన కీర్తి మాత్రం సృష్టికర్తకు దక్కిందంటాడు రామచరితమానసకారుడు. కేవలం దశరథుడి తపస్సు వల్లే ఈనాడు ఆ నీలమేఘశ్యాముడిని దర్శించుకునే భాగ్యం అందరికీ లభించింది. కాని ఆ అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుడి మీద కూడా దశరథుడు మమత్వపు లంపటమే పెట్టుకున్నాడు గాని సమర్పణాది భక్తి భావాన్ని పెంచుకోలేకపోయాడు. విశ్వామిత్రుడు వచ్చి రామలక్ష్మణులను యాచించినప్పుడు నీటిలోనుండి బైటపడ్డ చేపలాగ రామలక్ష్మణులను విడవడానికి విలవిలలాడాడు. ఇది లాభసాటి వ్యాపారమే, విశ్వామిత్రుడికి ఇద్దరిని ఇవ్వడం నీకు రెండందాల లాభం అని వసిష్ఠుడు చెప్పగా గురు వాక్యం పైగల విశ్వాసంతో వారిని విశ్వామిత్రుడికి ఇచ్చేశాడు. వసిష్ఠుడి మాట సత్యమైంది. ఇద్దరు కుమారులను ఇచ్చినందుకు నలుగురు కోడళ్ళను తెచ్చుకున్నాడు దశరథుడు. ఆయన ఐశ్వర్యం మధ్యాహ్నకాలీన సూర్యుడి లాగా ప్రచండమైంది.

రాయసుభాయ ముకురకర లీన్హా।
బదను బిలోకి ముకుటుసమ కీన్హా॥

ఒకరోజు దశరథుడు తన అలవాటుచొప్పున అద్దాన్ని చేతిలోకి తీసుకొని దాంట్లో ముఖం చూసుకుంటూ వంకరగా ఉన్న కిరీటాన్ని సరిచేసుకున్నాడు.

తన నోటితో తన లోపాన్ని వ్యక్తి ఒక్కొక్కసారి ఒప్పుకోవడానికి సిద్ధమైనా, ఇంకెవరన్నా ఆ లోపాన్ని ఎత్తిచూపితే మాత్రం సహించలేడు.



నాకు ఏమీ తెలియదు అనడం కష్టంకాదు, ఆ మాట ఇంకెవరన్నా అంటేనే సహించడం కష్టం. ఆ మాట తాను అన్నప్పుడు కూడా నేను ఎంత సరళుడినో, వినయుడినో చూడండి నేను నా లోపాలను ఒప్పుకుంటున్నాను. ఇంకెవరన్నా ఈ ప్రపంచంలో అలా ఒప్పుకోగలరా అని చూపించడం కొరకే గాని నిజంగా తాను ఏమీ తెలియని అజ్ఞానిని అనే విషయం ఒప్పుకుని కాదు.

ఇతరులు మన లోపాలను ఎత్తిచూపిస్తే సహించలేము గాని అదేపని అద్దం చేస్తే మాత్రం ఏమీ అనం. అద్దంలోకి తొంగిచూస్తే చాలు మన మొహం మీద ఎన్ని మచ్చలున్నాయో కనిపిస్తాయి. మనలో ఇన్ని మచ్చలను అది ఎత్తిచూపినా మనకు కోపంరాదు. అందుకు కారణమేమంటే మనం అద్దాన్ని ఏకాంతంలో ఉండగా చూస్తాం గాని అందరి ముందు (సామాన్యంగా) చూడం. అది మనను ఏకాంతంలో హెచ్చరించడంవల్ల సమాజంలోకి వెళ్ళేముందు కాస్త అందంగా కనపడేలా తయారవడానికి అది సహాయపడుతుంది. అందుకే అద్దమంటే అందరికీ ప్రీతి. కాని ఇదే అద్దాన్ని అందరిముందు చూడగలిగినప్పుడు అంటే ఏకాంతంలో మన లోపాలను సింహావలోకనం చేసుకున్నట్లు ఇతరుల ముందుకూడా విశ్లేషించుకోగలిగితే సాధనలోకి పురోగమించగలుగుతారు. తన లోపాలను స్పష్టంగా చూడగలిగినవాడికి సన్మానాపేక్షత ఉండదు. ఇతరులు మన లోపాలను ఎత్తిచూపినప్పుడు అవమానభావం కలుగకపోగా ఆ చూపినవారి మీద కృతజ్ఞతాభావం ఏర్పడుతుంది.

దశరథుడిలో ఉన్న విషయ లాలసత అనే లోపంతోబాటు ఆత్మ నిరీక్షణ (అదికూడా సభామంటపంలో) అనే గొప్ప గుణం కూడా ఉంది. అద్దంలోకి చూడగానే కిరీటం వంకరగా ఉండటం కనిపించింది. దాన్ని చక్కగా చేసుకోగా చెవిపక్కన వెంట్రుకలు తెల్లబడి కనిపించాయి. అవి ఇక నీకు వృద్ధాప్యం వచ్చింది ఇక రాముడికి సింహాసనం ఇచ్చివేసి జీవితాన్ని

సఫలం చేసుకోమని ఉపదేశిస్తున్నట్లుగా అనిపించిందట. ప్రకృతి మనకు మౌనంగానే అనేక సందేశాలనిస్తూ ఉంటుంది. ఉన్మత్తులమైన మనం, మన అజాగరూకత కారణంగా ఆ సందేశాలను వినలేము, గుర్తించలేము. అందుకే జీవితాలు వ్యర్థమైపోతాయి.

శ్రీరాముడికి సింహాసనమివ్వాలనే తన సంకల్పాన్ని దశరథుడు గురువు వసిష్ఠులముందు ఉంచాడు. ఆయన సమ్మతితో సభాసదుల ముందు, పురప్రజల ముందు ఉంచాడు. అంతా ఏకగ్రీవంగా అందుకు సమ్మతించారు. దశరథుడిలాంటి మహానుభావుడు, ఉత్తమసాధకుడు సాక్షాత్తుపరమాత్మనే పుత్రుడిగా పొందగలిగిన ధన్యజీవి యొక్క సంకల్పం ఈ విషయంలో నెరవేరలేకపోయింది.

తెల్లవారితే శ్రీరామ పట్టాభిషేకం అని అయోధ్యలో అంతా అనుకుంటూ ఉంటే దేవతలు ఇది ఎలా తప్పుతుందా అని ఆలోచిస్తున్నారు. రాముడు కారణం లేకుండా రావణుడి మీదికి యుద్ధానికి వెళ్ళడు. ఆయన అయోధ్యలో ఉంటే ఆ కారణం సృష్టింపబడదు, మరి ఎలాగ అని ఆలోచి స్తున్నారు దేవతలు. దొంగకు వెన్నెలరాత్రి నచ్చుతుందా మరి! వాళ్ళు చదువులతల్లి సరస్వతిని మార్గాంతరం చూడమని వేడుకున్నారు.

శుభకార్యాలకు రాక్షసులు అడ్డువస్తారని మనకు తెలుసు. కాని ఆశ్చర్యం! ఇక్కడ రామరాజ్యస్థాపనకు దేవతలే అడ్డువస్తున్నారు, కారణం ఏమిటి? ఒక సాధకుడు ఉండేవాడు. ఆయన ఎంతో నిష్ఠగా జపధ్యానాలు చేస్తూ ఉండేవాడు. ఆయన యొక్క ఈ సాధనలో స్వయంగా ఇంద్రుడు ఎంతో సహాయంచేస్తూ ఉండేవాడు. కానీ ఒకరోజు ఏకాంతంగా పూజా మందిరంలో కూర్చుని అఖండంగా ఎన్నో ఏండ్లనుండి వెలుగుతున్న జ్యోతి ముందు జపం చేసుకుంటూ ఉంటే పెద్దశబ్దంతో కిటికీ రెక్కలు తెరుచు కున్నాయి. గాలి వచ్చి దీపాన్ని ఆర్పేసింది. ఎవరా ఈ పని చేసింది అని కండ్లు తెరిచి చూస్తే ద్వారం కూడా తెరుస్తున్న ఇంద్రుడు కనిపించాడు.



ఏమిటది అని అడిగేంతలోనే ఆయన మాయమైనాడు.

తపస్సు చేసేవారి దగ్గరికి అప్సరసలను పంపి వారిని పడిపోయేలా చేయడంలాంటి పనులు దేవతలు చేస్తూ ఉండటం పురాణాల్లో మనం తరచు చదువుతూంటాం, ఇందుకు కారణం ఏమిటి? ధర్మకార్యాలు, ధ్యానాది తపస్సులు చేయడంవల్ల వచ్చే పుణ్యం భోగప్రాప్తి కొరకని ఒకరి మతం. దానితో ఈ జన్మలో ఇక్కడ సుఖం అనుభవించి స్వర్గంలో కూడా అలౌకికానందం పొంది మళ్ళీ ఉత్తమవంశంలో ధనధాన్యాల మధ్య జన్మించి సుఖపడటం సాధన యొక్క ఫలమని వారి మతం. కొందరు మాత్రం పుణ్యం యొక్క ఫలం వైరాగ్యం, అంతఃకరణశుద్ధి అంటారు. ప్రారంభంలో ఎవరైనా సాధనచేస్తుంటే దేవతలు వారిని తమ అనుయాయులుగా భావించి వారి సాధనలో సాయంచేస్తారు. అందువల్ల వారి ఇంద్రియాలలో తామే (దేవతలే) కూర్చొని సుఖభోగాలు అనుభవించవచ్చని వారి ఉద్దేశ్యం. కానీ వారు వైరాగ్యం వైపుకు ప్రయాణిస్తూ ఉంటే అది తమ మనుగడకే గొడ్డలిపెట్టు కనుక, వెంటనే వారి సాధనను భగ్నం చేద్దామని చూస్తారు.

రేపు జరగబోయే రామరాజ్యస్థాపన వల్ల కూడా ప్రజలు భోగమార్గం నుండి వైరాగ్యానికి ప్రయాణించగలరని అనుమానం వచ్చింది కనుకే దేవతలు దానికి విఘ్నం సృష్టిద్దామని చూస్తున్నారు.

'తథేత్యుక్త్వా తథాచక్రే ప్రవివేశాథ మన్థరామ్'.

అలాగేనని దేవతలకు చెప్పి సరస్వతి వెళ్లి మంధరను ఆవేశించింది.

సరస్వతి అయోధ్యవాసులెవరి బుద్ధినీ చెడగొట్టలేకపోయిందట. ఎంతో పుణ్యధనులు, పవిత్రులు అయినవారిని ఆవేశించటం ఆవిడకు సాధ్యం కాలేదు. కైకయ రాజ్యం నుండి కైకేయి వెంట వచ్చిన దాసి ఈ మంథర. కైకయ దేశపు రాజు యథాజిత్తు స్వార్థపూరిత సంస్కారాలు కలిగినవాడు. కైకేయికి కలిగిన సంతానానికే రాజ్యం ఇవ్వాలనే నిబంధనతోనే

దశరథునికి కైకేయి నిచ్చాడు. ఆయన ఈ స్వార్థపూరిత సంస్కారం ఆ దేశవాసులందరి మీదా ప్రభావం చూపింది.

ఎటైనా ప్రయాణానికి వెళ్లేప్పుడు సూట్‌కేస్‌లో ముందు సర్దిన వస్తువులు అడుగున వుంటాయి, తరువాత పెట్టిన బట్టలు, వస్తువులు పైకి వస్తాయి. అలాగే కైకేయిలో ఇన్నాళ్లు కనిపించిన రాముడిపైన వాత్సల్యం, సవతులిద్దరిపైన గల గౌరవము, ప్రేమ మొదలైనవన్నీ అయోధ్యలో ఏర్పడిన సంస్కారాలు. బుద్ధిభ్రష్టమైన మంథర ఉపదేశం వల్ల చిన్ననాడు ఏర్పడ్డ స్వార్థ సంస్కారాలు ఈ రోజు బయటకు వచ్చాయి.

'సా2పి కుబ్జా త్రివక్రా' మంథర గూనిది, దానికి మూడు వంకరలు కూడా ఉన్నాయి. దానికి మూడు వంకరలు శరీరంలోనే కాదు, త్రికరణాలలో కూడా (మనస్సు, వాక్కు, కర్మ) ఉన్నాయి. శాస్త్రాలు 'రా' అనే అక్షరం పరబ్రహ్మ పరమాత్మ అని, 'మ' జీవుడని, అందుకే 'మ' 'రా'ను అనుసరించి ఉంటుందని చెబుతాయి. మంథర వక్రబుద్ధితో దాన్ని పూర్తిగా భిన్నం చేద్దామని చూసింది. పరమాత్మ రాముడు రాజ్యానికి వస్తే ఆయనను జీవుడైన భరతుడు అనుసరించాల్సింది పోయి భరతుడిని రాజును చేయాలని చూసింది. అందుకే మంథర పేరులో 'మ' తరువాత 'రా' ఉంటుంది.

*కరుభిచారఫలు సుపథభల, ఆదిమధ్య పరినామ్,*
*ఉలటి జపెన్ 'జరామరా', సూధే రాజారామ్॥*

జీవుడి యొక్క ఈ భేదబుద్ధి, అవివేకం వల్లనే రామరాజ్య స్థాపన స్థానంలో మృత్యువు, వినాశనం చోటుచేసుకున్నాయి. 'రాజారాముడి'ని పదవి నుండి దింపటం వల్ల (తల్లక్రిందులు చేయటం వల్ల) 'జరా,మరా' అయ్యింది. అంటే తగలబెట్టడం (వినాశనం) మృత్యువు (దశరథుడి మరణము, నగరవాసులు దుఃఖసాగరంలో మునగటం) తయారయ్యాయి.

దశరథుడు దేవాసుర సంగ్రామంలో దేవతలకు సహాయం



చేయటానికి వెళ్లినపుడు వెంట కైకేయిని కూడా తీసుకువెళ్లాడు. యుద్ధ భూమిలో రథచక్రం సీల ఊడిపోవడంతో కైకేయి ఆ స్థానంలో తన వేలును ఉంచి చక్రం ఊడిపోకుండా కాపాడింది. దానితో ప్రసన్నుడైన దశరథుడు రెండు వరాలు కోరుకోమన్నాడు. కైకేయి వాటిని సరియైన సమయంలో అడుగుతానన్నది. ఈ విషయాన్ని మంథర ప్రస్తుతం కైకేయికి గుర్తు చేసింది. ఈ రోజు ఆ వరాలే శాపాలుగా పరిణమించాయి.

మంత్రశాస్త్రంలో ఇష్టదేవతా మంత్రజపంకన్నా ముందుగా గాయత్రీ మంత్రం జపించాలని ఉంది. కనీసం ఆ మంత్రానికి చెందిన గాయత్రినైనా జపించాలి. ఇది అనివార్యమైన విషయం. ఇలా గాయత్రిని జపించకుండా మంత్రం జపించినా అది సిద్ధిస్తుంది కాని దాని వల్ల లాభం కన్నా నష్టమే ఎక్కువ. బుద్ధి శుద్ధి లేని రావణుడికి, హిరణ్యకశ్యపుడికి, కైకేయికి ఇచ్చిన వరాలు శాపాలుగా మారాయి. గాయత్రి మంత్రం బుద్ధిని శుద్ధి చేసే ప్రార్థన. ఆ తరువాత పొందబడే మంత్రఫలం వరంగా పరిణమించడం సహజం కదా!.

మంథర ద్వారా బోధించబడ్డ కైకేయి ఆభూషణాలు అన్నీ తీసేసి, మలినవస్త్రం కట్టుకొని కోపగృహంలో భూమి మీద పడుకొని దశరథుడి కొరకు ఎదురు చూస్తున్నది. వసిష్ఠ మహర్షి ఆజ్ఞ చొప్పున రేపటి రాజ్యాభిషేకం యొక్క సంసిద్ధతలో ఉపవశించి, బ్రహ్మచర్యవ్రత దీక్షతో సీతారాములిద్దరూ భూమిపైన శయనించి ఉన్నారు. దశరథుడు మాత్రం చీకటి పడే సమయానికి కామాతురుడై కైకేయి మందిరాన్ని చేరవచ్చాడు. జన్మజన్మలుగా విడవని ఆయన యొక్క ఈ ఏకైక సంస్కారం చివరికి కాలనాగై కాటువేయబోతోంది.

*జ్ఞానశక్తిశ్చ కౌసల్యా, సుమిత్రోపాసనాత్మికా,*
*క్రియాశక్తిశ్చ కైకేయీ, వేదో దశరథోనృపః*

వేదరూపుడు దశరథుడు, కౌసల్య జ్ఞానశక్తి, సుమిత్ర ఉపాసనా రూపిణి, కైకేయి క్రియాశక్తి.

వేదం-జ్ఞానం, క్రియ, ఉపాసన ఈ మూడింటితో నిండి వుంది. కానీ ఈ వేద తత్వాన్ని పూర్తిగా గ్రహించక చాలామంది సాధకులు కేవలం క్రియకే ప్రాధాన్యత నిచ్చి(యజ్ఞయాగాదులు చేసి) దానివల్ల వచ్చే ఫలితమైన భోగాన్ని ఆశ్రయించటంతో పతనమౌతున్నారు. వారు భోగైశ్వర్యాలలో పడిపోతున్నారు. వారు ఉన్నతమైన సమాధిని (రాముణ్ణి) పొందలేరు అంటాడు గీతాచార్యుడు.

జ్ఞానం అభిమానరహితమై ఉండాలి. ఉపాసన శ్రద్ధ, విశ్వాసాలతో కూడుకున్నదై ఉండాలి. క్రియ లోపరహితమై ఉండాలి. అప్పుడే అవి సార్ధకమౌతాయి. కానీ క్రియాశక్తి అయిన కైకేయి మంథర అనే లోభంతో దుస్సంగం చేసింది. క్రియలో(కైకేయిలో) మనస్సు పెట్టిన వేదం (దశరథుడు) నిరర్ధకుడవడంలో ఆశ్చర్యమేముంది?

లోభ సహితమైన క్రియాశక్తి, ధర్మమార్గానికి వక్రభాష్యం పలికింది. ధర్మానికి నాలుగు చరణాలు. అవి 1. సత్యం, 2. తపస్సు. 3. దానం 4. దయ. ఈ నాలుగూ ఉంటేనే ధర్మం అనే వృషభం నాలుగు కాళ్ల మీద నిలబడుతుంది. కానీ లోభపూరితమైన క్రియాశక్తి ఈ నాలుగింటినీ విడదీసి తనకు రెండు, దశరథుడుకి రెండు ఇచ్చింది.

*యది సత్యప్రతిజ్ఞో2పి శపథం కురుషే యది*
*తత్రైకేన వరేణాశు భరతం మే ప్రియం సుతమ్।*
*ఏభిస్సంభృత సంభారైః యౌవరాజ్యే2భిషేచయ*
*అపరేణ వరేణాశు రామో గచ్ఛతు దణ్డకాన్॥*

ఒకవేళ నువ్వు సత్యమైన ప్రతిజ్ఞ గలవాడవే అయితే, నా కోరికలు తీరుస్తానని శపథం చేస్తున్నవాడవైతే, రెండు వరాలలోని ఒక వరం చేత



రాముడి పట్టాభిషేక సంభారాలతో భరతుడికి పట్టాభిషేకం చేయి, రెండవ వరం చేత రాముడు అరణ్యానికి వెళ్లాలి.

నీవు సత్యవంతుడవై నాకు వరాలివ్వు. నీ కుమారుడు అరణ్యాలలో తపస్సు చేస్తాడు. ఈ వరాల దానం నాకు చెయ్యి, నా కుమారుడైన భరతుడి మీద దయ చూపు. నీకు, నీ కుమారుడికి సత్యం, తపస్సు; నాకు, నాకుమారుడికి దయ, దానం. ఇదీ ధర్మానికి వక్రభాష్యం.

దశరథుడు కైకేయి మనస్సును మార్చటానికి ఎంతో ప్రయత్నించాడు, కాని మంథర చేత చెడగొట్టబడ్డ మనస్సు గల కైకేయి దశరథుడి మాట వినలేదు. స్వచ్ఛమైన గిన్నెడు పాలలో ఒక్క మజ్జిగ చుక్క చాలదా పులుపెక్కడానికి! ఆహా! దుస్సంగం ఎంతటి ప్రభావాన్ని చూపింది?!

ఆ కాళరాత్రి గడచిపోయింది. కైకేయి సుమంత్రుడితో వార్త పంపగా వచ్చిన రాముడు విషయాన్ని తెలుసుకొని తల్లుల అనుమతి తీసుకొని వల్కలాలు ధరించి అరణ్యానికి బయలుదేరాడు. తన వెంట నీడలాగా సీత కదిలింది. శరీరాన్ని విడచి ఉండలేని ప్రాణంలాగా లక్ష్మణుడు కూడా వారి వెంట బయలుదేరాడు. ఎన్నో విధాల దశరథుడు, నగరవాసులు ఆ ముగ్గురిని ఆపుదామని చూశారు కాని సాధ్యం కాలేదు. నాలుగురోజులు వారిని అరణ్యాలలో తిప్పి తిరిగి తీసుకురమ్మని సుమంత్రుడికి రథమిచ్చి వారివెంట పంపాడు దశరథుడు. దశరథుడిలాంటి మహాపురుషుడిలోని బలహీనత ఇక్కడ కూడా బయటపడుతుంది చూడండి. సత్యవాక్ పరిపాలన అనే ధర్మకార్యంలో ప్రాణం కన్నా ఎక్కువైన రాముణ్ణి అడవికి పంపడానికి సిద్ధమవడం గొప్పతనమే, కాని మళ్లీ వారిని నాలుగురోజుల తరువాత తీసుకురమ్మనడం ధర్మ పరిపాలనలో కపటం అవుతుంది. ఆయనలోని మమత్వం ఆ వృద్ధాప్యంలో కూడా ఆయనను వెంబడిస్తోంది. రాముడు తిరిగి వస్తాడనే ఆశతో కొంతకాలం ప్రాణాలను నిలుపుకున్నాడు దశరథుడు. సుమంత్రుడు రిక్తమైన రథాన్ని తీసుకుని అయోధ్యకు

రావటంతో చివరకు ఆ ఆశ కూడా అడుగంటింది.

ఆ చివరి ఘడియలలో దశరథుడికి శ్రవణకుమారుడి తల్లిదండ్రులు తనకు ఇచ్చిన శాపం గుర్తొచ్చింది. ఆ వృత్తాంతం కౌసల్యకు చెప్పడం మొదలెట్టాడాయన. శ్రవణుడు ఒక వైశ్యకుమారుడు. తన తల్లిదండ్రుల మీద అత్యంత ప్రేమ కలవాడు. వారిని సరిగా చూడాలని భార్యను కూడా విడచిపెట్టి, పుణ్యక్షేత్రాలు తిరగాలనే ఇచ్ఛగల వృద్ధులు, గ్రుడ్డివారైన తల్లిదండ్రులను కావడిలో కూర్చోబెట్టుకొని అన్ని పుణ్యక్షేత్రాలకు తిప్పటం మొదలుబెట్టాడు. ఒక రాత్రిపూట అడవిలో తల్లిదండ్రుల దాహం తీర్చటానికి కుండనొకదాన్ని నీళ్లలో ముంచుతుండగా మృగయా వినోదానికై అడవిలోనికి వచ్చిన దశరథుడు ఆ శబ్దాన్ని ఏనుగు నీళ్లు తాగే శబ్దంగా భ్రమించి శబ్దభేది విద్యతో బాణాన్ని విడిచాడు. అది శ్రవణకుమారుడికి తగిలింది. కొన ప్రాణంతో ఉన్న అతడు తన తల్లిదండ్రుల దాహం తీర్చమని, వారిని పోషించమని వేడుకొని ప్రాణాలు విడిచాడు. నీళ్లకుండతో శ్రవణుడి తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లిన దశరథుడు జరిగిన విషయం జరిగినట్లు చెప్పాడు. 'నీవు కూడా పుత్రవియోగంతో మరణించగలవు' అని శపిస్తూ వారు ప్రాణాలు విడిచారు.

ధర్మగతి పామునడక లాంటిది. దీన్ని తెలుసుకోవటం చాలా కష్టం. మహాత్ములే ఇక్కడ పొరపాటు పడుతుంటారు. 'గహనా కర్మణోగతిః' ధర్మకర్మగతిని తెలుసుకోవటం కష్టం అంటాడు గీతాచార్యుడు. జీవితంలో పొరపాట్లు అందరికీ జరుగుతుంటాయి. సరియైన మార్గంలో వాటిని సరిదిద్దుకోవటానికి ప్రయత్నించాలి. కడు వృద్ధులు, పూర్తిగా పుత్రుడి మీద ఆధారపడ్డవారికి సత్యం ఉన్నదున్నట్లు చెప్పవలసిన పనిలేదు. వారికి అసత్యం చెప్పయినా వారి ప్రాణాలను నిలబెట్టి శ్రవణ కుమారుడికి తానిచ్చిన మాట నిలబెట్టుకోగలిగితే తనద్వారా జరిగిన పొరపాటును సరిదిద్దుకోగలిగేవాడు దశరథుడు. సత్యం కన్నా మనిషి ప్రాణానికి విలువ ఎక్కువ.



ఈ రోజు ఆనాటి సంఘటన గుర్తుకు వచ్చింది దశరథుడికి. కానీ ఆ శాపాన్ని ఆయన ఈనాడు వరంగా స్వీకరించాడు. రామ వియోగ విరహాగ్ని నుండి బయటపడటానికి మార్గం వెతుకుతున్న ఆయనకు ఈ శాపం అమృత కలశంలా ఎదురొచ్చింది.

*హారామా! పుత్ర! హా సీతే హా లక్ష్మణ గుణాకర!*
*త్వద్వియోగా దహం ప్రాప్తో మృత్యుం కైకేయి సంభవమ్*
*వదన్నేవం దశరథః ప్రాణాం స్త్యక్త్వా దివంగతః*

అయ్యో! పుత్రా! రామా! అయ్యో! సీతా! అయ్యో! గుణరాశీ లక్ష్మణా! మీ ఎడబాటు వల్ల నేను, కైకేయి నిమిత్తంగా మృత్యువును పొందాను అంటూ దశరథుడు ప్రాణాలు విడిచి స్వర్గానికి వెళ్లిపోయాడు.

అవతారిక:- 41వ మంత్రంలో కైకేయి వరాల ఫలితంగా రామ- లక్ష్మణ సీతావనగమనం, దశరథుని మరణం, వర్ణించిన వేదమాత 42వ మంత్రంలో భరతుడి మనస్థితిని, వసిష్ఠమహర్షి కార్యదక్షతను వివరించ బోతోంది.

## 42వ మంత్రం :

**దణ్డా ఇవేద్గో అజనాస ఆసన్ పరిచ్ఛిన్నా భరతా అర్భకాసః**
**అభవచ్చపుర ఏతా వసిష్ఠ ఆదిత్తృత్సూనాం విశో అప్రథన్త**

(ఋగ్: 7-33-6)

తాత్పర్యము:- రాముడి వనగమనానంతరం భరత శత్రుఘ్నాదులు గోబాలకుల దండాలు (కట్టల) లాగా నిలిచిపోయారు. వారి పురోహితుడైన వసిష్ఠుడు ఇటు కేవలం రామదర్శనంతోనే తృప్తిని ఆకాంక్షించే ప్రజలను, అటు రాజ్యంపైన ఎటువంటి ఇచ్ఛలేని భరతుడి రాజ్యాన్ని కాపాడాడు.

వ్యాఖ్యానము:- దశరథుని మరణానంతరం, ఆయన శరీరాన్ని అనేక మూలికారసాలలో సురక్షితంగా దాచిఉంచి కైకయదేశంలో ఉన్న భరత

శతృఘ్నులను త్వరగా తరలి రమ్మని వసిష్ఠమహర్షి వార్తాహరుల ద్వారా సందేశాన్ని పంపారు.

*రామస్య యౌవరాజ్యార్థం పిత్రాతే సంభ్రమః కృతః*

*తవరాజ్య ప్రదానాయ తదా2హం విఘ్నమాచరమ్.*

'రాముని యువరాజుగా పట్టాభిషేకం చేయడానికి నీ తండ్రి అన్ని ఏర్పాట్లు చేయగా, నీకు రాజ్యం ఇప్పించడం కొరకు నేను విఘ్నం చేశాను' అని కైకేయి చెప్పగా భరతుడు -

*'హేతు అపునపవుజాని జియ థకితరహే ధరిమౌన'*

తన కారణంగానే రాముడు అడవులపాలైనాడని తెలిసి, అటువంటి ఆఘాతాన్ని సహించలేక మౌనంగా స్థాణువై నిలిచాడు.

వేదకాలంలో ఆవులే ధనం; అవే వినిమయ మాధ్యంగా *(Media of Exchange)* వాడబడేవి. కనుక లక్షల సంఖ్యలో ఎక్కడ చూసినా గోవులు కనిపించేవి. జనాభాలో సగాని కన్నా ఎక్కువ మంది ఈ గోసంపద నాశ్రయించుకొని బ్రతికేవారు. వారిలో ముఖ్యమైన పాత్రధారులు గోబాలకులు, అరణ్యభూములలో వాటిని మేపుతూ రాత్రింబవళ్ళూ వాటిని రక్షిస్తూ ఉండేవారు. రాత్రిపూట నిలబడి తమ దండాల (కర్రల) మీద గడ్డాన్ని ఆనించి విశ్రమించేవారు. ఒక్కక్షణం వారైటైనా పనిమీద కర్రలను విడచి వెళితే భూమిలోకి దిగి ఉన్న ఆ కర్రలు స్తంభాలలాగా నిలిచిపోయేవి. రామవనగమన సమాచార శ్రవణ మాత్రం చేత ఆఘాతానికి లోనై భరతుడు నిశ్చలుడై నిలవడాన్ని వర్ణిస్తూ, తన పరిసరాల్లో కనిపించే దృశ్యాన్ని రూపకంగా మన కండ్లముందుంచుతున్నాడా వేదమంత్ర ఋషి.

మహారాజు దశరథుడి అకాలమృత్యు సమయంలో ఆయన నలుగురు కుమారులలో ఇద్దరు అరణ్యాలలోనూ, మరో ఇద్దరు కైకేయ దేశం లోనూ ఉండటంతో, సమర్థుడైన రాజగురువు వసిష్ఠుడు దేశంమీదికి



ఇతర రాజులు దండెత్తకుండా సైన్యాన్ని సమాయత్తంచేస్తూ, రాజ్యంలో అల్లర్లు లేచి అరాచక పరిస్థితి ఏర్పడకుండా, గూఢచారి సంస్థలను జాగరూకం చేసి కార్యోన్ముఖులను చేస్తూ, ఇటు రాణులను, ఇతర బంధువర్గాన్ని ఓదారుస్తూ, భరతాదులను త్వరగా పిలిపించే ప్రయత్నంచేస్తూ, రాజు కళేబరాన్ని సంరక్షింపజేసే కార్యం చేస్తూ, తిరిగి వచ్చిన భరత శతృఘ్నులకు కర్తవ్యబోధచేస్తూ, సర్వతోముఖప్రజ్ఞను ప్రకటిస్తూ వసిష్ఠుడు అందరినీ కాపాడాడు.

భరతుడు దశరథుడికి అంత్యక్రియలు చేశాడు. తరువాత కర్తవ్యం నిర్ణయించడానికి సభ తీర్చబడింది. ఏది ధర్మం? భరతుడు సింహాసనాన్ని స్వీకరించడమా లేక రాముడిని వెనక్కు పిలుచుకొని రావడమా? 'తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ' - ఇటువంటి అనిర్ణాయక స్థితి ఏర్పడినప్పుడు ధర్మమేమిటో నిర్ణయించడానికి శాస్త్రాన్నాశ్రయించాలి. వేద స్వరూపుడైన నీ తండ్రి కూడా వేద మార్గాన్నే అనుసరించాడు అన్నాడు వసిష్ఠుడు. కానీ ఏ వేదాన్ని ప్రమాణంగా స్వీకరించాలి. 'శృతిర్విభిన్నా' - వేదాలు నాలుగున్నాయి. వాటిలో ఒకటి చెప్పిన మాటకు మరొకటి వ్యతిరేకంగా చెబితే మరి దేన్ని ఆశ్రయించాలి? అన్నాడు భరతుడు. అప్పుడు వేదసారాన్ని నిర్ణయించడానికి స్మృతిని ఆశ్రయించాలి అన్నాడు వసిష్ఠుడు. 'స్మృతయశ్చభిన్నా' - కానీ స్మృతులు కూడా వేరువేరుగా ఉన్నాయి మరి దేన్ని ఆశ్రయించాలి అన్నాడు మళ్ళీ భరతుడు. 'ధర్మస్య తత్వం నిహితం గుహాయామ్, మహాజనౌ యేనగతః స పన్థాః' - ధర్మం యొక్క తత్వం ఎంతో గుహ్యమైంది మరి, అందుకే మహాత్ములు నడిచిన మార్గాన నడవాలి; నీ తండ్రి వెళ్ళిన మార్గం శ్రేష్ఠమైన సనాతన వేదమార్గం. ఆయన తన ప్రాణం కన్నా విలువైన రాముడిని అడవికి పంపాడు గాని అధర్మాన్ని ఆచరించలేదు. నీవు కూడా అదే మార్గాన్ని అనుసరించు. కైకేయికి ఇచ్చిన రెండు వరాలలో ఆయన ఒక్కటి మాత్రమే పూర్తిచేయ

గలిగాడు. సింహాసనాన్ని అధిరోహించి ఆయన కర్తవ్యాన్ని పూర్తిచేసి ఆయన ఆత్మకు శాంతినివ్వు అన్నాడు వసిష్ఠుడు.

అప్పుడు భరతుడు 'తప్పకుండా నేను కూడా మహాత్ములు నడిచిన మార్గాన్నే నడుస్తాను'. మా తండ్రి ధర్మస్వరూపుడనటంలో ఏ మాత్రమూ సందేహం లేదు. ఆయన తన జీవితమంతా ధర్మమార్గాన్ని అనుసరించాడు. కానీ చివరి సమయంలో విధి ఆయన ధర్మవిశ్లేషణాశక్తిని లాగివేసింది. మోహానికిలోనై ఆయన ధర్మాధర్మవిచక్షణను కోల్పోయాడు. తాను కైకేయి కిచ్చిన మాటయితే నిలుపుకున్నాడు గాని మరి ప్రజలకిచ్చిన మాట విషయం ఏమిటి? రాజగురువులైన మీ విషయం ఏమిటి? మీకందరికీ రాముడికి పట్టాభిషేకం చేస్తానని మాట ఇచ్చాడు కదా, దాన్ని తప్పి ఆయన అధర్మాన్ని ఆశ్రయించాడు. కనుక మహాత్ముల అనుగమనమే చేయదలిస్తే నేను శ్రీరాముడినే ఆదర్శంగా ఎన్నుకుంటాను. రాజుగా దశరథుడిచ్చిన ఆజ్ఞను పాటిస్తూ ఆయన అడవికి పోయాడు. కానీ మమత్వం నిండి ఉన్న తండ్రిగా నాలుగు రోజుల తరువాత నేను చెప్పానని చెప్పి వారిని వెనక్కు తీసుకుని రా' అని సుమంత్రుడికి చెప్పి తాను ఇచ్చిన ఆజ్ఞనే జవదాటాడు కనుక నేను రాముడి మార్గాన్నే అనుసరిస్తాను. ఇప్పుడు నేను సింహాసనాన్ని అధిరోహించడం వల్ల మంథర, కైకేయిల మనోభీష్టం నెరవేరుతుందే గానీ ధర్మాచరణ జరగదు' అన్నాడు.

ధర్మశాస్త్రం, న్యాయశాస్త్రం అనువర్తిత శాస్త్రాలే *(Applied Sciences)* గాని మౌలిక శాస్త్రాలు *(Fundamental Sciences)* కావు. అందుకే ప్రతివారు దాన్ని తమకు అనుగుణంగా అనువర్తింపజేసుకోగలుగుతారు. ధర్మాన్ని గూర్చి ఉపన్యసించనిది ఎవరు? 'నేను తలుచుకుంటే నిన్ను ఇప్పుడే చంపించగలను లేదా శిక్షించగలను కానీ నేను ధర్మాత్ముడిని కావటం వల్ల దూతవైన నీకు ఎటువంటి హాని చేయ్యను' అంటాడు రావణుడు అంగదుడితో. కానీ నిజానికి రావణుడు అంత ధర్మాత్ముడే అయితే అంతకు ముందు దూతగా వచ్చిన హనుమంతుడిని ఎందుకు క్షమించి



వదలలేదు, తోకకు ఎందుకు నిప్పంటించాడు? కనుక అంగదుడిని క్షమించాను అనడానికి కారణం అదికాదు. వ్యక్తి వర్తమాన వ్యవహారం ఎప్పుడూ భూతకాలపు అనుభవాన్ని బట్టి ఉంటుంది. అంతకుముందు దూతను (హనుమంతుడిని) శిక్షిద్దామని చూస్తే అతడికి ఏ హాని కలగకపోగా లంకే తగలబడటంతో, ఈ దూతను శిక్షిద్దామని చూస్తే మళ్ళీ తమకు ఏ అనర్థం వాటిల్లుతుందో అనే భయం వల్ల రావణుడు అంగదుడిని ఏమీ అనలేదు. ఈ విధంగా వ్యక్తి తన భయాన్ని ధర్మంగా లోకానికి చూపిస్తాడు. మరి సీత నెత్తుకొచ్చినప్పుడు ఈ ధర్మబుద్ధి ఏమైంది అని అంగదుడడిగితే 'అన్యాయంగా నా చెల్లెలు శూర్పణఖ ముక్కు, చెవులు కోసినందుకు శిక్షగా రాముడి భార్యను ఎత్తుకొచ్చాను' అంటాడు. ప్రతీకారం తీర్చుకోదలచిన వాడు శూరుడిలాగా తన శత్రువైన రాముడితో ముఖాముఖి తలపడాలి కాని పిరికివాడై, రాముడు లేని సమయంలో సీతను ఎత్తుకొచ్చాడు. ఈ విధంగా వ్యక్తి తన పిరికితనానికి కూడా ధర్మమనే రంగు పూద్దామని చూస్తాడు.

మంథర కూడా దశరథుడిపైన కైకేయి మనస్సులో భేదబుద్ధి పుట్టేటట్టు చేయడానికి ఎన్నో మాటలు చెప్పి తాను చెప్పినవన్నీ సత్యమని ప్రతిజ్ఞ చేస్తుంది. 'ఆలోచించు నువ్వు రాణివైతే నాకేమి, కౌసల్య రాణి అయితే మాత్రం నాకేమి? నేను దాసీ స్థాయిని మించి ఎదగలేను కదా. అయినా నీ ఉప్పు తిన్నాను కనుక సత్యం చెప్పడం నా ధర్మం. ఈ విధంగా సత్యం చెప్పడం వల్ల నేను నా సత్యాన్ని ధర్మాన్ని కూడా నిలుపుకున్నాను' అంటుంది మంథర. ఈ విధంగా వ్యక్తి తన ఈర్ష్యను ధర్మంగా చూపిస్తాడు.

ఆ తరువాత దశరథుడు కైకేయితో 'నువ్వు ఎప్పుడూ రాముడిని పొగుడుతూ ఉండే దానివి కదా, అటువంటి నీలో రాముడిపైన ఎందుకింత ద్వేషం పెరిగింది?' అంటే కైకేయి 'మీరు పొరపాటు పడుతున్నారు; నాకు రాముడి మీద ఎటువంటి ద్వేషం లేదు. నేను అతడికి ఏ అన్యాయం

చెయ్యడం లేదు. మీరే కదా రాముడు సాధుస్వరూపుడని అంటూ ఉండేవారు మరి సాధువు అరణ్యాలలో ఉంటే శోభించగలడు గానీ సింహాసనం మీద శోభించగలడా? కాబట్టి సాధు స్వభావానికి వ్యతిరేకంగా రాముడిని సింహాసనం మీద కూర్చోబెడదామని చూసే మీ ప్రవర్తనే అధర్మమైంది గాని నాది కాదు. రాముడిని కారాగారంలో వేస్తే దండించినట్లు గానీ, సాధువైన ఆయనను రాజ్యభోగాల నుండి విడిపించి, ఆయనకు ఇష్టమైన తపస్సు కొరకు పంపించడం ఏ విధంగా అన్యాయం అధర్మం అవుతుంది?' అంటుంది. ఈ విధంగా వ్యక్తి తన ద్వేషానికి అన్యాయానికి కూడా ధర్మమనే పేరుపెడతాడు.

ఇంకాస్త ముందుకు వెళ్ళి కైకేయి తెల్లవారేసరికి రాముడు అరణ్యానికి వెళ్ళకపోతే తాను ఆత్మహత్య చేసుకుంటానంటుంది. అందుకు దశరథుడు రాముడు అరణ్యానికి వెళితే నేను బ్రతకలేను కనుక ఈ విధంగా నువ్వో నేనో ఎవరో ఒకరమే బ్రతికి ఉంటాము అంటాడు. కైకేయి నేను చనిపోతే మాత్రం మీకు మాట తప్పిన కళంకం అంటుకుంటుంది. మీరు చనిపోతే ధర్మం కొరకు ప్రాణాలు విడిచిన కీర్తి, ఆ పుణ్యం వల్ల స్వర్గసుఖం మీకు లభిస్తాయి అంటుంది. అంటే చెప్పకుండానే నేను చావడం కన్నా మీరే చావండి అని చెప్పడమన్నమాట. ఈ విధంగా వ్యక్తి, స్వార్థానికి ధర్మమనే ముసుగు వేసి చూపుతాడు.

సమాజాన్ని ధరించేదాన్ని (ఆధారమై నిలిచే దాన్ని) ధర్మం అంటారు. కానీ సమస్య ఏమిటంటే ధర్మం సచేతన పదార్థం గానీ, వ్యక్తి గానీ కాదు కనుక స్వయంగా తాను ఏమిటి అనే విషయం వ్యాఖ్యానించి చెప్పలేదు. ఇక దాన్ని వ్యాఖ్యానించే వారు తమ అవసరం, స్వార్థం, సంస్కారం, యొక్క మార్గదర్శనంలో ధర్మాన్ని నిర్ణయించ ప్రయత్నిస్తారు. అందుకే న్యాయ స్థానాలలో వకీళ్ళు ఎంత విద్వాంసులైనా, న్యాయశాస్త్రాన్ని మథించినవారైనా సరే వారికి న్యాయనిర్ణయాధికారం ఇవ్వబడదు. వారు ఎవరో ఒకరివైపు



వాదిస్తూ ఉంటారు కనుక వారు తమ విద్వత్తుతో తమ వ్యక్తివైపే న్యాయం ఉందని నిరూపించ ప్రయత్నిస్తారే గాని, వ్యక్తి ఎవరైనా సరే న్యాయం ఎటువైపు ఉంటే అటువైపే విజయం ఉండాలని చూడరు. కనుక నిష్పక్ష పాతంగా ఏ ఒక్కపక్కకు ఒరగని న్యాయాధిపతికే *(Judge)* నిర్ణయాధికారం ఇవ్వబడుతుంది. ఆధ్యాత్మికరంగంలో కూడా అంతే. ధర్మనిర్ణయాధికారం తైత్తిరీయ ఉపనిషత్తు ద్వంద్వాతీతుడు, గుణాతీతుడు అయిన వ్యక్తికే ఇస్తుంది కాని కేవలం పాండిత్యం ఉన్నవారికి కాదు.

వేదం వృక్షం లాంటిది దాని ఫలం ధర్మం. ఈ పండులో మూడు భాగాలు ఉంటాయి. 1) పైతోలు, 2) లోపలి టెంక లేదా బీజం, 3) రసం; ఈ మూడింటితో బాటు పండును అలాగే తిన్నవారిని పశువులంటారు. రసాన్ని (సారాన్ని) విడిచి తొక్క, టెంక తిన్నవారిని పశువుల కన్నా హీనం అంటారు. నిజానికి ధర్మంలో ఈ మూడూ అవసరమే. పండు మీద తొక్క లేకపోతే రసం నిండా మలినం నిండి అశుద్ధమౌతుంది. టెంక (లేదా బీజం) లేకపోతే భవిష్యత్తులో వేదపరంపర అనే వృక్షసంపదే అంతమౌతుంది. ధర్మం వెలువరించే శబ్దాలు పైతొక్క లాంటివి. ఈ శబ్దాల రక్షణలోనే ధర్మం నిలుస్తుంది. ఫలశ్రుతి బీజం లాంటిది. ఫలితం మీద ఆశకొద్దయినా కొందరు ధర్మాన్ని ఆచరిస్తారు. (స్వర్గాది సుఖాపేక్షలో). ఈ విధంగా వేద ధర్మ పరంపర నిలిచి ఉంటుంది. కానీ కేవలం శబ్దం గానీ, కేవలం ఫలశ్రుతి గానీ ధర్మం కాదు.

*అనుచిత ఉచిత బిచార తజి జేపాలహి పితుబైన।*

*తే భాజన సుఖసుజసకే ఒసహి అమరపతి ఏన॥*

ఉచితానుచితాలను గురించి ఆలోచించకుండా ఎవరైతే తండ్రి ఆజ్ఞను పాలిస్తారో వారు ఈ లోకంలో సుఖాన్ని పొందుతారు, మరణించిన తరువాత వారికి స్వర్గలోకం లభిస్తుంది.

పరశురాముడు తండ్రి ఆజ్ఞ చేత తల్లిని సంహరించలేదా?

యయాతి కుమారుడు పురు, తండ్రి ఆజ్ఞను పాలించి తన యవ్వనాన్ని ఆయనకు ఇచ్చి సుఖ్యాతిని పొందాడు గాని, కుఖ్యాతిని పొందలేదు కదా! కనుక నువ్వు కూడా నీ తండ్రి ఆజ్ఞను పాటించి రాజ్యం స్వీకరించు అంటాడు వసిష్ఠ మహర్షి.

తండ్రి మాట వినని ప్రహ్లాదుడు, అన్నమాట వినని విభీషణుడు, గురువు మాట వినని బలిచక్రవర్తి, ఇంట్లో ఎవరి మాటా వినని గోపికా స్త్రీలు హరిని పొందలేదా? పై వాక్యాలు అదుపుతప్పిన అలవాట్లతో దుర్వ్యసనాలకు లోనయి తండ్రిమాట వినని కుమారుల కొరకే గాని అందరి కొరకు గాదు. పరశురాముడు భగవదవతారం. ఆయనకు తండ్రి యొక్క శక్తియుక్తులు కూడా తెలుసు. అందుకే ఆయన ఆజ్ఞను పాలించి, ఆయనను సంతోషపెట్టి మళ్ళీ తల్లిని బ్రతికించుకున్నాడు.

ఇంద్రియాలన్నీ అదుపులో ఉన్న ధర్మాత్ముడైన తండ్రి ధర్మాధర్మ విచక్షణ చేయగలడు. కానీ రోగం వల్ల గాని, మత్తు పదార్థాలకు లోనై గానీ, వృద్ధాప్యంవల్ల గానీ, ఇంద్రియాలపైన అదుపు కోల్పోయిన, మతి చాంచల్యం కలిగిన తండ్రి మాట వినవచ్చా? ఒక ఉపాధ్యాయుడు తాగిన మత్తులో 'నేను చచ్చిపోయాను నన్ను స్మశానానికి తీసుకువెళ్లి తగలెయ్యండి' అని అరుస్తున్నాడు. గురువుగారు చెప్పారు కదా అని శిష్యులు ఆయన చెప్పినట్లు చేస్తే ఎలాగుంటుంది? దశరథుడి విషయం కూడా అంతే.

*ఉన్మత్తం భ్రాన్తమానసం కైకేయీ వశవర్తినమ్*
*బధ్వానిహన్తి భరతం తద్బన్ధూన్మాతులానపి*

ఉన్మత్తుడు, భ్రాంతి పొందిన మనస్సు గలవాడు, కైకేయి వశుడైన దశరథుడిని బంధించి భరతుడిని అతడి బంధువులను మేనమామలను చంపుతాను అంటాడు రాముడితో లక్ష్మణుడు.



శారీరక వాంఛ అనే మత్తుకు లోనైన ఆయన ఆజ్ఞానుగమనం కన్నా, విచక్షణాయుతమైన రామధర్మపథమే తనకు గమ్యమన్నాడు భరతుడు.

ధర్మసారాన్ని చెప్పిన భరతుడినే ముగ్గురు మాతలు, పురజనులు, చివరికి రాజగురువు వసిష్ఠుడు కూడా అనుసరించదలిచారు. చిత్రకూటం వైపు వారి ప్రయాణం సాగింది.

అవతారిక:- 42వ మంత్రంలో భరతుడి ధర్మనిర్ణయాన్ని వర్ణించిన వేదమాత, విశ్వామిత్ర మహర్షి ద్వారా రాముడు అయోధ్య నుండి చిత్రకూటానికి చేసిన ప్రయాణ కథాసారాన్ని అందించబోతోంది.

## 43వ మంత్రం :

**ఓషు స్వసారః కారవే శృణోత యయౌ వో దూరాదనసా రథేన।**
**నిషూనమధ్వం భవతా సుపారా అధో అక్షాః సిన్ధవః స్రోత్యాభిః॥**
(ఋగ్: 3-33-9)

తాత్పర్యం :- వనానికి వెళ్లిన రామలక్ష్మణులను అనుసరిస్తూ వెనుక వచ్చిన విశ్వామిత్రుడు మధ్యమార్గములో ఎదురైన నదిని (వేదశ్రుతిని) ఇలా ప్రార్థించాడు. సోదరిలాంటి ఓ నదీ!, నీవు నా మధుర వచనాలు విను!. రాక్షసవధకర్త రాముడు నీ వద్దకు వచ్చినపుడు నీవు మార్గం ఇవ్వు (ఇచ్చావు). దానితో ఆయనను గుఱ్ఱాలు దాటించగలవు (దాటించాయి).

వ్యాఖ్యానం :- మొదటిసారిగా వేదం చదివినప్పుడు చాలా మంది ఆశ్చర్యపోతారు. ఈ ఋషుల మనస్థితిగానీ, వారి వ్యవహారముగాని వారికి కాస్త అసహజముగా కనిపిస్తుంది. వాళ్లు నదులతోనూ, కొండలతోనూ చెట్లతోనూ మాట్లాడుతూ, వాటిని ప్రార్థిస్తూ, వాటిని సహకరించమని వేడుకుంటూ కనిపిస్తారు. వేదం యొక్క ఈ ప్రభావం పురాణ ఇతిహాసాల

మీద కూడా కనిపిస్తుంది. శివపురాణంలో పర్వతరాజు హిమవంతుడి (హిమాలయ పర్వతం) కుమార్తె పార్వతిని శివుడు వివాహమాడుతుంటే ఆ పెండ్లికి అన్ని పర్వతాలు మనుష్యరూపాలు ధరించి వచ్చాయని కనిపిస్తుంది. ఇక అనేక రామాయణాలలో హనుమంతుడితో మైనాకుడనే పర్వతం మాట్లాడటం, రాముడు సముద్రంతో మాట్లాడటం, వానరులు జటాయువు ఆది పక్షులు మాట్లాడటం రాముడి పట్టాభిషేక సమయంలో వేదాలు మనుష్యరూపంలో వచ్చి స్తుతించటం లాంటివి కనిపిస్తాయి.

ప్రస్తుతం ఇదంతా మనకు అసహజంగానూ, అసంభవంగాను కనిపిస్తుంది. కానీ నిరంతరం ప్రకృతి ఒడిలో నివసిస్తూ సాధన చేసినవారికి ఇది అసంభవం మాత్రం కాదు. ఈ సృష్టిలో ప్రాణం లేని పదార్థం అంటూ ఏమీ లేదు. మనిషితో పోల్చుకున్నప్పుడు జంతువులలోనూ, జంతువులతో పోల్చుకున్నప్పుడు వృక్షాలలోనూ, వృక్షాలతో పోల్చుకున్నపుడు రాళ్లురప్పలలోనూ చేతనత్వం తక్కువగా ఉంటుంది. ఇది స్థాయి (అభివ్యక్తం)లో భేదమేగాని స్వరూపంలో భేదం కాదు.

ఈ ప్రకృతితో తాదాత్మ్యాన్ని (ఏకత్వాన్ని) పొందినవారు చెట్ల తోనూ, రాళ్లతోనూ, నదులతోనూ, జంతువులతోనూ, పక్షులతోనూ కూడా మాట్లాడగలుగుతారు. వాటి భాషను అర్థం చేసుకోగలుగుతారు. మహర్షు లందరూ ఆ స్థాయికి చెందినవారే. వారికి గోచరించే ప్రపంచం, మనకు కనిపించే సృష్టి కన్నా భిన్నంగా ఉంటుంది. అలా ప్రకృతితో సఖ్యం చేయగల స్థితి అందరికీ కలిగిననాడు మన సమస్యలన్నీ తీరగలవు.

వనగమనానికి సిద్ధమైన రాముడి వెంట ఆరవ ప్రాణంలాగా లక్ష్మణుడు, నీడలాగా సీత వెంబడించారు. దశరథుడి ఆజ్ఞతో మంత్రి సుమంత్రుడు ఆ ముగ్గురినీ రథంలో తీసుకొని అరణ్యానికి బయలు దేరాడు. ఎందరో ప్రజలు రాముడిని విడిచి ఉండలేక రథం వెంట బయలుదేరారు. వారికి శ్రమ కలగకుండా రథం మెల్లిగా నడిచింది. తమసానదీతీరాన ఆ రాత్రి వారు విశ్రమించారు.



ప్రయాణపు బడలిక, ఆహారము లేమితనము వల్ల డస్సిపోయిన జనులు దేవమాయ వల్ల గాఢ నిద్రకు లోనైనారు. రాముడి ఆజ్ఞతో అర్ధరాత్రి రథం ఎటు వెళ్లిందో తెలియకుండా ఉండటానికి దాన్ని అటూ ఇటూ తిప్పి సుమంత్రుడు రామ లక్ష్మణ సీతలను రథమెక్కించుకొని ముందుకు సాగిపోయాడు. వారు వేదశ్రుతి, గోమతి స్యందికా నదులను దాటి శృంగవేర పురానికి చేరారు.

ఆ రాత్రికి వారు గంగానదీ తీరాన విశ్రమించారు. కందమూల ఫలాలు తిని భూమి మీద శయనించిన సీతారాములను చూసి కంటనీరు పెడుతూ గుహుడు లక్ష్మణునితో 'ఆహా! దుర్మార్గురాలైన కైకేయి వల్ల కదా, సుకుమారులైన సీతారాములకు ఈ కష్టం దాపురించింది' అన్నాడు. అపుడు లక్ష్మణుడు.....

*సుఖస్య దుఃఖస్య న కో2పి దాతా పరో దదాతీతి కుబుద్ధిరేషా।*
*అహం కరోమీతి వృథా2 భిమానః స్వకర్మసూత్ర గ్రథితో హి లోకః॥*

'సుఖ,దుఃఖాలిచ్చేవాడు ఎవడూ లేడు. ఎవడో పరుడు ఇస్తాడు అనడం కేవలం కుబుద్ధి గలవారి లక్షణం. నేను చేస్తున్నాను అనేది కూడా వృథా అభిమానమే. తమ తమ కర్మలనే తాళ్లచేత లోకంలో అందరూ కట్టబడుతున్నారు' అన్నాడు. గుహుడు ఆశ్చర్యంగా చూస్తూ 'ఏమిటీ? పరమాత్మకు కూడా ప్రారబ్ధమా?' అన్నాడు. లక్ష్మణుడు నవ్వుతూ 'ప్రస్తుతం రాముడు బాధపడుతున్నాడా, నువ్వా? అన్నాడు. గుహుడు 'నేను బాధపడుతున్నాను అన్నాడు'. 'అపుడు అది నీ ప్రారబ్ధమవుతుంది గాని సుఖంగా నిద్రిస్తున్న రాముడి ప్రారబ్ధం ఎలా అవుతుంది?' అన్నాడు.

ఉదయం నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని, గంగానదిలో స్నానం చేసి, మర్రిపాలతో జటలు ధరించి, సుమంత్రుడిని అయోధ్యకు తిరిగిపంపి, గుహుడు గంగను దాటించగా సీతారామలక్ష్మణులు ముందుకు సాగి పోయారు. సాయంకాలానికి వారు ప్రయాగలోని భరద్వాజ ఆశ్రమం చేరారు.

ఆరోజు రాత్రి అంతా అనేకమంది మునుల సత్సంగంలో కాలం గడిపి, తన సౌందర్యంతో వారి కండ్లను సంతుష్టిపరచి ఉదయం త్రివేణిలో స్నానం చేసి, భరద్వాజముని శిష్యుల రూపాలలో నాలుగు వేదాలు మార్గదర్శనం చేస్తుండగా ముందుకు సాగిపోయారు సీతారామలక్ష్మణులు. యమునానదిని చేరగానే, ఆ నలుగురు శిష్యులను కూడా వెనక్కు పంపి, సాధన వేదవిదిత మార్గంలో జరగాలని కానీ వేదాన్ని కూడా పట్టుకు వేళ్లాడకుండా దాన్ని కూడా త్యాగం చేసి ముందుకు సాగాలని ఉపదేశిస్తూ రామాయణం (రాముడి అయనం=ప్రయాణం) ముందుకు సాగింది.

ముందుకు సాగిపోతున్న రాముడు సీతమ్మ అలసిపోయి ఉండటం చూసి దారిపక్కన ఉన్న చెట్టుకింద విశ్రమించమని సీతాలక్ష్మణులను ఆజ్ఞాపించాడు. పురుషులకే మోహాన్ని కలిగించే రాముడిని చూసి దారిన వెళ్లేవారు, దగ్గర పొలాలలో పనిచేసుకొనేవారు ఎందరో వచ్చి ఆయన చుట్టూ చేరి సత్సంగం చేయటం మొదలెట్టారు. కొంతదూరంగా వెళ్లి కూర్చున్న సీతమ్మ చుట్టూ గ్రామవనితలు చేరి ఆ కూర్చున్నవారిలో నీ భర్త ఎవరో చెప్పమన్నారు. ఆవిడ తలమీద కొంగు కప్పుకొని సిగ్గుపడుతూ వారికి రాముడిని సూచించింది. జ్ఞానమార్గావలంబులు ఈ సన్నివేశానికి 'నేతి-నేతి' ఇదికాదు-ఇదికాదు అనే విధానంలో రూపమయ జగత్తునంతా నిరాకరించి, కూటస్థుడయిన పరమాత్మను సూచించకుండానే సూచించటం జరిగిందని అర్థం చెబుతారు. వ్యవహారిక దృష్టి కలవారు 'భర్తను వేలెత్తి చూపటం అమర్యాద కనుక లక్ష్మణుడు తన మరిదిగా చెప్పటంతో రాముడు తనకు ఏమౌతాడో చెప్పకుండానే చెప్పటం జరిగిందని' అర్థం చెబుతారు.

పరమాత్మ పరిచయాన్ని పొందటానికి అనేక మార్గాలు... తన చిన్నప్పుడే ఎక్కడో దూరదేశాలకు వెళ్లిన తండ్రి ఇంటికి తిరిగి రాగా ఆయనను గుర్తించలేక మీరెవరని సూటిగా ఆయననే అమాయకంగా అడగటం హనుమంతుడి శిశుసాధన. జ్ఞానస్వరూపుడైన జనకుడు, తపో



స్వరూపుడైన విశ్వామిత్రుని మధ్యలో నిలుపుకొని ఆయన ద్వారా రాముడి పరిచయం అడుగుతాడు. కాని రాముడెవరనే విషయం స్పష్టంగా మిత్రుడైన గుహుడికి, శత్రువైన రావణుడికి తెలియజేసేది మాత్రం వైరాగ్య స్వరూపుడైన లక్ష్మణుడే. భిల్లులు, కోయవాళ్లకు దోపిడీ చేసే కుబుద్ధే కనుక 'మనహురంక నిధి లూటనలాగే' బికారికి నిధి దొరికితే ఎంత ఆత్రంగానైతే దోస్తాడో అలాగే రాముడి సౌందర్యాన్ని ఆస్వాదించారు శృంగవేర పుర ప్రజలు. జనకపురం తోటలో రాముడిని చూసిన సీత చెలికత్తెలు 'హరషే జను నిజనిధి పహిచానే'-ఏనాడో పోగొట్టుకున్న నిధిని తిరిగి చూడగా కలిగిన ఆనందంతో కనురెప్పలు మూయటం మరిచి పోయారట. ఈ లోకంలో అభిరుచి, సంస్కారాన్ని బట్టి సాధన, పరమాత్మ సాక్షాత్కారం ఉంటాయి.

కానీ తన పురాతన ప్రీతిని గోప్యంగా దాస్తూ, భక్తిమాత సీత 'చలీ అగ్రకరి ప్రియసఖిసో-ఈ'-తన ముందొక చెలికత్తెను ఉంచుకొని రాముడిని చూడడానికి బయలుదేరింది. 'లోచన మన రామహి ఉర ఆనీ, దీన్హేపలక కపాట సయానీ'- తన కండ్లు అనే ద్వారం గుండా రాముడనే హృదయంలోకి తీసుకువెళ్లిన సీత వెంటనే రూపం బైటికి రాకుండా కనురెప్పలనే తలుపులు మూసేసింది. ఇది భక్తిలో గోప్యత.

మాయా ఆవరణ (ముసుగు) తొలగితేగాని రాముడి పరిచయం లభించదంటుంది జ్ఞానం. కానీ పూర్తి ఆవరణను తొలగించకూడదు. ఇది ప్రేమ. ప్రేమలో గోప్యత ఉంటుంది అంటుంది భక్తి. అందుకే ఈ రోజు తలమీద కొంగు కప్పుకొని ముఖాన్ని కొంత దాచిపెట్టి సిగ్గుపడుతూ భక్తిమాత రాముడిని సూచిస్తోంది. అవును మరి!, రత్నం దొరికితే కొంగున ముడివేసుకుంటారుగాని దారినపోయే దానయ్యాకెల్ల పిలిచి చూపిస్తారా అంటాడు కబీరుదాసు.

ముందుకు వస్తున్న రాముడికి మేఘాలు ఛత్రం పడుతున్నాయి. తన స్వామి చరణాలకు బాధ కలగకుండా భూదేవి ముళ్లు, రాళ్లు తొలగిస్తూ

మార్గాన్ని సుగమం చేస్తోంది. అలా సాగిన వారు ముందుకు వెళ్లి వాల్మీకి ఆశ్రమాన్ని చేరారు. మహర్షి వాల్మీకి ఆనందాశ్రువులు ప్రవిస్తుండగా తన ఆశ్రమానికి విచ్చేసిన ముగ్గురు అతిథులను ఆదరంతో ఆహ్వానించి అర్ఘ్య పాద్యాలిచ్చి సుఖాసీనులను చేసి కందమూల ఫలహారాన్ని అందించాడు. కొంత సమయం సత్సంగం తరువాత రాముడు 'ఈ అరణ్యావాస సమయంలో నివసించటానికి మాకేదైనా మంచి స్థలాన్ని సూచించండి మహర్షి' అని అడుగుతాడు. దానికి ఆయన నవ్వుతూ 'ముందు మీరు ఎక్కడ లేరో చెబితే ఆ తరువాత ఎక్కడ ఉండాలో నేను చెబుతాను' అన్నాడు. మహర్షి జవాబు విని నవ్వుతూ 'నేను అంతటా ఉన్నవాడినయితే అయోధ్య నుండి ఎలా పంపించబడతాను, పైగా నేను ఒక్కడినే అయితే ఎక్కడైనా కాలం గడపగలిగేవాణ్ణి. కాని నా వెంట సీతాలక్ష్మణులు కూడా ఉన్నారు కనుక మాకు ఈ **14** సంవత్సరాలు ఉండటానికి ఏదైనా స్థలం సూచించండి' అన్నాడు. అప్పుడు వాల్మీకి మహర్షి మళ్లీ 'మీ కథ అనే నదిని ఎంత స్వీకరించినా తృప్తి చెందని సముద్రంలాంటి చెవులు ఎవరికైతే ఉంటాయో వారి హృదయాలలో మీరు సీతా లక్ష్మణ సమేతంగా నివసించండి. చంద్రుణ్ణి ఎంత చూసినా తృప్తి చెందని చకోరాలలాంటి కండ్లతో నిరంతరం మీ రూపమాధుర్యాన్ని ఎంత చూసినా సంతుష్టి పొందని కండ్లు గలిగి మేఘం లాంటి మీ కొరకు ఆశతో ఎదురుచూస్తూ ఉంటారో, ఎవరి హృదయాలైతే మీ ముగ్ధమనోహర రూపమనే జలబిందువు చేతనే ఆర్ద్రమవుతూ అన్యజలాశయాలను ఇచ్ఛగించవో వారి హృదయాలు మీకు సుఖదాయకమైన నివాసగృహాలు. అక్కడే మీరు సీతాలక్ష్మణ సమేతంగా నివసించండి. మీ యశ(కీర్తి) రూప మానససరోవరంలో నాలుకను ముంచే ఆడసింహాలలాగా నిరంతరం మీ కథాగానమే తప్ప మరొకటి చేయనివారు, కేవలం మీ గుణగానమనే ముక్తాఫలాలనే ఏరుకుతినేవారు ఎవరో వారి హృదయాలలో ఓ రామా! సీతా లక్ష్మణ సమేతముగా నివసించు. ఎవరైతే



మీ పవిత్ర ప్రసాద సుగంధాన్ని ఆదరంతో ఆఘ్రాణిస్తూ, నీకు అర్పించిన భోజనాన్నే స్వీకరిస్తూ, వస్త్రాభూషణాలను కూడా మీ ప్రసాదబుద్ధితోనే తీసుకుంటూ ఉంటారో, దేవ,గురు,ద్విజులను చూడగానే వినయంతో ఎవరి తల అయితే నమస్కరిస్తుందో, నిరంతరం ఎవరి చేతులు నీ పూజ చేస్తూ ఉంటాయో, ఓ రామచంద్రా!, నీవు సీతా లక్ష్మణ సమేతముగా వారి హృదయాలలో నివసించు. మీ పుణ్యక్షేత్రదర్శనానికై ఎవరి కాళ్లయితే వెళుతూ ఉంటాయో వారి హృదయంలో నివసించండి. నిరంతరం నీ జపం చేసేవారి, పరివార సహితంగా నీ పూజచేసేవారి, నానావిధాలుగా తర్పణ హోమాలు చేసేవారి, విప్రులతో భోజనాలు చేయించేవారి, దానాలు చేసేవారి, నీ కన్నా ఉత్తమ స్థానాన్ని హృదయంలో తమ గురువుకు ఇచ్చి వారిని సన్మానిస్తూ వారి సేవ చేస్తూ ఉండేవారి, ఎన్ని అనుష్ఠానాలు చేసినా చివరికి నీ చరణ కమలాలపైన భక్తి అనే ఫలాన్ని కోరుకునేవారి హృదయకమలంలో ఓ రామభద్రా!, నీవు సీతాలక్ష్మణ సమేతంగా నివసించు. కామ, క్రోధ, మద, మాన, మోహ, లోభ, క్షోభ, రాగ, ద్వేష, కపట, మాయ, దంభాదులు ఎవరి హృదయంలోనైతే ఉండవో వారి హృదయంలో ఓ రఘువరా! నీవు సీతాలక్ష్మణ సమేతముగా నివసించు. అందరికి ప్రియమైనవారి, అందరికి మంచిచేసేవారి, సుఖదుఃఖాలు మానావమానాలు సమానంగా స్వీకరించే వారి, ఆలోచించి సత్యప్రియ వచనాలు చెప్పేవారి, మేల్కొంటూ నిదురిస్తూ నీశరణు పొందేవారి, నీవు తప్ప మరొక గతిని ఎరుగనివారి, పరాయి స్త్రీని తల్లిలా చూసేవారి, పరాయి ధనాన్ని విషం కన్నా చేదుగా భావించేవారి హృదయంలో ఓ కాకుత్సా!, సీతాలక్ష్మణ సమేతముగా నివసించు. ఇతరుల సంపత్తి చూసి ఆనందించే వారి, ఇతరుల విపత్తిని చూసి బాధపడేవారి, తమ ప్రాణం కన్నా ప్రియమైన వారి మనస్సు నీకు మంగళమయ నివాసమగుగాక. నిన్నే గురువు, దైవము, తల్లిదండ్రి, సఖుడిగా భావించే వారి మనోమందిరములో ఓ ఇక్ష్వాకు కులతిలకా! నీవు సీతాలక్ష్మణ సమేతముగా నివసించు. ఇతరుల అవగుణాలను విడచి

సుగుణాలను స్వీకరించేవారి, విప్రుల కొరకు గోవుల కొరకు కష్టాలను సహించేవారి, నీతినిపుణుల హృదయాలలోనూ రామా! సీతాలక్ష్మణ సమేతముగా నివసించు. తమలోని గుణాలను నీవిగాను, దోషాలను తమవిగానూ, నీపై పూర్తి విశ్వాసం ఉన్నవారి, నీ భక్తులను ప్రేమించే వారి హృదయాలలో శ్రీరామా! వైదేహీసౌమిత్రి సహితముగా నివసించు. జాతి, కుల,ధన,ధర్మాలను, గౌరవమర్యాదలను, కుటుంబాన్ని విడచి నీలోనే ప్రాణాలన్నీ నిలుపుకున్నవారి హృదయాలలో సీతాలక్ష్మణ సహితముగా నివసించు. స్వర్గనరక మోక్షాలను సమానదృష్టితో చూసేవారి, ధనుర్బాణ ధారివైన నీ రూపాన్ని సర్వత్రా చూసేవారి, మనసా వాచా కర్మణా నీకు దాసులైన వారి హృదయంలో నీవు నీ శిబిరాన్ని నిర్మించు. ఓ రామా!, ఎప్పుడూ ఏమీ కోరనివారి, స్వాభావికంగా నీపై ప్రేమ గలవారి హృదయాలలో నిరంతరం నివసించు, అదే నీ ఇల్లు' అని ఆధ్యాత్మిక దృష్టితో 14 నివాస స్థానాలు వివరించిన మహర్షి వాల్మీకి కామదగిరి అని పిలవబడే చిత్ర కూటంలో కుటీరాన్ని నిర్మించుకొని ఉండమని చెప్పాడు.

ఒక మూర్తికారుడు శిల్పాన్ని మలచదలచినపుడు ఏ పదార్థంలో దాన్ని చెక్కాలి అనే విషయాన్ని గూర్చి ఆలోచించాలి. ఇది ఆలోచనా స్థాయి. రాతిలోగాని, చెక్కలోగాని లేక ఏదైనా లోహంలోగాని దాన్ని చేయాలని ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తాడు. ఆ తరువాత తాను మలచవలసిన రూపాన్ని ముందు హృదయంలో నిర్మిస్తాడు. ఇది ఉపాసనా స్థాయి. దాన్నే చివరికి బైట అందరికీ కనిపించేట్టుగా మలుస్తాడు. ఇది క్రియాస్థాయి.

తానెక్కడ నివసించాలి అని ప్రశ్నించిన రాముడికి వాల్మీకి మహర్షి కూడా ఈ మూడు స్థాయిలలో జవాబిచ్చాడు. సర్వవ్యాపి అయిన రాముడు ఎక్కడ లేడని ప్రత్యేక స్థలంలో ఉండమని చెప్పాలి? కనుక ముందు మీరు ఎక్కడ లేరో చెప్పమన్నాడు. ఇది దార్శనిక సత్యం. కానీ కోటాను కోట్లమందిలో ఏ ఒకరిద్దరికో ఈ సర్వవ్యాపకతత్వం అవగతమౌతుంది.



కానీ ఈ దార్శనిక సత్యానికి భావాత్మకరూపం క్రియాత్మకఆకృతి లభించకపోతే జీవితంలో సమగ్రత కనిపించదు. ఈశ్వర సర్వవ్యాపకత వ్యక్తి సమస్యలకు సమాధానం చెప్పలేదు. రాతిలో మూర్తి ముందే దాగి ఉంటుంది. కానీ ఎంతమంది దాన్ని హృదయగతం చేసుకోగలరు? ఎంత మంది రూపరహితమైన ఆ రాతిని పూజించి సాధనలో పురోగమించ గలరు? ఆ రాతిపై సామాన్యప్రజలకు శ్రద్ధ కలగడం చాలా కష్టం.

రాముడు సర్వవ్యాపే కాని వైరాగ్యరూప లక్ష్మణుడు, భక్తిరూప సీత సర్వ వ్యాపకులు కారు. భక్తి వైరాగ్య రహితమైన సర్వవ్యాపక పరమాత్మ కేవలం ద్రష్ట, సాక్షి, కూటస్థుడు అవుతాడే గాని క్రియాన్వితుడు కాడు. అందువల్ల ధర్మసంస్థాపన కూడా సాధ్యం కాదు. రాముడి వెంటవుండే భక్తి ఆయనను ద్రష్టగా ఉండనివ్వదు. భజించేవారిని అనుగ్రహించేలా చేస్తుంది. అలాగే రాముడి వెంటవుండే లక్ష్మణుడు ఆయనను నిష్క్రియంగా ఉండనివ్వడు. దుష్ట సంహారానికి ప్రేరణనిస్తాడు.

జ్ఞానులకు సర్వవ్యాపి అయిన రాముడు చాలు. ఉపాసకులకు సీతారాముడు, కష్టాలలో ఉన్నవారిని రక్షించటానికి రామలక్ష్మణులు కావాలి. జ్ఞానంతో బాటుగా ఈ భావాన్ని (ఉపాసన) క్రియను పూర్తి చేయటం కొరకు రాముడు వాల్మీకి మహర్షి వద్ద శెలవు తీసుకొని మందాకినీ నదీ సమీపములో ఉన్నతంగా నిలిచివున్న చిత్రకూటాన్ని చేరి, భిల్లుల సహాయముతో అక్కడ ఒక కుటీరం నిర్మించుకొని నివసించటం మొదలు పెట్టాడు.

అవతారిక: 43వ మంత్రం వరకూ శ్రీరామచంద్ర వనగమనాన్ని చిత్రకూట నివాసాన్ని వర్ణించిన వేదమాత 44, 45 మంత్రాలలో భరతయానాన్ని (భరతుని ప్రయాణాన్ని) ప్రేమ రూప భరత హృదయగతిని కనుగొని వ్యాఖ్యానించిన భరద్వాజుడి కథ చెప్పబోతోంది.

**మంత్రాలు : 44,45**

**అతారిషుర్భరతా గవ్యవః సమభక్త విప్రః సుమతిం నదీనామ్।**
**ప్ర పిన్వధ్వ మిషయన్తీః సురాధా ఆ వక్షణాః పృణధ్వం యాత శీభమ్॥** (ఋగ్: 3-33-12)

విశ్వామిత్ర ఉవాచ :-

**యదఙ్గ త్వా భరతాః సన్తరేయుర్గవ్యన్ గ్రామ ఇషిత ఇన్ద్రజూతః।అర్వాదహ ప్రసవః సర్గతక్త ఆ వో వృణే సుమతిం యజ్ఞియానామ్॥** (ఋగ్: 3-33-11)

తాత్పర్యము:- రాజ్యాన్ని త్యాగం చేసి నదిని దాటివచ్చిన బుద్ధిమంతుడైన భరతుడికి భరద్వాజ మహర్షి చక్కని అతిథి సత్కారం చేశాడు. ఆయన తన సిద్ధులతో భరతుడి సేనను స్వాగతించాడు.

'ఓ అంగమహానదీ! భరతుడిని దాటనిచ్చిన నువ్వు పూజార్హురాలవు. యజ్ఞంలో యజ్ఞకర్తల ద్వారా నీవు సుందర బుద్ధిప్రధాత్రివిగా పొగడబడతావు' అని విశ్వామిత్రుడు నదిని స్తుతించాడు. రాముడి ఆజ్ఞ చేత కఠిన వ్రతాన్ని ఆచరిస్తూ భరతుడు నందిగ్రామంలో నివసిస్తూ రాజ్యం చేయసాగాడు.

వ్యాఖ్యానము:- తన ప్రేమయుతమైన సంభాషణతో మంత్రముగ్ధులను చేసిన భరతుడు, ముగ్గురు తల్లులను గురువు వసిష్ఠుడిని సభాసదులను చతురంగబలాలను తీసుకొని రాముడిని వెనక్కు తీసుకురావడానికి అరణ్యానికి బయలుదేరాడు. తెల్లారితే ప్రయాణమనగా ఆ రాత్రి పుర జనులు ఎవరూ నిద్రించలేదు. 'తమసానదీ తీరాన ఒకసారి నిద్రించడం వల్లనే శ్రీరాముడి నుండి దూరమైనాము కనుక మళ్లీ ఇప్పుడు నిద్రించి పరమాత్మనుండి దూరం కాకూడ'దని వారు నిర్ణయించుకున్నారు.



ఉదయమే బయలుదేరిన అయోధ్యాపురవాసులు, రాముడు ఒకరోజు ప్రయాణించిన దూరాన్ని మూడురోజులలో చేరుకున్నారు. నాలగవరోజు ఆ జనసమూహం శృంగవేరపురానికి దగ్గరగా వచ్చింది. అపారమైన సేన భరతుడి వెంటఉండటంతో నిషాదరాజు గుహుడికి 'అతను రాముడికేమైనా హాని చేయడానికి వెళుతున్నాడేమో' అనే అనుమానం కలిగింది. భరతుడిని ఎదుర్కోడానికి తన సేననంతా సమాయత్తం చేశాడు. అయినా కొందరు వృద్ధుల సలహాపై భరతుడి హృదయభావాన్ని తెలుసుకోవడానికి మూడు బుట్టలలో చేపలు, మాంసం, పండ్లు తీసుకొని భరతుడికి ఎదురు వెళ్లాడు. 'తమోగుణం లేదా రజోగుణానికి లోనైన వ్యక్తి మాంసాన్ని చేపలను ఇష్టపడతాడు. అటువంటి వ్యక్తి రాముడికి హాని చేస్తాడు' అనటంలో సందేహంలేదు. లేక పండ్లను స్వీకరిస్తే అతను సాత్వికుడు. అట్టి వ్యక్తి వల్ల మాత్రం హాని సాధ్యం కాదు.

ఈ విషయం ఎలా ఉన్నా, అసలు భరతుడు రాముడిని పిలుచుకోడానికి వస్తూ సైన్యాన్ని ఎందుకు వెంటబెట్టుకువచ్చాడు అనేది ప్రశ్న. దానికి జవాబుగా మహాత్ములు రాముణ్ణి భరతుడు అరణ్యంలోనే పట్టాభిషిక్తుణ్ణి చేసి అయోధ్యకు తీసుకుపోదలచుకున్నాడని చెబుతున్నారు. అందుకు కావలసిన సంభారాలను, సింహాసనాన్ని కూడా వెంటబెట్టుకు వెళ్లాడు. కొత్తగా జరిగే మహరాజ పట్టాభిషేకంలో పాల్గొని, ఆ రాజు ఎడల తమ నిష్ఠను ప్రకటించవలసిన అవసరం సైన్యానికి ఉంటుంది. అందుకే సైన్యం కూడా భరతుని వెంట కదిలింది.

'అసలు రాముడి పట్టాభిషేకాన్ని భరతుడు అరణ్యంలో ఎందుకు చేద్దామనుకున్నాడు? రాముణ్ణి అయోధ్యకు తీసుకువచ్చిన తర్వాత చేయవచ్చుకదా?' అనేది మరో ప్రశ్న.

భరతుడి భావుకత చాలా లోతైనది. దీన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఒక కోటీశ్వరుడిని పిలిచి 'మీరు లక్షాధికారులు' అంటే అతనికి

సన్మానమా లేక అవమానమా? అవమానమే కదా! ఏ విరాట్పురుషుడి ఒక్కొక్క రోమంలో అనంతకోటి బ్రహ్మాండాలున్నాయో, ఆయనను తీసుకువచ్చి, భూమి అనే గ్రహం మీద ఒక ఖండంలో ఉన్న చిన్న సూర్యవంశ సింహాసనం మీద కూర్చోబెట్టడం కూడా అటువంటిదే. కనుక స్వయంగా మనమే సింహాసనాన్ని ఆయన వద్దకు తీసుకువెళ్ళి 'మీ కొరకుగాకున్న, మా కొరకు-మా నేత్రానందం కొరకు ఈ చిన్న సింహాసనం మీద కూర్చోండి', అని విన్నవించుకోవటమే ఉత్తమం-అని భరతుని భావన.

ఎదురొచ్చిన నిషాదరాజు గురు వసిష్ఠులవారిని చూసి దూరం నుండే నేల మీద సాష్టాంగ నమస్కారం చేశాడు. అతడిని గుర్తించి వసిష్ఠులవారు ఆశీర్వదించి భరతుడితో 'ఈయన నిషాదరాజు గుహుడు; శ్రీరామ చంద్రుని మిత్రుడు' అన్నారు. మరుక్షణం భరతుడు రథం నుండి దూకి వెళ్లి గుహుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. 'నేను కేవలం శ్రీరాముడి సేవకుడినే; మరి ఈయన రాముడి మిత్రుడు, నా కన్నా ఉన్నతస్థానంలో ఉన్న ఈయనను ఇలా ఆదరించాలి' అని భరతుడి భావన.

పరమాత్మ సర్వవ్యాపకుడు-అనే విషయం దాదాపు ప్రతిశాస్త్రం లోనూ కనిపిస్తుంది; చాలామంది నోట కూడా వినిపిస్తుంది. కానీ ఆ సత్యాన్ని వ్యవహార జగత్తులో ఎంతమంది దర్శించడానికి, పాటించడానికి ప్రయత్ని స్తారు? పరిశుద్ధంగా ఉండటమనేది ఉత్తమగుణం. తెల్లని పంచ కట్టు కోవడం మంచిదే, కానీ ఎవరన్నా జారి బురదలో పడితే అసహ్యించు కోవడం మాత్రం ఉత్తమగుణం కాదు. దాన్ని 'చాకలి బుద్ధి' అంటారు. బట్టలు ఉతికి ఉతికి శుద్ధి యొక్క సంస్కారం అహంకారం యొక్క పరాకాష్ఠకు చేరుకుంటుంది. అందుకే రావణాసురుడి ఇంట ఉన్న సీతమ్మ పవిత్రతను శంకించాడు చాకలివాడు. కృష్ణావతార సమయంలో కూడా కంసుడి చాకలి, గొల్లవాడైన కృష్ణుడిని సంస్కారహీనుడని ఎంచి కంసుడి వస్త్రాలు ఇవ్వనంటాడు.



సర్వశాస్త్ర సంపన్నుడు, మహర్షి, బ్రహ్మవేత్త అయిన వసిష్ఠుడిలో కూడా ఈ సంస్కారం మిగిలిపోయి ఉంది. సర్వత్రా పరమాత్మను దర్శించవలసిన ఆయన స్వయంగా పరమాత్మ మిత్రుడని ఎగిరి గుహుడిని దూరంగా ఉంచే ఆశీర్వదించాడు. శీలవంతుడైన భరతుడు గురువులకు బోధించడం అవినయం కనుక చెప్పకుండానే ఆయన లోపాన్ని ఆచరణలో ఎత్తి చూపించాడు. సత్యం బంగారం లాంటిదైతే, శీలం స్పర్శవేది రాయి లాంటిది. బంగారం ఎంతో విలువైనది. కానీ స్పర్శవేది దేన్ని స్పృశిస్తే అది బంగారమవుతుంది. స్పర్శవేదిలాగా శీలవంతుడైన భరతుడు, ఈనాడు ఇనుము లాంటి గుహుణ్ణి బంగారంగా మార్చాడు. మహర్షులకు కూడా మార్గదర్శకమైనాడు. ఫలాలను బహుమతిగా స్వీకరించి గుహుడి సందేహాన్ని తీర్చాడు.

గుహుడు దారి చూపుతుండగా అయోధ్యానగరవాసులు ప్రయాగ పుణ్యక్షేత్రాన్ని చేరారు. భరద్వాజ మహర్షి కామధేనువును స్తుతించి, సైన్యానికి స్వర్గభోగాలను భువికి దింపాడు. ఆ భోగాలతో మునిగిన ప్రజలంతా తమ కార్యాన్ని మరిచారు. భరతుడు మాత్రం ఆ రాత్రి భరద్వాజాది మహర్షులతో సత్సంగం చేశాడు. రాముడిని అడవికి పంపిన కళంకం హృదయంలో ముల్లుగా గుచ్చుకుంటుండగా భరతుడు సిగ్గుతో తలవంచు కొని భరద్వాజ మహాముని ముందు కూర్చున్నాడు. ఆయన నవ్వుతూ 'నీకీ కళంకం ఆపాదింపబడటమే మంచిదైంది. దీని వల్ల రామభక్తి అనే రససిద్ధికి ప్రారంభోత్సవం అయింది. అంతేకాదు దీన్ని మేము మాకిచ్చిన ఉపదేశంగా భావిస్తున్నాము' అన్నాడు.

శాస్త్రాలలో అనేక మానసిక రోగాలు వర్ణించబడ్డాయి. వాటిని అదుపు చేయడానికి అనేక ఔషధాలు కూడా సూచింపబడ్డాయి. లోభం అనే మానసిక రోగం ఉన్నవాడికి దానం అనే మందు సూచించబడింది. మనో చంచలత అనే రోగానికి జపం అనే ఔషధం, క్రోధం అనే రోగానికి దయ అనే ఔషధం

నిర్ణయించబడ్డాయి. కానీ అసలు సమస్య ఏమిటంటే, ఈ మందుల వల్ల రోగాలు అణచివేయబడాతాయి. (బహుశ అలోపతి మందులై ఉంటాయి); కానీ నయం కావు. జిహ్వాచాపల్యంపై విజయం సాధించడానికి ఏకాదశి, శివరాత్రి మొదలైన పర్వాల్లో ఉపవాసం చేసే నియమం ఒకటి ఏర్పాటు చేయబడింది. కానీ ఉపవాసం చేసిన వ్యక్తి, ద్వాదశినాడు భోజనం చేసే పద్ధతి చూసినప్పుడు అతను యథాస్థితికి రావడం గాని, లేక అంతకన్నా పతనం అవడం కానీ జరిగిందని అనవలసి వస్తుంది. కేవలం ఒక్కొక్కసారి వైద్యుడు ఇచ్చిన మందుతో అసలు రోగమైతే తగ్గుతుంది కానీ, దానివల్ల ఉపఉత్పత్తి *(Side Effect)* గా మరొక కొత్తరోగం మొదలౌతుంది. జలుబు కొరకు మందులు వాడితే జలుబు తగ్గినా, 'స్కిన్ ఎలర్జీ' మొదలవటం లాంటిదే ఇది. మానసిక వ్యాధుల విషయంలో కూడా ఇలాగే జరుగుతుంది. లోభం అనే మానసిక రోగాన్ని తగ్గించడానికి దానమనే మందు వాడినప్పుడు లోభమైతే తగ్గుతుంది కానీ, అహంకారం అనే మరొక జబ్బు (నేను గొప్ప) దానకర్ణుణ్ణి అనే అహంకారం ఉపఉత్పత్తిగా ప్రారంభమౌతుంది. నిజానికి ఏ రోగి కూడా వైద్యశాస్త్రం నుండి తన రోగం తాత్కాలికంగా తొక్కిపెట్టబడటం గానీ, ఒక రోగం బదులుగా మరొక రోగాన్ని వరించవలసిరావడాన్ని గానీ కోరుకోడు. తన రోగానికి శాశ్వత నివారణను కోరుకుంటాడు.

భరద్వాజాది మహర్షులు త్రివేణీసంగమం అనే వైతరణిలో కూర్చొని, అనేక మంది మానసిక రోగులకు తమ ఉపదేశామృతం ద్వారా చికిత్స చేస్తున్నారు. కానీ తమ వద్దకు వచ్చే రోగుల (సాధకుల) లోనూ, స్వయంగా తమలో కూడా జబ్బులు (వికల్పాలు) చోటు చేసుకుంటూ ఉండటం చూశారు. ఉపదేశం చేసేవారిలో శ్రేష్ఠత అనే సాత్వికాహంకారం ఉత్పన్న మౌతుంది. ఇలా ఉపదేశాలు చేసి చేసి తాము అహంకారులవడం భరద్వాజ మహర్షి గ్రహించాడు. వాణి ద్వారా ఉపదేశం చేస్తూ, తమ లోపాలను



దాచుకునే వీరికి, భరతుడు తన ఆచరణ ద్వారా అహంకారరహిత ఉపదేశం చేశాడు. తనతో నిమిత్తం లేకుండా జరిగిన రామవనవాస ప్రక్రియలో తన తల్లి తప్పిదాన్ని తన తలపై వేసుకుని, ప్రజాక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని రామరాజ్య స్థాపనకై రాముడిని తేవడానికి అరణ్యానికి వెళుతున్న భరతుడు సర్వశ్రేష్ఠుడూ, సర్వసద్గుణ సంపన్నుడూ అయి ఉండి కూడా అందరికన్నా నీచస్థానంలో వినయంగాకూర్చొని మౌనంగా మహర్షులకు ఉపదేశిస్తున్నాడు. అయితే ఇంతకు భరతుడు చేసిన ఉపదేశమేమిటి? అనేది ప్రశ్న.

బంగారం సౌందర్యాన్ని పెంచే ఆభరణంగా ఉపయోగపడుతుందని చాలామందికి తెలుసు. కానీ బంగారం మందులు తయారుచేయడానికి కూడా ఉపయోగపడుతుంది. అయితే ఆభరణ రూపంలో ఉండే బంగారానికి, మందుల రూపంలో ఉండే బంగారానికి చాలా తారతమ్యం ఉంది. శరీరం పైన బంగారం స్పష్టంగా కనిపిస్తుంది. కానీ ఆయుర్వేద ఔషధాల తయారీలో బంగారాన్ని కాలుస్తారు. ఆ మందులలో బంగారపు మెరుపు కనిపించదు. పుటం పెట్టడం వల్ల ఇక్కడ బంగారం కాటుకలా నల్లగా మారుతుంది. మెరిసే బంగారానికి సౌందర్యమే తప్ప మరొక ఉపయోగం లేదు. కానీ నల్లగా మాడిపోయిన బంగారానికి ఆరోగ్యాన్నిచ్చే శక్తి వస్తుంది. నల్లటి మచ్చలాగా కళంకం అనే అపనింద ఆపాదించబడిన భరతుడు ఈ రోజు లోకోపకారానికి పనికి వస్తున్నాడు.

పాదరసం పరమ విషం. దానిని మింగినవాడెవడూ బతకడు. కానీ ఆయుర్వేదంలో దాన్ని కూడా పుటం పెట్టి, పుటం పెట్టబడ్డ బంగారంతో కలిపి ఔషధాలలో వాడతారు. అపరిపక్వమైన మనసు పాదరసంలాగా చంచలమైనది. ఇలా మనోపరిపక్వత లేని ఉపన్యాసకులు ఎన్నయినా ఉపదేశించవచ్చు. కానీ వాటివల్ల చెప్పిన వారికి గానీ, వినిన వారికి గానీ ఎటువంటి ఉపయోగం ఉండదు. కానీ రామభక్తి అనే రసం (పాదరసం) సిద్ధించడానికి, భరతుడి బంగారు హృదయంలో పుటం పెట్టబడి రామభక్తి

అనే రసంలో రంగరించబడి లోకోపయోగకరంగా మారింది. అటువంటి ఆ మహాత్ముడు భరతుడి వినయపూర్వక ఆచరణ, మౌనం చెప్పకనే అపరిపక్వమనస్కులైన ఋషులకు ఉపదేశంగా మారింది - అని భరద్వాజ మహర్షి సిద్ధాంతీకరించాడు.

ఆభరణము చేయడానికి కల్తీ బంగారమైతే గానీ సరిపోదు. కానీ ఔషధాలలో కలిపే బంగారం కల్తీలేనిదై ఉండాలి. భరతుడి హృదయగతమైన రామభక్తే (ప్రేమ) ఈ స్వచ్ఛమైన బంగారం, ఆ బంగారానికి రూపం, రంగు ఉండదు. అసలు మందులో కలిసిపోయిన బంగారానికి అస్తిత్వమే ఉండదు. ఆ బంగారానికి కల్తీ బంగారం లోని అందం లేకపోయినా తనలోని స్వచ్ఛత కారణంగా అది ఎన్నో రోగాలను నయం చేస్తుంది.

శాస్త్రాలలో చెప్పబడ్డ భవరోగ ఔషధం ఈ విధంగా ఉంది. 'సద్గురువులోనూ, వేదాంతంలోనూ విశ్వాసం కలిగి ఉండటం, విషయ వస్తువులలో ఆశ లేకపోవడం అనే సంయమనం పాటించడం, రామభక్తి అనే సంజీవనిని సేవించడం, అనుపానంగా శ్రద్ధకలిగి ఉండటం'.

ఈ వైద్యప్రక్రియను వైద్యులు (ఋషులు) చదివారు, ఉపదేశించారు కూడా. కానీ సద్గురువులో వేదంలో విశ్వాసం కలిగిఉన్నా కూడా, రామభక్తి సంజీవిని ఔషధాన్ని సేవిస్తున్నా కూడా విషయ సంయమనం అనే అనుపానం లేకపోవడం, రాముడే ముక్తిప్రదాత అనే శ్రద్ధ లేకపోవడంతో వారి భవరోగం తగ్గడం లేదు. పాదరసంలాంటి మనసు విషయవస్తువుల కదలికల వల్ల మరింత చంచలం అవుతోంది. లోకనిందలను సహించి ఆ అగ్నిలో దాన్ని (పాదరసంలాంటి మనసును) ఎలా కాల్చి భస్మం చేసి, రామభక్తి సంజీవని రసంలో ఎలా ముంచాలో వారు ఈనాడు భరతుడి ద్వారా నేర్చుకున్నారు.

అయితే అసలు ఈ రాముడి వనవాసానికి భరతుడే కారణం అనే కళంకం ఎందుకు ఆపాదించబడింది? ఎవరి వల్ల ఆపాదించబడింది?



అనేది ప్రశ్న. దానికి జవాబుగా తండ్రి మాట నిలపడానికే రాముడు వనవాసానికి వెళ్లాడని కొందరంటారు. కైకేయి మాత మనోవాంఛను పూర్తిచేయడానికే రాముడు అరణ్యానికి వెళ్లాడని మరికొందరంటారు. లేదు లేదు తల్లిదండ్రుల మాటను నిమిత్తంగా పెట్టుకొని రావణవధార్థమై రాముడు వనగమనం చేశాడని మరి కొందరంటారు. కానీ తులసీ భావన మరోలా ఉంది.

*ప్రేమ అమియ మందరు బిరహు భరతు పయోధి గంభీరు।*
*మధి ప్రగటఉ సుర సాధుహిత కృపాసింధు రఘుబీర॥*

భరతుడు ఒక విశాల గంభీర సముద్రం. అందులో ఎక్కడో అంతరాళంలో రామప్రేమ అనే అమృతం దాగి ఉన్నది. దేవతల సాధువుల హితాన్ని కోరి కృపాసముద్రుడైన రాముడు ఆ భరత సముద్రాన్ని మథించి ప్రేమామృతాన్ని బైటికి తీశాడు.

సాగరంలాంటి ఈ మనోమథనానికి కారణంగా నిలిచింది ఎవరు అనే విషయం తెలియాలంటే రాముడు భరతుడితో చేసిన సంవాదాన్ని వినాలి.

భరద్వాజుడి తపోమాయకులోనై భోగలాలసులైన అయోధ్యా పురవాసులు బలవంతంగా భరతుడు బయలుదేరుతుండగా, త్రివేణి సంగమం నుండి ముందుకు సాగారు. యమునానదిని కూడా దాటి, చిత్రకూటాన్ని సమీపించారు. ఆ క్షణం నుండి భరతుడు భావవిభోరుడైనాడు. తక్కిన పరివారాన్ని గురు వసిష్ఠులను ముగ్గురు మాతలను మందాకినీ నదీతీరంలో నిలిపి, తన వెంట గుహుడిని, శత్రుఘ్నుడిని తీసుకొని అక్కడనుండే సాష్టాంగ నమస్కారాలు ఆచరిస్తూ ముందుకు సాగారు. ధర్మార్థ కామమోక్షాల లాంటి పాదుకలు, అంగవస్త్రం, ధనస్సు బాణాలను వదిలి తనను చేరవచ్చిన భరతుడిని కౌగిట చేర్చాడు కరుణానిధి రాముడు.

వారి ద్వారా వసిష్ఠాగమనాన్ని ఎరిగిన స్వామి స్వయంగా చిత్ర కూటాన్ని దిగి, గురు వసిష్ఠులను కలవడానికి వెళ్లాడు. తండ్రి మరణ వార్త విని దుఃఖితుడైన శ్రీరాముడు వసిష్ఠప్రేరణతో చేయవలసిన పితృకర్మలు ఆచరించి, కర్తవ్య నిర్వహణ కొరకు సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. కైకేయిమాత చేసిన కుకర్మకు వ్యథ చెందుతూ భరతుడు 'ఆమె కన్నా పాపి, కఠినురాలు, కుటిల మరొకరు లేరని, రామవనగమన దశరథ మరణాది సర్వ అనర్థాలకు ఆవిడే కారణమని' దూషించాడు. శ్రీరాముడు భరతుడి మాటలను ఖండిస్తూ, 'జడబుద్ధి మాత్రమే నా తల్లి కైకేయిని దూషిస్తాడు. ఏనాడూ సత్సంగం చేసి ఎరగని ధూర్తుడు మాత్రమే ఇలా మాట్లాడతాడు' అన్నాడు. అది విని భరతుడు, 'జననీ కుమతి జగత సబసాఖీ' కైకేయి కుమతి అనటానికి లోకమే సాక్షి అన్నాడు. దానికి అయోధ్యావాసులంతా వంత పాడారు. లోకరీతికి ఎదురాడలేని రాముడు మాట మారుస్తూ, 'కైకేయి దుష్టురాలైనా, భరతుడు సాధువు, మహాత్ముడు అనే విషయాన్ని మీరంతా ఒప్పుకుంటారు కదా' అన్నాడు. దానికి ప్రజలంతా తమ అంగీకారం తెలిపారు. అప్పుడు మెల్లగా 'ఇంతటి మహాత్మునికి జన్మనిచ్చిన ఆ తల్లి దుష్టురాలు ఎలా అవుతుంది'? అంటూ ప్రజలను రాముడు నిలదీశాడు.

ఈ విశ్లేషణను చూస్తే, రాముడు ఇంత శ్రమపడి కైకేయిని నిర్దోషురాలని నిరూపించటానికి ఎందుకు పూనుకున్నాడన్న ప్రశ్న వస్తుంది. పైన చెప్పినట్లు ఇదంతా భరతుని హృదయసముద్రాన్ని చిలకటానికి జరిగిన సన్నాహమని గ్రహించాలి. సాగర మథన కథలో అమృతాన్ని పొందటం కోసం దేవదానవులు మందరగిరిని సముద్రంలో కవ్వంగా వేసి, వాసుకిని త్రాటిగా చేసి చిలికారని, అప్పుడా పర్వతం మునిగిపోకుండా శ్రీమహావిష్ణువు మహాకూర్ముడై తన వీపున దాన్ని ధరించాడని అప్పుడు జరిగిన మహా మథనంలో అమృతం పుట్టిందని ఉంది. అటువంటి మథనమే ఇప్పుడు కూడా జరిగింది. మంథర మంధరగిరి, వాసుకి కైకేయి, భరతుడి మనసు



సముద్రంగా ఈ మథనక్రియ జరిగింది. మరి కేవలం ఒక దాసి అయిన మంథరకు ఇంత శక్తి ఎలా వచ్చింది? ఈ పర్వతం (మందర) మునిగి పోకుండా ఎవరు ఆధారమయ్యారు? దీనికి జవాబు ఇక్కడ అన్ని వస్తువులు మారినా, క్షీరసాగరమథనానికి ఆధారమై నిలచిన శ్రీకూర్మమే భరతుని మనోమథనానికి కూడా ఆధారమై నిలచిందని అనవలసివస్తుంది.

దేవలత ప్రార్థన చేత సరస్వతీమాత ప్రేరేపించబడి, మంథర మనసును చెదరగొట్టి రామపట్టాభిషేకాన్ని, భంగపరిచింది అనే విషయం మనకందరికి తెలుసు. ఈ విధంగా అన్నీ అనర్థాలు కలిగించిన కైకేయి వెనుక ఉన్న చేయి మంథరది అని, మంథర వెనుక ఉన్నది సరస్వతి హస్తమని తెలిసింది. కాని సరస్వతీమాత కేవలం దేవతల మాట మీదే ఇంత అనర్థం చేసిందా? అనేది సందేహం. కాదు 'తబక చూహీన రామ రుఖ జాని' ఇది దేవతల సంకల్పం కాదు, రామ సంకల్పం అని తెలిసిన తర్వాతే సరస్వతి ఈ కార్యం చేసింది. కనుక భరత మనోసాగర మథనంలో కూడా క్షీరసాగర మథనానికి ఆధారమై నిలచిన శ్రీ కూర్మమే (శ్రీరాముడే) ఆధారమై నిలచింది కనుకనే నిర్దోషి అయిన కైకేయి మాతను భరతుడు నిందించటం శ్రీరాముడు సహించలేదు.

సాధకుడి జీవితంలో ఎన్ని సద్గుణాలున్నప్పటికీ వీటన్నిటినీ శాశ్వతంగా నిలుపుకునే శక్తి లేనట్లయితే అవి మళ్ళీ తొలగిపోతాయి. శరీర అంగాలు అన్నీ పుష్టిగా ఉన్నప్పటికీ, శరీరంలో ప్రాణం లేకపోతే క్రమంగా శరీరం శిథిలమౌతుంది. అలాగే సద్గుణాలు అన్నీ మరణించకుండా ఉండాలంటే వాటికి ప్రాణాన్ని, శాశ్వతత్వాన్ని ఇచ్చే భగవత్ప్రేమ ఉండాలి. సాక్షాత్తు పరమాత్మ ఈ భూమిమీద అవతరించినా, ఆయనను గుర్తించ గల, పొందగల శక్తి అయిన ప్రేమ కొరవడినపుడు ఆ అవతారం నిరర్థక మౌతుంది. అందుకే సాధువులకు అత్యావశ్యకమైన ప్రేమను భరతుడి మనో సముద్రం నుండి బలవంతంగా చిలికి బైటికి తీస్తున్నారు.

తన వనగమనం అనే ప్రక్రియలో రాముడు భరత సముద్రాన్ని మథించడం ప్రారంభించాడు. మథించే సమయంలో ప్రతి అణువు మీద దెబ్బపడుతుంది. అలాగే రామవనగమన వార్తతో భరతుడి వ్యక్తిత్వంలోని ప్రతి అణువూ కదిలిపోయింది. క్షీరసాగర మథన సమయంలో అమృతంతో పాటు కల్పవృక్షం, చంద్రుడు, లక్ష్మి, ఐరావతం, ఉచ్చైశ్రవం మొదలైనవన్నీ బయటకి వచ్చాయి. అలాగే భరతుని మనోసముద్ర మథనంలో రామప్రేమ అనే అమృతంతో పాటు ఆయనలోని జ్ఞానం, శీలం, వినయం, వైరాగ్యం మొదలైన అనేక గుణాలు బైటికి వచ్చి సాధకులకు మార్గదర్శకమైనాయి. అందుకే తులసి అయోధ్యకాండ అంతంలో ......

'కలికాల తులసీ సే సఠన్హి హఠి రామ సముఖకరతకో' -

మూర్ఖుడైన నాలాంటి మనిషిని బలవంతంగా రామోన్ముఖుడిని చేయడానికి కలికాలంలో భరత భక్తి కన్నా మించిన స్ఫూర్తిదాయక తత్వం మరేదీ లేదు అంటాడు.

ఇక్కడ చిత్రకూటంలో రఘువంశ సింహాసనాన్ని రాముడా, భరతుడా ఎవరు అలంకరించాలనే విషయం పైన చర్చ సాగుతుండగా, అక్కడ స్వర్గంలో భరతుడి ప్రేమతత్వాన్ని చూస్తున్న ఇంద్రుడు కంపించ సాగాడు. భరతుడి మాట విని రాముడు అయోధ్యకు వెళ్లిపోతే రావణ సంహారం జరిగేదెలా? తన కష్టాలు తీరేదెలా? అనే చింతలో ఆయన మునిగిపోయాడు. దేవగురువు బృహస్పతి వద్దకు వెళ్లి 'భరతుడు రమ్మంటే ఆయన వెంట రాముడు కదిలి అయోధ్యకు వెళతాడా? అని ప్రశ్నించాడు ఇంద్రుడు. దానికి ఆయన నవ్వుతూ 'అవశ్యం.......తప్పక వెళతాడు' అన్నాడు. కంగారుపడిపోతున్న ఇంద్రుడిని చూసి నవ్వి మళ్లీ బృహస్పతి 'భరతుడు రమ్మంటే రాముడు అయోధ్యకు వెళ్లేమాట నిజమే కాని భరతుడు మాత్రం ఆమాట అనడు' అన్నాడు. అంతటితో ఇంద్రుడు తృప్తిపడ్డాడు.



భక్తి రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి త్వదీయతాభక్తి మరొకటి మదీయతా భక్తి. నేను పరమాత్మకు చెందినవాణ్ణి అనేది త్వదీయతాభక్తి. ఈశ్వరుడే నాకు చెందినవాడు అనేది మదీయతాభక్తి.

తన్ భీ తేరా, మన్ భీ తేరా తేరా పిండ పరాన
సభ్‌కుచ్ తేరా, తూహై మేరా యహ దాదుకా జ్ఞాన్

నా శరీరం నీది, నా మనసు కూడా నీది నా సర్వస్వం నీదే ఓ పరమాత్మ! కానీ నీవు మాత్రం నా వాడివి - ఇది దాదు జ్ఞానం.

భరతుడిది త్వదీయతాభక్తి. ఆయన పరమాత్మ యొక్క నీడ లాంటివాడు. నీడకు స్వయంబుద్ధీ ఆలోచనలు ఉండవు. అది శరీరాన్ని అనుసరించవలసినదే; అదే జరిగింది. భరతుడు, నిర్ణయాన్ని పరమాత్మకే విడిచిపెట్టాడు. 14 సంవత్సరాలు రామరాజ్యానికి భరతుడు ప్రతినిధియై పాలించాలి, అరణ్యవాసానంతరం రాజ్యాన్ని తిరిగి తనకు వప్పజెప్పాలని రాముడు నిర్ణయించాడు. పట్టాభిషేకం కొరకు తెచ్చిన సంభారాలను ఏం చేయాలనే భరతుడి ప్రశ్నకు, అన్నింటినీ ఒక బావిలో వేయమన్నాడు. అలా సత్కరింపబడిన బావి ఇప్పటికీ చిత్రకూటంలో 'భరతకూపం'గా ప్రసిద్ధికెక్కివుంది. భరతుడు తనవెంట పట్టాభిషేక సమయంలో రాముడి చరణాలను అలంకరించడానికి తెచ్చిన పాదుకలను రాముడి అనుమతితో ఆయన చరణాలకు తొడిగి, వాటిని తన తలపై ధరించి అయోధ్య వైపుకు సాగిపోయాడు. ఆ పాదుకలు కొందరికి రామ అనే రెండక్షరాలుగా సాక్షాత్కరించగా మరికొందరికి సీతారాములుగా భాసించాయి.

అలా అయోధ్యవైపుకు సాగిన భరతుడి కథను వేదమంత్రంలో మనకు విశ్వామిత్ర మహర్షి తెలియజేస్తున్నాడు. నైమిశారణ్యంలోని గోమతి నదిని భరతుడు దాటటం చూసి, విశ్వామిత్రమహర్షి దానిని అంగ మహానదిగా స్తుతించాడు. ఆ తర్వాత జరిగిన కథను తన దివ్యదృష్టితో మనకందిస్తున్నాడు మహర్షి.

రాముడు రాజభవనంలో నివసించేటపుడు ఆయన హంసతూలికా తల్పం మీద పడుకుంటాడు కనుక ఆయన సేవకుడైన తాను నేలమీద పడుకోవాలని భావించేవాడు భరతుడు. మరిప్పుడు స్వయంగా రాముడే నేల మీద నిద్రిస్తున్నాడు కనుక తాను అంతకన్నా కింద పడుకోవాలని భావిస్తూ భూమిని తవ్వుకొని అందులో శయనించేవాడట భరతుడు.

ఈ విధంగా ఆయన నందిగ్రామంలో నివసిస్తూ అనేక కఠిన వ్రతాలు చేస్తూ రామరాజ్యాన్ని సక్రమంగా పాలిస్తూ దినదినం ధన ధాన్యాలను వృద్ధిపరుస్తూ రాజ్యం చేయసాగాడు.



# అరణ్యకాండము

అవతారిక :- 45వ మంత్రం వరకు అయోధ్యకాండను ముగించిన వేదమాత 46వ మంత్రం నుండి అరణ్యకాండను ప్రారంభించి, ఆ మంత్రంలో లక్ష్మణుడి స్వరూపాన్ని ముందుంచబోతోంది.

**46వ మంత్రం :**

**న హిషస్తవ నో మమ శాస్త్రే అన్యస్య రణ్యతి।**
**యో అస్మాన్వీర ఆనయత్ ॥** (ఋగ్:8-33-16)

తాత్పర్యం :- తనను పెండ్లాడమని లక్ష్మణుడిని ప్రార్థిస్తున్న శూర్పణఖను చూస్తూ రాముడు వక్రోక్తిగా 'లక్ష్మణుడు నీ ఆజ్ఞచేతగాని, నా ఆజ్ఞచేతగాని నడవడు. మరొకరి ఆజ్ఞ అతడిని నడిపించదు. మనమంతా అతడి అధీనమే. కాని నువ్వు మాత్రం మా అధీనంలో లేవు' అన్నాడు.

వ్యాఖ్యానం :- భరతుడు నగరవాసులందరితో అయోధ్యకు వెళ్లి పోయాడు. సీతాలక్ష్మణులతో శ్రీరాముడు చిత్రకూటంలో ఆనందంగా ఉన్నాడు. అయితే రాముని నివాసం తెలియటం వల్ల, అది అయోధ్యకు దగ్గరగా ఉండటం వల్ల, నగరవాసులు తరచుగా రామదర్శనం కోసం రాసాగారు. వారి రాకపోకల కారణంగా అక్కడ తపస్సు చేసుకుంటున్న మునులకు తపోభంగం కలగసాగింది. అందుకని శ్రీరాముడు తన నివాస స్థలాన్ని మార్చదలచాడు. ఋషుల ఆజ్ఞతో దక్షిణం వైపు కదలి అత్రి మహర్షి ఆశ్రమాన్ని చేరారు. అత్రి అంటే త్రిగుణాలు దాటినవాడు. అత్రి సతి

అనసూయ. ఆ సనాతన ఋషిదంపతులను చూసి శ్రీరామాదులు ఆనందపరవశులయ్యారు. ఆ దంపతులు ఆ దివ్యత్రయాన్ని దర్శించి స్తుతించి అతిథిసత్కారాలు చేశారు. సీతను నిమిత్తంగా చేసుకొని అనసూయమాత లోకానికి పతివ్రతాస్త్రీ లక్షణాలను ఉపదేశించింది. సీతకు దివ్యవస్త్రాలను ప్రసాదించింది.

ఆ తర్వాత ఆ ముగ్గురు మరింత ముందుకు సాగారు. అలా ముందుకు వెళ్తుంటే, సుతీక్షణుడి ఆశ్రమం కనిపించింది. సుతీక్షణుడు నారదుడి భక్తిసూత్ర రచనకు ప్రేరణ నిచ్చాడు. ప్రేమతత్వంలో ఓలలాడు తున్నాడు. అతను దివ్యత్రయాన్ని చూసి, వారిని అగస్త్యమహర్షి ఆశ్రమానికి వెంటవెళ్లి చేర్చాడు.

అగస్త్యుడు శీఘ్రంగా బయటకు వచ్చి, ఆ దివ్యత్రయానికి ఆతిథ్య మిచ్చి, తర్వాత దేవతలు తనవద్ద దాచిన దివ్య అస్త్రాలను రాముడికి అప్పగించాడు. అతని ఆజ్ఞతో రాముడు పంచవటిలో పర్ణశాల నిర్మించు కొని నివసించటం మొదలుపెట్టాడు. ఆ రోజుల్లోనే శూర్పణఖ రాముడి రూపాన్ని చూసి మోహించింది. ఆ రాక్షసి రాముడికి తన కోరిక తెలిపింది. రాముడు తను ఏకపత్నీవ్రతుడనని చెప్పి, బ్రహ్మచారిగా కాలం గడుపు తున్న తన తమ్ముడు లక్ష్మణుడి వద్దకు వెళ్లమని చెప్పాడు. ఆమె లక్ష్మణుడిని చేరి అతన్ని ప్రసన్నం చేసుకునేందుకు వ్యర్థచేష్ట చేయసాగింది. అది చూసి రాముడు వ్యంగ్యంగా పై మంత్రంలోని మాటలన్నాడు.

ఇంతకీ పరమాత్మ అయిన రాముడి మాట కూడా వినని ఈ లక్ష్మణుడు ఎవరు? లక్ష్మణుడి మాటను అంతా ఎందుకు వినాలి? పరిశీలించి చూద్దాం ..............

లక్ష్మణుడు కాలస్వరూపుడు :- సృష్టి నిర్మాణానికి మూడు తత్వాలు అవసరం. 1. పరమాత్మ 2. శక్తి 3. కాలం. శక్తి లేనిదే పరమాత్మ సృష్టి



చేయలేడు. శక్తి ఉన్నా దాన్ని ఉపయోగించేవారు లేకపోతే అది వ్యర్థ మవుతుంది. శక్తి గలవాడై మామిడి విత్తనాన్ని నాటినా తెల్లవారేసరికి అది చెట్టుగా ఎదిగి పండ్లు కాయదు. దానికి కాలం కావాలి.

కాబట్టి పరమాత్మ, శక్తి, కాలం ఈ మూడు ఉంటేనే సృష్టి జరుగుతుంది. లక్ష్మణుడు కాలస్వరూపుడని తులసీదాసంటాడు.

*శేష సహస్రసీస జగకారన,*<br>
*జో అవతరె ఉ భూమి భయటారన॥*

లక్ష్మణుడే ఈ జగత్తుకు కారణమైన కాలం. ఇతను ఆదిశేషుడు, సహస్రఫణి. భూభారాన్ని తొలగించటానికి అవతరించాడు అంటాడు తులసీదాసు.

'శేష' మంటే మిగిలి ఉండటం అనే అర్థం కూడా ఉంది. సృష్టికి ముందు, సృష్టి మధ్యలో, సృష్టి అంతంలో కూడా మిగిలివుండేది కాలం. ఆ కాలమే, శేషుడైన లక్ష్మణుడు. మనకు సృష్టి కనిపిస్తుంది. కానీ, దానిముందు, దాని అంతంలో ఏముందో కనిపించదు. దాన్ని మనం స్పష్టంగా చూడగలిగితే మన సమస్యలన్నీ తీరిపోతాయి.

ఆదిలో అంతా జలమయం. ఆ జలంలో శేషతల్పంపై శ్రీమహా విష్ణువు లక్ష్మీసమేతంగా శయనించి ఉంటాడని పురాణాలు చెబుతాయి. అంటే సృష్టి కన్నా ముందు పరమాత్మ ఉన్నా, అతను నిద్రించి ఉన్నాడు. ఆ సమయంలో కూడా మేలుకొని ఉన్నది ఆదిశేషువే. అంటే కాలం. కాలం అందరినీ పడుకోబెట్టినా, తాను మాత్రం ఎప్పుడూ మేలుకునే ఉంటుంది. లక్ష్మణుడు ఎప్పుడూ నిద్రించినట్లు రామాయణం చెప్పదు. ఎందుకంటే లక్ష్మణుడు కాలస్వరూపుడు.

కాలం ఎప్పుడూ ఉంటుంది. అది మనకు నిత్యానుభవం కూడా. మనం నిద్రించినపుడు వ్యక్తిగత ప్రళయం వస్తుంది. మన బంధువులు-

ఆస్తులు-జ్ఞానం-ఆలోచనలు-కోరికలు-సమస్యలు అన్నీ అంతమైపోతాయి. కానీ మనశక్తి (సామర్థ్యం) కాలం మాత్రం ఉంటాయి. డాక్టరు నిద్రించినపుడు కూడా డాక్టరే, కాని ఆయన శక్తి బీజప్రాయమై ఆయనలో దాక్కొని ఉంది. ప్రళయమంటే అంతా భయపడిపోతారు, కానీ నిద్రపోవటానికి ఎవరూ భయపడరు. కారణమేమంటే నిద్రలో కనిపించని వస్తువులు, బంధువులు, మేలుకున్న తర్వాత ఉంటారని వారి అనుభవం చెబుతుంది. ప్రళయం తర్వాత కూడా ఇవన్నీ మళ్లీ లభిస్తాయని తెలుస్తే, ప్రళయానికి కూడా ఎవరూ భయపడరు. కానీ జ్ఞానాన్ని లుప్తం చేసి మనకు భయాన్ని కలిగిస్తున్నది ఈ కాలమే. లక్ష్మణుడు కాలస్వరూపుడు కనుకనే రామాయణంలో లక్ష్మణుని పాత్ర అందరినీ భయపెడుతుంది. తెల్లవారుఝామున 4 గంటలకు లేవాలి అని సంకల్పించుకుని పడుకుంటే మనకు ఆ సమయానికి మెలకువ వస్తుంది. మరి మనను లేపింది ఎవరు? కాలమే. మనం నిదురించినా కాలం నిదురించదని మనకు తెలుసు.

తులసీరామాయణంలో పరశురాముడు, రాముడిని జనకుని సభలోనే ధనుర్భంగమైన తర్వాత ఎదుర్కోవటం జరుగుతుంది. అప్పుడు లక్ష్మణుడికి, పరశురాముడికి వాగ్యుద్ధం జరుగుతుంది. చాలామంది లక్ష్మణుడి మాటలను పరశురాముడిపై వేసిన వ్యంగ్యబాణాలుగా గ్రహిస్తారు. లక్ష్మణుడు కాలరూపం అని ఎరిగిన వారికి మాత్రం ఆ మాటలలో ఎన్నో గూఢార్థాలు బోధపడతాయి.

పూర్ణావతారమైన కోదండరాముడు ఆవిర్భవించాడు. అయినా ఈ సత్యాన్ని గ్రహించలేక రాముడిని ఎదుర్కొందామని ప్రయత్నించిన పరశురాముడిని కాలరూపుడైన లక్ష్మణుడు హెచ్చరిస్తాడు.

స్వయంగా పరమాత్మ కాలాతీతుడై ఉండికూడా ఒక ప్రత్యేక యుగంలో, ప్రత్యేక సమయంలో అవతరించినపుడు కాలబద్ధుడయ్యే



ఉంటాడు. అందరు జీవులలాగే కాలాధీనమైన షడ్వికారాలకు (జన్మ, పెరుగుదల, అస్థిత్వం, రోగం, శిథిలం, మృత్యువు) లోనవుతున్న నాటకం ఆచరిస్తాడు. కాలాన్ని గౌరవిస్తాడు. పరశురాముడు మాత్రం అహంకరించి కాలాన్ని విస్మరించాడు. తనద్వారా లోకంలో జరిగిన ఉత్తమ కార్యాలన్నీ కూడా తన గొప్పతనం వల్లే జరిగాయని అనుకోవటం మొదలుపెట్టాడు.

ఈ కాలస్వభావం తెలియకపోవటం వల్లనే జీవులు, అన్నిటికీ కర్తలం మేము అనుకొని హర్షవిషాదాలకు లోనవుతుంటారు. ఈ కాలస్వరూపాన్ని అర్థం చేసుకున్నవారికి కర్తృత్వం ఉండదు. దాని ఫలితంగా సమస్యలు ఉండవు. ఈ తత్వాన్ని వివరించటానికే కాలస్వరూపుడైన లక్ష్మణుడి అవతారం. కాలసర్పం అనే వాడుక ఉంది కదా!. కాలం సర్పంలాగా ఒక్క క్షణం ఆగకుండా చకచకా పాకిపోతుంది. కానీ అడుగుల సవ్వడి కూడా వినిపించదు. కాలం యొక్క అంశం అయిన మృత్యువు కూడా పాముకాటు లాంటిదే. ధ్యానంలో కాలాతీతుడై త్రినేత్రుడు (జ్ఞాననేత్రం తెరుచుకున్నవాడికి) అయినవాడికి ఆ కాలసర్పమే భూషణమౌతుంది.

మనలో కామానికైనా, క్రోధానికైనా, లోభానికైనా ఒక్కటే కారణం. మన దృష్టి కాలాతీతుడైన పరమాత్మ నుండి కాలానికి లోబడే వస్తువులు పైకి రావటం. ఆ వస్తువులపై మమత్వం పెరగడం. అందుకే కాల స్వరూపుడైన లక్ష్మణుడు 'ఏహి ధను పర మమతా కెహి హేతు?' 'కాలబద్ధమై పాతదైన ఈ ధనస్సుపైన నీకెందుకు మమత్వం?' అని అడుగుతాడు. అది కాలం చేసిన హెచ్చరిక. కాని అది గ్రహించలేక కాలస్వరూపుడిని గుర్తించలేక లక్ష్మణుడిని చిన్నపిల్లవాడిగా భావించి క్రోధంతో 'బేగి ఆకరహుం ఇహ ఆభిన్న ఓడ - ఎవరన్నా ఈ కుర్రవాణ్ణి నా కండ్లముందు నుండి దూరంగా తీసుకెళ్ళండి, లేదా కోపంలో వీణ్ణి నేను సంహరించగలను' అంటాడు. వెంటనే లక్ష్మణుడు నవ్వుతూ 'మూందే ఆంక భితహు2 కౌఉనాహి- కండ్లు మూసుకుంటే ఎవరూ కనిపించరు కదా! ఎందుకు

ఇతరులను పిలుస్తావు?' అని అంటాడు. ఇది వెక్కిరిస్తున్నట్లుగా ఉన్న చిన్నపిల్లవాడి మాటలలాగా ఉన్నాయి. కాని ఆలోచిస్తే ఇందులో కాలంయొక్క హెచ్చరిక కనిపిస్తుంది.

అహంకారం పెరిగిపోయినపుడు తాము చేయగల పనుల విషయంలో కూడా ఇంకొకరి మీద ఆధారపడతారు. లోకాన్నంతటినీ తన కొరకు మారమని చెప్పే బదులు తానే మారవచ్చు కదా!. ఇలా కోరటం వల్ల పరాధీనతే పెరుగుతుంది. పైగా క్రోధం కలిగినపుడు కండ్లు మూసుకుని ఒక్కసారి ఆత్మావలోకనం చేసుకుంటే, తనలోని లోపం ఏమిటో తెలుస్తుంది. లేదా ఇంకోరకంగా చెప్పాలంటే ఎదురుగా నిలబడి కాలం హెచ్చరిస్తున్నా ఇంత గొప్ప అంశావతారమే తెలుసుకోలేకపోయింది కనుక బహిర్దృష్టిని విడిచి అంతఃప్రేరణతో కాలస్వరూపాన్ని అర్థం చేసుకోమని చెబుతున్నాడు లక్ష్మణుడు. కాలస్వరూపాన్ని అర్థం చేసుకున్న ఏ వ్యక్తి అయినా ఈ జగన్నాటకంలో ఏ క్షణంలో ఏ పాత్ర ధరించాలో ఆ పాత్ర ధరించి తక్కిన సమయంలో విశ్రమించి సుఖపడగలడు.

విరిగిన శివధనస్సును చూసి కోపంతో ఊగిపోతున్న పరశురాముడు 'నతమారే, జై హహి సచరాజా - ఈ వింటిని ఎవరు విరిచారో వారిని నాకు చూపండి లేదా ఇక్కడున్న రాజులందరినీ సంహరిస్తాను' అంటాడు. అప్పుడు అక్కడున్న రాజులెవ్వరికీ మాట్లాడటానికి ధైర్యం చాలలేదట. అప్పుడు రాముడు వచ్చి, 'ఈ మీ దాసుడే, మీ ఆజ్ఞ ఏమిటో చెప్పండి' అని పరశురాముడికి దాసుడు కావటానికి సిద్ధపడతాడు. అంతేకాదు, రాముడు విశ్వామిత్రుడికి సేవలు చేస్తాడు. ఎందుకంటే ఆ సమయంలో రాముడు పరమాత్ముడు కాడు, విశ్వామిత్రుడి సేవకుడు. కాలానుగుణంగా ప్రవర్తించటమే రామునిలోని విశేషం.

కానీ పరశురాముడు మాత్రం తన సమయాన్ని అర్థం చేసుకోలేదు.



ఇంకా తాను క్షత్రియులను దండించే స్థితిలోనే ఉన్నాడనుకుంటున్నాడు. ఆ పాత్ర అయిపోయింది; ఇపుడు అది నిష్క్రమించాలి. ఇపుడు రాముడు ప్రవేశించి నాటకాన్ని నడిపే కాలం ఆసన్నమయింది. కాబట్టి పరశురాముడు తప్పుకోవాలి. అది చేయటం లేదు.

కాలం నుండి ఎవరూ తప్పించుకోలేరు. అందరూ కాలాధీనులు కావలసిందే. 'నేను కాల స్వరూపుడిని' అంటాడు గీతాచార్యుడు. సర్వాన్ని మింగివేసేది కాలం. కాలాన్ని ఏదీ మింగదు. రావణాసురుడిలాగా కొన్ని వేల సంవత్సరాలు కాలం నుండి తప్పించుకున్నా చివరికి కాలం వాత పడక తప్పదు. ఏదో మార్గంలో కాలం ఆక్రమిస్తుంది.

ఏదో ఒక సఫలక్షణంలో ప్రతిజీవి 'నేను కాలాన్ని జయించాను' అనుకుంటాడు. కాలస్వరూప లక్ష్మణుడు ప్రతి జీవిని ఈ భ్రమ నుండి వేరుచేయ ప్రయత్నిస్తాడు. అందుకే ఆ పాత్రలో కాస్త కఠోరత కనిపిస్తుంది. అహంకరించిన ప్రతిజీవిని భయపెట్టి పరమాత్మ సమక్షానికి చేర్చటమే లక్ష్మణుడి (కాలం) పని. కాలం అంటే అందరికీ భయమే. అందుకే సారా తాగైనా కొద్దిసేపు, లేదా సినిమా చూసైనా ఒక మూడు గంటలకాలం ఇలా కాలాన్ని మరిచిపోదామని చూస్తారు. కాసేపు వాస్తవం నుండి వేరై స్వప్నాల్లో విహరిస్తారు.

'కరమ కపీస బాలి' వాలిని కర్మగా వర్ణిస్తాడు తులసీదాసు. వాడికి జీవుడైన సుగ్రీవుడికి మంచి స్నేహం. కానీ ఎల్లకాలం జీవుడు కర్మతో మంచి సంబంధం పెట్టుకోలేడు. ఎపుడో ఒకప్పుడు జీవుడికి వాడి కర్మ ఎదురు తిరుగుతుంది. వాలి(కర్మ) చాలా బలమైనవాడు. వాడు రావణాసురుడిని కూడా చంకక్రింద అదిమిపట్టి సప్త సముద్రాలలో ముంచగలడు. అంటే రావణుడు అన్ని లోకాలను జయించగలడు. కానీ తన కర్మను కాదు. కానీ ఇంత గొప్ప కర్మకూడా కాలాధీనమే. అందుకే తాను(వాలి) మాయావిని చంపటానికి గుహలోకి వెళ్లినపుడు వారం రోజులు

గడువుపెట్టి ఆ సమయంలో బైటికి రాలేకపోయాడు. అటువంటి కర్మతో పరితప్తుడైన జీవుడు సుగ్రీవుడిని 'కాలు జాసు కోదండ'-కాలమనే కోదండాన్ని ధరించిన రాముడు సంహరించి రక్షిస్తాడు.

కానీ జీవుడు(సుగ్రీవుడు) తన కర్మబాధలు తొలగించిన పరమాత్మనే మరచిపోయి, తాగుబోతై, వ్యభిచారై, కృతఘ్నుడై పరమాత్మ కార్యాన్నే విస్మరిస్తాడు. అప్పుడు పరమాత్మ....

*'భయదెఖాఇలైఆవహు తాత సఖా సుగ్రీవ'*

'సుగ్రీవుడిని కాస్త భయపెట్టి నీ వెంట తీసుకురావయ్యా లక్ష్మణా, అంతేకాని వాడిని చంపకు' అంటాడు. ఇది కాలం చేసే ముఖ్యమైన పనులలో ఒకటి. ఈ రకంగా లక్ష్మణుడు(కాలం) పైకి కఠినంగా కనిపించినా లోపల మాత్రం జీవుడి శుభాన్ని కోరే, అతడిని రాముడి వద్దకు చేరుస్తాడు.

శత్రుసైన్యం యొక్క బలం ఎంత ఉందో తెలుసుకొని రమ్మని రావణుడు ఇద్దరు రాక్షసులను మారు వేషాలలో సముద్రం ఆవల ఉన్న వానరసైన్యంలోనికి పంపగా, వారు పట్టుబడతారు. వారిని లక్ష్మణుడు, వానరులు చంపకుండా రక్షించి వారి ద్వారానే రావణాసురుడికి రామశరణాగతి పొందమని సందేశం పంపుతాడు. కానీ అహంకారం తలకెక్కిన రావణుడు కాలంయొక్క ఈ సందేశాన్ని పెడచెవిన బెట్టి పరివారసహితంగా నాశనమౌతాడు. సుగ్రీవుడిలా కాలసందేశాన్ని గౌరవించి రాముడి శరణు పొంది తరిస్తారా లేక రావణుడిలా నశిస్తారా అనేది మీ ఇష్టం. కాల స్వరూపుడైన లక్ష్మణుడిని తన మాటల చేత మెప్పించాలని చూస్తున్న శూర్పణఖ వ్యర్థచేష్టలకు నవ్వుకుంటూ రాముడు ఆయన స్వరూపాన్ని నిగూఢంగా పై వేదమంత్రంలో ప్రకటించాడు.

అవతారిక :- 46వ మంత్రం ద్వారా కాలస్వరూపుడు అయిన లక్ష్మణుడి స్వరూపాన్ని వర్ణించిన వేదమాత, ఆ తర్వాత జరిగిన చరిత్రను శూర్పణఖ మనోప్రవృత్తిని **47,48,49** మంత్రాలలో వర్ణించబోతోంది.



**మంత్రాలు 47, 48, 49 :**

**ఇన్ద్ర శ్చిద్ఘా తదబ్రవీత్ స్త్రియా అశాస్యం మనః।**
**ఉతో అహ క్రతుం రఘుమ్॥** ఋగ్: (8-33-17)

**సప్తీచిద్ఘా మదచ్యుతా మిథునా వహతో రథమ్।**
**ఏవేద్ధూర్ వృష్ణ ఉత్తరా॥** ఋగ్: (8-33-18)

**అధః పశ్యస్వ మోపరి సన్తరాం పాదకౌ హర।**
**మా తే కశప్లకౌ దృశన్ స్త్రీ హి బ్రహ్మా బభూవిథ॥**
ఋగ్: (8-33-19)

తాత్పర్యం :- లక్ష్మణ స్వరూపాన్ని వర్ణించినప్పటికీ శూర్పణఖ వెళ్లక పోవడాన్ని చూచిన రాముడు లక్ష్మణుడితో 'ఈ స్త్రీ మనసు నిరంకుశంగా ఉంది. ఇది నన్ను చంపాలని చూస్తోంది' అన్నాడు.

'గుజ్జానికి లాగా పొడవాటి చెవులున్నది, ఉన్మత్తురాలు, కాముకురాలు అయిన ఈ స్త్రీ ముక్కు,చెవులు కత్తిరించాలి, కానీ చంపకూడదు' ఇటువంటి సూచన లభిస్తూనే లక్ష్మణుడు యథాతథంగా చేశాడు.

దీనివల్ల విఘ్నాన్ని గ్రహించిన రాముడు సీతతో, 'ఓ సీతా!, నీవు కిందికే చూడాలి. తల ఎత్తితే నన్ను చూడాలి, నడిచేటపుడు వినయం ఉట్టిపడాలి. నీ వెంట్రుకలను ఎక్కువగా అలంకరించకూడదు. ఈ రకంగా సంయమంతో ఉండే స్త్రీపైన ఈశ్వరుడు ప్రసన్నుడౌతాడు.

వ్యాఖ్యానం :- కాలస్వరూపాన్ని నిజంగా ఎరిగిన వాడైతే, వ్యక్తి అరిషడ్ వర్గం నుండి దూరమవుతాడు. కానీ సంస్కారాలు బలంగా ఉన్నవారు రాక్షసులలాగా ప్రవృత్తిలో దిగబడిపోతారు. మదమెక్కిన ఏనుగులాగా వారి మనసు విహరిస్తుంది. మావటివాణ్ణి కుంభస్థలం నుండి పడదోయటం వల్ల అంకుశం చేత పొడవబడదు కనుక నిరంకుశం అవుతుంది. అటువంటి

స్త్రీయే శూర్పణఖ. 'సూపం' అంటే బియ్యం చెరిగే చాట-నఖం అంటే గోరు. సూపనఖ-సూర్పణఖ-అంటే చాటలంతేసి గోళ్లు పెంచుకున్నది అని అర్థం. అంటే సంస్కార రహితంగా విపరీతంగా వెంట్రుకలు, గోళ్లు పెంచుకొని సామాజిక విలువలను కాదని విచ్చలవిడిగా విహరించేది అని అర్థం.

ఈమె రావణుని చెల్లెలు. విద్యుజ్జిహ్వుడనే రాక్షసుని భార్య. ఖర దూషణ రాక్షసులు ఈమెకు అన్నలవుతారు. 'రామకీర్తి' తన రామాయణం లో విద్యుజ్జిహ్వుడి అసలు పేరు 'వర్గాసింగా' అంటాడు. రావణుడు అతడిని లంకానగరానికి రక్షకుడిగా ఉంచి ఎటో వెళ్లాడు. అతను తన జిహ్వ (నాలుక)ను పెంచి లంకను కప్పివేశాడు. రావణుడు అతడిని శత్రువుగా పొరబడి చంపివేశాడు. వాల్మీకి రామాయణాన్ని అనుసరించి కూడా రావణుడు తన బావ విద్యుజ్జిహ్వుడిని శత్రువుగా పొరబడి చంపివేయటం జరిగింది. భర్తను కోల్పోయిన దగ్గర నుండి శూర్పణఖ దండకారణ్యంలో ఖరదూషణుల రక్షణలో ఉంటూ విచ్చలవిడిగా విహరించేది. తన కంటికి అందంగా కనిపించిన ప్రతి పురుషుడిని స్వంతం చేసుకొని తన వాంఛ తీరిన తరువాత చంపి తినేది. నృసింహపురాణం, ప ఉమాచర్యం, సేరీ రామ్ మొదలైన గ్రంథాలననుసరించి శూర్పణఖకు ఒక కుమారుడు కూడా ఉన్నాడు. వాడు శంబూకుడు. లక్ష్మణుడు వాడిని చంపుతాడు.

అనేక చోట్ల తిరిగి తిరిగి ఈ శూర్పణఖ ఆ రోజు రాముడిని, అతని అందాన్ని చూసి మోహించింది. తనను చేరవచ్చిన దాన్ని రాముడు లక్ష్మణుడి వద్దకు పంపాడు. అనేక రామాయణాల ననుసరించి, సాధనలో ఉన్న లక్ష్మణుడి నుండి జవాబు రాక శూర్పణఖ తిరిగి రాముడి వద్దకు వస్తుంది. వాల్మీకాన్ని బట్టి ఆ రాక్షస స్త్రీ అన్నదమ్ములిద్దరి మధ్య అనేకసార్లు తిరుగుతుంది. చివరికి అత్యంత సౌందర్యవతి సీత ఉండగా తనను వారు స్వీకరించరని భావించి, అది సీతపైకి వెళ్తుంది. అప్పుడు రాముడు ఆదేశించగా లక్ష్మణుడు దాన్ని శిక్షిస్తాడు.



నృసింహపురాణంలో శూర్పణఖ రాముడికి ఒక లేఖ వ్రాసినట్లుంది. అందులో ఆవిడ, 'అతీవ నిపుణా చాహం రతి కర్మణి'-రతి క్రీడలో నేనతి నిపుణురాలనని సూచిస్తుంది. రాముడు కూడా ఒక లేఖ వ్రాసి లక్ష్మణుడి చేతికిచ్చి ఆవిడకు పంపుతాడు. అందులో ఆవిడ ముక్కు, చెవులు కత్తిరించమనే సూచన ఉంటుంది. ఈ సూచన 'ఋుక్,యజ్,సామనాక' అనే పదంలో ఉన్నదంటారు. మొదటి మూడు పదాలు త్రయీవేదాన్ని సూచిస్తున్నాయి. వేదాన్ని శ్రుతి అని కూడా అంటారు. అలాగే 'నాక' అంటే ఆకాశమని ముక్కు అని అర్థాలున్నాయి. శ్రుతి-నాక శబ్దాలు చెవి-ముక్కులు. వాటిని కత్తిరించమని సూచన. పై వేదమంత్రం కూడా రాముడు సూచించినట్లు చెబుతున్నదే తప్ప సూటిగా ముక్కు,చెవులు కోయమని లక్ష్మణుడిని ఆజ్ఞాపించినట్లు లేదు. మర్యాదా పురుషోత్తముడి మర్యాదను మంట గలుపుదామనే శూర్పణఖ ఉద్దేశం. అదే రాముని హత్యలాంటిదని గ్రహించాలి. అంతే తప్ప ఆమె రాముడిని సంహరించగల సమర్థురాలని గాని, అది తనను సంహరించగలదని రాముడు భయపడినట్లు గాని, 'ఇది రాముడిని చంపాలని చూస్తోంది' అనే పై మాటకు అర్థంగా తీసుకోవలసిన అవసరం లేదు. దాని ప్రవర్తన, దాని శారీరక లక్షణాలు కూడా కాముకతను ప్రదర్శిస్తూ ఉండటంతో రాముడు ఈ చెవిముక్కుల బేధన నిర్ణయం తీసుకోవలసివచ్చిందని అనవలసివస్తుంది. మనసులోకి కామం ప్రవేశించేందుకున్న ద్వారాలన్నింట్లో కనీసం ఈ రెండింటిని శిక్షించినా అది కొంత అదుపులోనికి వస్తుందనే ఉద్దేశంతో ఈ పని చేయవలసి వచ్చింది.

బాలరామాయణాన్ని అనుసరించి వనవాసం కన్నా ముందే శూర్పణఖ రామలక్ష్మణులచేత నిరాదరించబడింది. జైన రామాయణంలో లక్ష్మణుడు శూర్పణఖను విరూపిగా చేయడు, ఆవిడే తన గోళ్లతో ఒళ్లంతా గాయం చేసుకొని, జుట్టు విరబోసుకొని వెళ్లి రాక్షసులతో లక్ష్మణుడు తనను బలాత్కరించబోయాడని చెబుతుంది.

శూర్పణఖ పారిపోయిన తర్వాత శ్రీరాముడు పై వేద మంత్రంలో స్త్రీ సామాజిక జీవన విధానాన్ని వివరిస్తున్నాడు. పురుషుడు, స్త్రీ ప్రవర్తన-కట్టు-బొట్టూ-అంగ విన్యాసాల వల్ల ఆకర్షింపబడతాడు. కనుక స్త్రీ సాధ్యమైనంత వరకు ఫ్యాషన్‌ల పేరుతో విపరీతాలంకారాలు చేయనంత వరకు, సమాజంలో స్త్రీపై అత్యాచారాలు చాలావరకు తగ్గే అవకాశం ఉంది. పైగా శూర్పణఖ విపరీత అసభ్య ప్రవర్తనతో వెగటుపుట్టిన శ్రీరాముడు సీతకు స్త్రీ ప్రవర్తనా విధానంపై కొన్ని మార్గదర్శక సూత్రాలు అందించాడు అనడం సహజంగానే కనిపిస్తుంది.

అవతారిక :- గత మూడు మంత్రాల్లో శూర్పణఖ వృత్తాంతాన్ని వివరించిన వేదమాత, ఖరదూషణ సంహార వృత్తాంతాన్ని 50,51 మంత్రాల్లో అందించబోతోంది.

**మంత్రాలు 50, 51 :**

**స ఇద్దాసన్తు వీరవం పతిర్దన్ షళక్షం త్రిశీర్షాణం దమన్యత్। అస్య త్రితో న్వోజసా వృధానో విపా వరాహమయో అగ్రయా హన్॥**
(ఋగ్: 10-99-6)

**యదచరస్తన్వా వావృధానో బలానీన్ద్ర ప్రబ్రువాణో జనేషు।
మాయేత్సా తే యాని యుద్ధాన్యాహుర్నాద్య శత్రుం నను పురా వివిత్సే॥**
(ఋగ్: 10-54-2)

తాత్పర్యం :- శూర్పణఖ విరూపతను చూసి రామలక్ష్మణుల వధార్థమై వచ్చిన ఖరదూషణ త్రిశిరులను రాముడు చంపేశాడు. దుష్టులను దమించే రాముడు సంసారానికి దూషణంగా (విసర్జించ తగినవాడుగా) ఉన్న దూషణుడిని, అనేక వికృత స్వరాలు వెలువరించే ఖరుడిని, ఆరు నేత్రాలు మూడు తలలు గల త్రిశిరుడిని దునుమాడాడు. వీరినందరిని చంపిన



బలంతోనే బొటనవేలి గోటిమొన అగ్రభాగసమానుడు వరాహాకారుడు అయిన త్రిశుడు అనే రాక్షసుడిని కూడా సంహరించాడు.

ఈ రకంగా ఖరదూషణాది రాక్షసులను సంహరించిన రాముడిని దేవతలు స్తుతించారు. 'ఓరామా!, మీ అపరిమిత శక్తితో జనస్థానంలోని రాక్షసులనందరినీ సంహరించారు. పౌరాణికులు వర్ణించిన యుద్ధాలన్నీ మీ మాయారూపాలే. పూర్వకాలంలోనూ, ఇప్పుడు కూడా మీరు శత్రు (దుష్ట) సంహారం చేయటం బాగా ఎరుగుదురు' అన్నారు.

వ్యాఖ్యానం :- శూర్పణఖ, సీత చరిత్రలు కేవలం ఇద్దరు స్త్రీల చరిత్రలు మాత్రమే కాదు. అనాది నుండి స్త్రీ స్వాతంత్ర్యం గురించి జరుగు తున్న చర్చలలో ప్రధానంగా రెండు వర్గాలుగా విడిపోయి వాదించు కొనేవారి ఆలోచనా ధోరణులకు దర్పణాలు ఈ రెండు పాత్రలు.

మైథిలీ పాత్రలో శీలం-సౌజన్యం-పాతివ్రత్యం మొదలైన గుణాలు కనిపిస్తాయి. ఇవన్నీ స్త్రీ దౌర్భాగ్యాలనిపిస్తాయి. అలాగే శూర్పణఖలో విశృంఖలత, పూర్ణస్వాతంత్ర్యం, భోగలాలసత, స్వేచ్ఛాకామం ఇవన్నీ యథార్థ వాదంగా కనిపిస్తుంది. కానీ హిందూశాస్త్రాలు రామాయణాది ఇతిహాసాలు నారీ మర్యాదను మనకు సాక్షాత్కరింప చేసిన విధానమే వేరు.

*సూపనఖా రావన కైబహినా।
దుష్ట హృదయ దారున జన అహినా॥*

శూర్పణఖ రావణుడి చెల్లెలు. దారుణ కాలసర్పం లాంటి దుష్టహృదయం కలది అంటాడు తులసి. భర్త ఉన్నా, చనిపోయినా కూడా ఫలానా వాని భార్య అంటూ పరిచయం చేయాల్సిన వయసులో వున్న ఆవిడను లేదా యౌవనవంతుడైన కొడుకును కలిగి ఉన్న ఆవిడను అతని తల్లిగా చెప్పటం పోయి రావణాసురుని చెల్లెలు అని పరిచయం చేయటంలో విశేషం వుంది. శూర్పణఖ మొదటి నుంచీ కూడా రావణుని రక్షణలోనే

ఉంది. అంతేకాక రావణుడు, శూర్పణఖ ఇద్దరూ ఒకే పోలికలో ఉంటారు. రావణుడు స్త్రీవేషం ధరిస్తే అచ్చం శూర్పణఖే అవుతాడు.

'కుపుత్రో జాయేత క్వచిదపి, కుమాతా న భవతి'-ఈ లోకంలో కుపుత్రుడు కనిపిస్తాడు కానీ కుమాత కనిపించదు. అయితే ఈ ఆర్యోక్తి రావణ-శూర్పణఖల విషయంలో మాత్రం నిజం కాలేదు. రావణుడు తన కామతృప్తి కోసం మొత్తం తన పరివారాన్ని, సంతానాన్ని కూడా బలి చేస్తాడు. శూర్పణఖ తన కుమారుణ్ణి చంపిన లక్ష్మణుడినే వరించవచ్చింది.

భర్త గతించిన స్త్రీకి సమాజం రెండు మార్గాలు చూపుతుంది. గతించిన భర్త స్మరణ నుండి క్రమంగా ఆమె తన మనసును ఆధ్యాత్మికత వైపుకు మరల్చుకోవటం, ఆ భర్త తనకిచ్చిన సంతానాన్ని తీర్చిదిద్దటం, లేదా సంతానం లేని స్త్రీ అయితే మరో వివాహం చేసుకోవటం. కాని శూర్పణఖ మాత్రం ఈ రెండు మార్గాలు వదిలేసి విచ్చలవిడిగా విహరించ టానికే నిర్ణయించుకుంది. దానికి రావణాసురుడు అనుమతి కూడా ఇచ్చాడు.

సముద్రం మధ్యలో ఉన్న లంకానగరం శూర్పణఖకు బందీఖానాగా తోచింది. అందుకే రావణుడు ఆమెను దండకారణ్యంలో విహరిస్తూ, ఖర దూషణుల రక్షణలో ఉండమన్నాడు. అక్కడా ఆమె రావణుని(అన్న) రక్షణలోనే ఉన్నది. లక్ష్మణుడు తన ముక్కు, చెవులను తెగగోయగా, శూర్పణఖ వెళ్లి ఖరదూషణులకు చెప్పింది. వారామెను అసలు నువ్వక్కడికి ఎందుకు వెళ్లావ్? అనడిగితే ఆమె 'పానీగ్రహణ్ కర్నే కేలియే (నీటికోసం; పానీ=నీరు)' అని చెప్పింది. నిజానికి ఆమె 'పానీ' కోసం కాదు, 'పాణీగ్రహణ్' కోసం వెళ్లిందని కొందరు వ్యాఖ్యాతలు చమత్కరిస్తారు. శూర్పణఖదే తప్పయి ఉంటుదన్న విషయం తెలిసినా, ఆమె మీద ఉన్న ముద్దు కారణంగా ఖరదూషణ త్రిశిరులు వెంటనే రామలక్ష్మణుల మీదకు యుద్ధానికి వెళతారు.



రాముడిని శ్రుతిరక్షకుడంటాయి పురాణేతిహాసాలు. రాక్షసులది శ్రుతి(వేదం) లేని జీవితం. అందుకే అది 'వేదన'తో కూడుకున్న జీవితం. శ్రుతి(వేద) పాలకుడైన రాముడితో శ్రుతి(చెవి) లేని శూర్పణఖను ముందుంచుకొని రాక్షసులు యుద్ధానికి వచ్చారు.

*సూపనఖా ఆగే కరి లీన్హీ! అసుభరూప శ్రుతినాసా హీనీ?*

అంటే నియంత్రణాయుత జీవితం లేనివారు, నియంత్రిత జీవితం గడిపే ఆర్యసంప్రదాయంతో యుద్ధం చేయటానికి వచ్చారు.

వాల్మీకి రామాయణంలో మొదట 14 వేల మంది, తర్వాత మరల 14 వేల మంది రాక్షసులతో ఖరదూషణత్రిశిరాదులు రామునితో యూద్ధానికి వచ్చారు. తన పైకి వస్తున్న ఆ రాక్షసులను చూసి రాముడు

*తస్మాత్ గృహీత్వా వైదేహీం శరపాణి ర్ధనుర్ధరః।*
*గుహామాశ్రయ శైలస్య దుర్గాం పాదప సంకులామ్॥*

"లక్ష్మణా, ధనుష్పాణివై సీతను తీసుకొని కొండ క్రిందనున్న గుహలోకి వెళ్లు'' అన్నాడు.

వారు వెళ్లిన తర్వాత రాముడు శస్త్రాస్త్రాలతో ఆ రాక్షసులను వధిస్తాడు. రాముడు ప్రయోగించిన గంధర్వాస్త్రం వల్ల రాక్షసులు ఒకరి కొకరికి రాముడిలా కనిపించి, పరస్పరం చంపుకుంటారు. (వాల్మీకం-గౌడీయ పాఠం). లక్ష్మణుడే ఖరదూషణులను చంపినట్లు బ్రహ్మవైవర్త పురాణంలో ఉంది. ఇది కల్పభేదంరీత్యా కావచ్చు. అయితే పై వేద మంత్రంలో మాత్రం రాముడే ఈ రాక్షసులను, త్రితువు అనే రాక్షసుడిని కూడా సంహరించినట్లుంది. ఈ కథారచయితకు ఏ రామాయణంలోనూ త్రితుడి వృత్తాంతం కనిపించలేదు. **ఎవరికైనా తెలిస్తే ఆవృత్తాంతం తెలుపగలరు - రచయిత.**

ఇలా రాక్షస సంహారం చేసిన రాముడిని దేవతలు స్తుతిస్తూ, యుద్ధాలన్నీ రాముడి మాయగా పేర్కొంటారు.

ఆర్ష సంస్కృతికి విఘ్నకారులై ఇతరులకు హానిచేస్తూ, ఇచ్ఛా విహారంతో సామాజిక నియమాలను భంగపరిచే రాక్షసులను ఎవరెవరిని ఏయే సాధనాలతో, ఏ ఏ మార్గాలతో సంహరించి ఆర్యధర్మాన్ని ఎలా రక్షించాలో రాముడెరిగిన వాడని పై వేదమంత్రం ద్వారా దేవతలు స్తుతించారు.

అవతారిక:- 50, 51 మంత్రాల్లో దండకారణ్యాన్ని రాముడు ధర్మారణ్యంగా మార్చిన వృత్తాంతాన్ని వివరించి వేదమాత 52, 53 మంత్రాల్లో శూర్పణఖ ప్రతీకారం నెరవేర్చడానికి కదిలి వచ్చిన రావణుని వృత్తాంతాన్ని, మారీచవధను అందించబోతోంది.

**మంత్రాలు 52, 53 :**

**స్త్రియం దృష్ట్వాయ కితవం తతాప2న్యేషాం జాయాం సుకృతం చ యోనిమ్। పూర్వాహ్ణే అశ్వాన్యయుజే హి బభ్రూన్సో అగ్నేరన్తే వృషలః పపాద॥** (ఋగ్: 10-34-11)

**ఇన్ద్ర తుభ్యమిదద్రివో2నుత్తం వజ్రిన్ వీర్యమ్। యద్ధ త్యం మాయినం మృగం తముత్వం మాయయావధీరర్చన్ననుస్వరాజ్యమ్ ॥** (ఋగ్: 1-80-7)

తాత్పర్యము:- జరిగిన వృత్తాంతమంతా శూర్పణఖ ద్వారా విని, ముక్కు, చెవులు తెగిన దానిని చూసి రావణుడు, సీతను - అగ్నిహోత్రాన్ని - ఇక్ష్వాకు వంశాన్ని దుఃఖంలో ముంచే కార్యం చేయ నిశ్చయించాడు. ముందుగానే గుఱ్ఱాలు పూన్చిన రథాన్ని ఎక్కి, ధర్మద్రోహి రావణుడు మారీచుడితోబాటుగా రాముడి అగ్నిశాల వద్దకు వచ్చాడు.



మారీచుడిని సంహరించిన రాముడిని స్తుతిస్తూ, "రామా! అన్ని వ్యాఖ్యలకూ అతీతమైనది నీ పరాక్రమం; నీవు శివధనుస్సును విరిచిన వాడవు. హే వజ్రిన్! మానవరూపాన్ని ధరించి మాయ జింక రూపాన్ని ధరించిన మారీచుడిని సంహరించడం మీ వంశ పరంపరకు అనుకూలంగా ఉంది'' అన్నారు.

వ్యాఖ్యానము:- కొన్ని వేల మంది రాక్షసబంధువులు తన కండ్ల ముందు తన కారణంగా మరణించినా శూర్పణఖకు పశ్చాత్తాపం గానీ దుఃఖం గాని కలగలేదు. స్వార్థము, వ్యక్తి గత తృష్ణ, తృప్తికి మాత్రమే ప్రాధాన్యతను ఇచ్చేవారికి స్వకుటుంబీకుల మీద కూడా ప్రేమ, ఆప్యాయత లుండవు. రావణ శూర్పణఖ లిరువురు ఈ కోవకు చెందినవారే. ముక్కూ చెవులు పోగొట్టుకొని, ఇటు దండకారణ్యంలోని రాక్షస సమూహాలనన్నింటినీ రామబాణాగ్నిలో శలభాలుగా దహింపచేసి, తానెలా రావణుడికి ముఖం చూపించాలి అనే ఆలోచన లేశమాత్రమైనా లేని శూర్పణఖ, క్రోధాగ్నిలో దహింపబడుతూ లంకానగరాన్ని చేరింది.

"ఒళ్లూ, ఇల్లూ, రాజ్యం, కోశం అన్నీ మరచి తాగి పడుకుంటున్నావా? నీ నెత్తి మీద ఉన్న ప్రమాదం నీకు తెలిసిరావడం లేదా? రాజనీతి లేకుండా రాజ్యం, ధనం లేకుండా ధర్మం, హరునికి సమర్పించని సత్కర్మ ... శత్రువు, నిప్పురవ్వ, పాము, ఎంత చిన్నగా ఉన్నాసరే ఉపేక్షిస్తే సర్వనాశనం అవుతుందనే విషయం నీకెవరూ చెప్పలేదా? అని పెద్దగా ఉపదేశం చేస్తూ, రోదనం చేస్తూ శూర్పణఖ రావణాసురుడి నిండు సభలో కుప్పకూలింది.

శూర్పణఖ, రావణులు ఇద్దరూ గొప్పపండితులే. వారెరుగని శాస్త్రం లేదు. వారుపదేశింప పూనుకున్నప్పుడు బృహస్పతి కూడా వారికి సాటిరాడు. కాని వారి ఆచరణ మాత్రం చెప్పే విషయానికి అనుగుణంగా ఉండదు. తనకు ప్రతిరూపం లాంటిది కనుకనే రావణుడు కూడా శూర్పణఖ దూషణను, ఉపదేశాన్ని నిండు సభలో అంతసేపు ఓపికగా విన్నాడు. అదే మరొకరైతే వెంటనే తల తీయమనేవాడు.

రావణుడు మెల్లగా 'అసలు జరిగిందేమిటి? విషయాన్ని దాస్తా వెందుకు? నీ ముక్కు చెవులు కోసింది ఎవరు? అయినా అటువంటి ప్రమాదమేదైనా వస్తే చూసుకోవడానికి దండకారణ్యంలో ఖరదూషణులు లేరా?' అన్నాడు.

అప్పుడు మెల్లగా జరిగిన విషయాన్ని చెప్పింది శూర్పణఖ. దశరథ మహారాజు కుమారులైన రామలక్ష్మణులు దండకారణ్యంలో నివసించడం, పంచవటికి వెళ్లిన తన ముక్కు చెవులను చిన్న కుమారుడైన లక్ష్మణుడు కోసివేయడం, తానీ విషయం ఖరదూషణ త్రిశిరులకు చెప్పగా వారంతా యుద్ధానికి వెళ్లి, 14 వేల సైన్యంతో సహా రాముడి చేతిలో చనిపోవడం అన్నీ చెప్పింది. శూర్పణఖకు తన అన్న రావణాసురుడి బలహీనతలు తెలుసు. స్వార్థపరుడైనవాడు తన కొరకు ఏమిచేయడని తెలుసు. తాను దండకారణ్యంలో నియోగించిన రాక్షసులు చంపబడ్డారని, సీత అత్యంత సౌందర్యవతని చెప్పడం ద్వారా వాడిలో ప్రతీకారాగ్నిని, కామాన్ని రెచ్చగొట్టింది. కానీ అది ఆశించినట్లు రావణుడిలో ప్రతీకారం కామం కాక విచిత్రంగా మరోభావం లేచింది. అదేమిటంటే.....

ఖరదూషణులు నాలాగే బ్రహ్మ గురించి తపస్సు చేసి అనేక వరాలు పొందినవారు కదా! వారు బలశౌర్యాలలో నాతో సమానులు. వారెవరూ మామూలు వ్యక్తుల చేతిలో చనిపోరే! సాక్షాత్తు భగవంతుడైతేనే వారిని సంహరించగలడు. అయితే ఆ పరమాత్మే రామ రూపంలో ఈ భూమి మీద అవతరించాడా? ఈ ఆలోచన వచ్చిన మరుక్షణం రెండు మూడు మాటలలో శూర్పణఖను ఓదార్చి, దీర్ఘాలోచనానిమగ్నుడైన రావణుడు సభ చాలించి ఏకాంత మందిరంలోకి వెళ్లిపోయాడు.

కొందరు టీకాకారులు పై మాటలను ఉదాహరిస్తూ, రావణుడు, రాముణ్ణి భగవంతుడని గురుపట్టి భక్తుడై కూడా, తమోగుణ శరీరంతో సాధన కాదని ఎంచి వైరభక్తికి దిగాడని, అతని శత్రుత్వం వెనుక భక్తి దాగి



ఉన్నదని అంటారు. కానీ జగజ్జననీ సీతను అశోక వాటికలో నిలిపి ఆవిడ ముందు శృంగారాన్ని ఒలకబోసేవాడు భక్తుడెలా అవుతాడు?

ఏది ఏమైనా రావణుడికి తన ఏకాంత మందిరంలో ఇక ఆ రాత్రి నిద్రలేదు. ముందు అన్నదమ్ములిద్దరినీ జయించి సీతను తీసుకురావాలనుకున్నాడు. ప్రతీకారక్రోధం - కామం రెండూ ఆ ఆలోచనలో సమాహితమై ఉన్నాయి. కానీ క్రమంగా క్రోధం అంతరించగా కేవలం కామం మాత్రమే మిగిలిపోయింది చివరికి. అది సీతాపహరణ సంకల్పంగా రూపుదాల్చింది. అప్పుడు వాడికి మారీచుడు గుర్తుకువచ్చాడు.

మహాభారత రామోపాఖ్యానంలో రావణుడు రథం ఎక్కివచ్చినట్లుగా కనిపించదు. కానీ వాల్మీకి రామాయణంలో, అంకేనాదాయ వైదేహీం రథమారోహయ త్తథా - అంటూ రథం ఉల్లేఖనం ఉంది. పై వేదమంత్రంలో కూడా ముందు గుఱ్ఱాలు పూన్చబడిన రథం ఎక్కి రావణుడు వచ్చినట్లుగా ఉంది. వాల్మీకాన్ని అనుసరించి, సీతాపహరణ సంకల్పంతో తన వద్దకు వచ్చిన రావణుడికి మారీచుడు రామపరాక్రమాన్ని వివరించి 'కౌమారావస్థలో ఉండగానే మొండి బాణంతో సిద్ధాశ్రమం నుండి పంచవటి వరకు వంద యోజనాల దూరం నన్ను కొట్టివేసిన రాముడు ఇప్పుడు సర్వశస్త్ర అస్త్రకోవిదుడై నిండు యవ్వనంలో శక్తి సంపన్నుడై ఉండగా అతడిని నీవు ఎదుర్కొనగలవా?' అంటూ వెనక్కు పంపించాడు. కానీ రావణుడు మళ్లీ తిరిగి వచ్చాడు. తపస్వి జీవితం గడుపుతున్న తనను ఈ కుతంత్రంలోకి లాగవద్దని ఎంత చెప్పినా వినక రావణుడు మారీచుడిని వధిస్తానని భయపెడతాడు. చివరికి తనను చంపిన చేతులతోనే రాముడు అతన్ని, అతని వంశాన్ని కూడా సంహరిస్తాడని హెచ్చరిస్తూ - అనేన కృతకృత్యోऽస్మి మ్రియో చాప్యరిణాహతః - నేను రాముడి చేతిలో మరణించి కృతకృత్యుడనై ముక్తి పొందుతాను, ఈ దుర్మార్గుడి చేతిలో చావడం కన్నా అదే ఉత్తమ మరణం అని భావించి, వాడి కుతంత్రంలో పాలుపంచుకోడానికి సంసిద్ధుడై మాయా

జింక రూపం ధరించి సీతాపహరణ ద్వారా సీతను, రాముడు నిత్యం అర్చించే అగ్నిహోత్రాన్ని, ఇక్ష్వాకు వంశాన్ని దుఃఖంలో ముంచ దలచిన సంకల్పం గల రావణుడి వెంట రాముని ఆశ్రమంలోని అగ్నిశాల వద్దకు వచ్చాడు.

ఏ క్షణంలోనూ భంగం కాని రామచరణ ప్రీతిగల మారీచుడు, ఇక తన చావు తప్పదని హృదయంలో గ్రహించినవాడై రావణుడి వెంట బయలుదేరాడు.

*అసజియ జాని దసానన్ సంగా,*
*చలా రామపద ప్రేమ అభంగా॥*

అంటూ తులసీదాసు మారీచుడి విచిత్రప్రేమను మన హృదయంలో హత్తుకునేటట్లు చెబుతాడు.

మొత్తం విశ్వ ఇతిహాసంలోనే మారీచుడి ప్రేమకథ లాంటిది మరొకటి కనిపించదు. తన ప్రియతముడి (రాముడి) ముందు తన ప్రేమను ప్రకటించే అవకాశం అతనికి ఏనాడూ రాలేదు. చివరికి అతని చేతిలోనే ప్రాణాలు విడిచాడు. రాముడి బాణాలతో తన శరీరం భంగమైంది; కానీ ప్రేమభంగం కాలేదు. అప్రతిహతమైన రామబాణం కూడా భేదించలేని ప్రేమ అతడిది. ఈ తాటకీ తనయుడు రాముడి ములికిలేని బాణం దెబ్బతో ద్వేషం వైరం నుండి ప్రక్షాళించబడి ప్రేమపూర్ణుడైనాడు. గోదావరి తటాన వచ్చిపడిన ఇతనికి సర్వత్రా రామదర్శనం కావడం మొదలు బెట్టింది.

సమస్త చింతనల ఘనీభూతరూపం మారీచుడు. అన్నిదోషాలు చింతన నుండే ప్రారంభమౌతాయి. 'ధ్యాయతో విషయాన్ పుంసః.......' విషయ చింతనల వల్లే కామన ఉత్పన్నమౌతుంది. చివరికది బుద్ధినాశనం, తత్పశ్చాత్ (ఆ తర్వాత) సర్వనాశనానికి దారితీస్తుంది. మారీచుడు చింతన కళలో నిపుణుడు. అందుకే ఇచ్ఛారూపాన్ని ధరించగలిగేవాడు. అందుకే రావణుడు కూడా వాణ్ణి ఆశ్రయించవలసి వచ్చింది. విశ్వామిత్ర యజ్ఞరక్షణ



కార్యంలో రాముడు దురాశ, దుఃఖం (తాటక, సుబాహు) రెంటినీ అంతం చేశాడు. (సుబాహు=ప్రపంచాన్నంతా ఆవరించేంత విశాలమైన బాహువులు; దుఃఖం అటువంటిది) అయితే వీటితో పాటు చింతనను (మారీచుణ్ణి) అంతం చేయలేదు. ఎందుకంటే విషయచింతనవల్ల మనిషి పతనమైతే, భగవత్ చింతనవల్ల ప్రేమ పెరిగి ఉత్థానుడౌతాడు. కనుక రాముడు చింతన రూప మారీచుడి మార్గాన్ని మాత్రం మార్చి విడిచిపెట్టాడు. ఇక అతడికి సర్వత్రా రామదర్శనం అవడం మొదలుబెట్టింది.

చిన్నపిల్లవాడికి ఏదైనా తినిపిద్దామని చూసినప్పుడు, వాడు నోరు తెరవడానికి మొరాయిస్తాడు. కాని ఒకసారి బలవంతంగానైనా దాన్ని వాడికి తినిపిస్తే రుచిమరిగి నిరంతరం అదే కావాలంటాడు వాడు. అదే స్థితికి వచ్చాడు మారీచుడు. అయితే తల్లి ముద్దుల్లోనే కాకుండా, తల్లి కొట్టే దెబ్బల్లో కూడా ప్రేమ ఉంటుంది. కొందరు పిల్లలు మాత్రమే దాన్నర్థం చేసుకోగలరు. అలా దూరంగా నెట్టివేయబడిన మారీచుడు, హృదయగతంగా పరమాత్మకు దగ్గరైనాడు. పరమాత్మతో తన కలయిక అనే ఇచ్ఛాపూర్తికి సాధనగా సర్వసమర్పణను ఎన్నుకొన్నాడు.

**'గుణరహితం కామనారహితం ప్రతిక్షణం వర్ధమానమవిచ్ఛిన్నం సూక్ష్మతర మనుభవరూపం'** - ఈ ప్రేమ గుణరహితమైనది, కామనా రహితమైనది, ప్రతిక్షణం వృద్ధిపొందేది, సూక్ష్మాతి సూక్ష్మమైనదయినప్పటికీ అనుభవానికి అందేది అని దేవర్షి నారదుడు వ్యాఖ్యానిస్తాడు.

1. ***గుణరహితం:*** ఈ లక్షణం మారీచునిలో సాక్షాత్కరించింది. విశ్వామిత్రుని యాగంలో ధనుర్ధారియై అతడికి దర్శనమిచ్చిన రాముడిలో కోమలతా క్షమాది గుణాలున్నాయని భావించలేదు. స్వామి క్రోధసంహారాది క్రియాకలాపాలు అతడిని విచలితుడిని చేయలేదు. ఆ దోషగుణాలను కూడా ప్రేమించాడు కనుక అతడికి గుణరాహిత్యం వచ్చింది.

2. ***కామనారహితం:*** రాముడి నుండి అతడు భోగం కాని, ముక్తి గాని కోరలేదు. కనుక అతడి ప్రేమ కామనారహితమైంది.

3. ***ప్రతిక్షణం వర్ధమానం:*** ఇక రావణాసురుడి ప్రోద్బలంతో మాయాలేడి గా మారి స్వామి ఆశ్రమం వైపుకు వెళుతుంటే అతని ఆలోచనలన్నీ ప్రీతితో మరుక్షణం ఇలా వృద్ధి చెందాయి......

'ఆహా! ఈ రోజు మళ్లీ పరమాత్మను దర్శించగలుగుతాను కదా! నా ప్రియతముడి దర్శనంతో నా నేత్రాలు ఇన్నాళ్లకు శీతలం కానున్నవి కదా! లక్ష్మణ సీతా సమేతుడైన శ్రీరాముడి శ్రీచరణాలు ఇక నా హృదయంలో శాశ్వతంగా ఉండిపోతాయి కదా! నిర్వాణదాయకమైన ఆ పరమాత్మ క్రోధాగ్నిలో నా ప్రేమ ఈ రోజు వన్నెకెక్కుతుంది కదా! శ్రీరాముడి భుజాలు అనే తీర్థంలో మునిగి నేను శాశ్వతశాంతిని పొందుతాను కదా! విల్లు మీద బాణం ఎక్కుపెట్టి నా వెంట పరుగెత్తుకు వచ్చే నా స్వామిని నేను మరల మరల వెనక్కు తిరిగి చూస్తూ పరుగెత్తుతాను కదా! ఆహాఁ ఈరోజు నా కన్నా ధన్యులెవరు?' అంటూ ఇలా నిరంతరం తన ప్రేమను పెంచుకున్నాడు.

4. ***అవిచ్ఛిన్నం:*** రాముడి బాణాలు అతడి ప్రేమను మాత్రం విచ్ఛిన్నం చేయలేకపోయాయి.

   ప్రాణం విడిచే సమయంలో తన నిజరూపాన్ని ప్రకటించాడు (కపటం విడిచాడు). ఎంతో ప్రేమతో రాముణ్ణి చూస్తూ ఆయన నామాన్ని స్మరిస్తూ ప్రాణాలు విడిచాడు.

   ప్రాణ తజతి ప్రగటేసి నిజదేహా
   సుమిరెని రాము సమేత సనేహా

5. ***సూక్ష్మతరం:*** మారీచుడి భక్తి ఎంత సూక్ష్మతరం అంటే, అతడి బాహ్యచేష్టల ద్వారా ఎవరూ అతడిని భక్తుడుగా గుర్తించలేదు.



6. ***అనుభవరూపం:*** మారీచుడి ప్రేమ ఒక్క పరమాత్మకు తప్ప ఎవరికీ అనుభవానికి రాలేదు. దాన్ని గ్రహించిన పరమాత్మ మునులకు కూడా దుర్లభమైన గతిని అతనికి ఇచ్చాడు.

లౌకిక దృష్టిలో మారీచుడు తన రాజు రావణుడి ఆజ్ఞ పాలించి అతడి కొరకు ప్రాణాలు అర్పించిన సమర్పణ భావంగల సేవకుడు. కానీ మానసరామయణం, అతడు ప్రాణాన్ని విడవడానికి సిద్ధపడ్డ కారణాన్ని చాలా విచిత్రంగా వర్ణిస్తుంది. రావణుడి మొండితనాన్ని గ్రహించిన మారీచుడు ఇలా ఆలోచించాడు.

'చేత ఆయుధం ధరించిన వాడితో (శస్త్రీ), మర్మమెరిగిన వాడితో (బ్లాక్ మెయిలర్),యజమానితో (ప్రభు), మూర్ఖుడితో (శఠ), ధనవంతుడితో (ధని), వైద్యుడితో, వందిమాగదులతో, కవితో, దుర్మార్గుడితో వైరం పెట్టుకోకూడదు. ఇందులో చాలా గుణాలు రావణుడిలో ఉన్నాయి. ఎంతో వివరించిన తర్వాత కూడా వాడు సీతాపహరణ సంకల్పం నుండి వెనక్కు వెళ్లడం లేదంటే ఇందులో సర్వాంతర్యామి రాముడి సంకల్పం కూడా తప్పక ఉండే ఉంటుంది. మరి ఎందుకని నేను ఆయన 'లలితనరలీల'లో పాలుపంచుకోకూడదు? అంటూ మారీచుడు ముందుకు సాగాడు.

ఇలా మారీచుడిని వధించిన రాముడిని - మీ వంశ పరంపరకు అనుగుణంగా మీరీకార్యం చేశారంటూ ఒక ఋషి స్తుతించినట్లుంది పై వేదమంత్రంలో, రఘువంశ పరంపరలో దుష్టసంహరణే కాక, ప్రియజన - ఆర్తజన రక్షణ కూడా ఉంది కనుక మారీచవధను ఆర్తజన రక్షణగా తీసుకోవచ్చు.

అవతారిక:- 52, 53 మంత్రాలలో మారీచవధ వరకు వివరించిన వేదమాత 54, 55, 56 మంత్రాలలో సీతాపహరణ కథను మన ముందు ఉంచబోతున్నది.

**మంత్రాలు 54, 55, 56 :**

**యో వః సేనానీర్మహతో గణస్య రాజా వ్రాతస్య ప్రథమో బభూవ। తస్మై కృణోమి న ధనా రుణధ్మి దశాహం ప్రాచీ స్తదృతం వదామి॥** (ఋగ్: 10-34-12)

అగ్నిరువాచ:-

**ఇనో రాజన్నరతిః సమిద్ధో రౌద్రో దక్షాయ సుషుమాఙ్ అదర్శి। చికిద్విభాతి భాసా బృహతా2సిక్నీమేతి రుశతీమపాజన్॥**

(ఋగ్: 10-3-1)

**కృష్ణాం యదేనీమభి వర్పసా భూజ్జనయన్ యోషాం బృహతః పితుర్జామ్। ఊర్ధ్వం భానుం సూర్యస్య స్తభాయన్దివో వసుభి రరతి ర్విభాతి॥** (ఋగ్: 10-3-2)

తాత్పర్యము:- రామలక్ష్మణులు దూరంగా వెళ్లడము, వారి అనుగామి అయిన సీత ఒంటరిగా ఉండటం చూచి, రావణుడు ఆమె వద్దకు వచ్చాడు. తన వైపు వస్తున్న రావణుణ్ణి చూసి సీత, 'ఓరి రాక్షస సేనా నాయకా, రాక్షస రాజా! శీఘ్రమే నిన్ను నేను నాశనం చేస్తాను. నాకు నీ ధనం మీద ఆశలేదు. దశదిశలను సాక్షిగా భావించి నేనీ ప్రతిజ్ఞ చేస్తున్నాను' అన్నది.

ఈ విధంగా నిరస్తుడైన రావణుడు సీతాపహరణానికి ఉద్యుక్తు డవడం చూసి, అగ్ని మనసులోనే రాముడిని స్మరిస్తూ ఇలా అన్నాడు. 'ఓ రాజా, బలశాలి, కామసుఖాన్నిపొందలేనివాడు, కామాగ్ని బాగా ప్రజ్వలించిన వాడు, భయంకరుడు, సాహసంతో సమర్థుడిగా కనిపిస్తున్నవాడు, మీ శక్తిని ఎరిగి కూడా విపరీతకార్యం చేసేవాడు అయిన ఈ రావణుడు కాళరాత్రిలాగా ఈ సీతను ఎత్తుకుపోతున్నాడు'.

కాళరాత్రిలాగా వివర్ణమై ఉన్న సీతను బలపూర్వకంగా ఎత్తుకు



పోబోతుంటే, సీత తన వాస్తవిక రూపాన్ని తిరోహితం చేసి, తన స్థానంలో ఛాయాసీతకు జన్మనిచ్చింది. ఆవిడ వాస్తవిక రూపాన్ని అగ్ని దాచి పెట్టాడు. దేవతలు ఆపేంతలోనే రావణుడు ఈ ఛాయాసీతను తీసుకొని ఆకాశ మార్గాన ఎగరసాగాడు.

వ్యాఖ్యానము:- వాల్మీకి, ఆధ్యాత్మ రామాయణాల ననుసరించి, చనిపో బోయే ముందు మారీచుడు రాముడి కంఠాన్ని అనుకరిస్తూ పిలిచిన పిలుపుకు సీత భయపడి తనకు రక్షణగా ఉన్న లక్ష్మణుణ్ణి చూస్తూ, కోపంతో ఆవిడ అనేక దుర్భాషలాడుతుంది. అందులో ముఖ్యంగా - 'నా మీద కోరికతో నీవు మా వెంట అరణ్యానికి వచ్చావు. అందుకే ఆపదలో ఉన్న మీ అన్న సహాయానికి వెళ్లటం లేదు. నేను ప్రాణాలైనా తీసుకుంటాను గాని, నీకు మాత్రం లభించను' అను కటువుగా మాట్లాడుతుంది.

*తులసీ రామాయణంలో కూడా :-*

ఎప్పుడైతే సీత మర్మవచనాలు పలికిందో, హరి ప్రేరితమై లక్ష్మణుడి మనసు డోలాయమానమైంది.

*మరమ వచన జబ సీతా బోలా।*
*హరి ప్రేరిత లఛిమన్ మనడోలా॥*

సీతమ్మ ఏ మర్మవచనాలు పలికిందో ఇక్కడ చెప్పడు, కానీ ఒకవేళ అన్యరామాయణాల్లో ఉన్నట్లు అనరాని మాటలు ఆవిడ అన్నా వాటి ఫలితాన్ని పశ్చాత్తాప రూపంలో సుదీర్ఘకాలం వరకు లంకలో ఏకాంత చెఱలో అనుభవించింది. చివరికి యుద్ధానంతరం వేలమంది కపివీరుల ముందు శ్రీరాముడు పలికే కటువైన వాక్యాలను తలవంచుకొని విని సహించింది. వాటినన్నిటినీ లక్ష్మణుడి విషయంలో తాను చేసిన పాపం ఫలితంగానే ఆవిడ స్వీకరించింది. తల్లిదండ్రులను భార్యను కూడా విడిచి సీతారాములే తన సర్వస్వం అనుకుంటూ సేవాభావంతో వచ్చిన పసి హృదయాన్ని

గాయపరిచానే అని సీతమ్మ తల్లడిల్లింది. సీతాన్వేషణలో వచ్చిన హనుమంతుడి ద్వారా కూడా తన క్షమాయాచనను లక్ష్మణుడి వద్దకు పంపింది.

రామలీల ముందుకు సాగాలంటే సీతాపహరణం అత్యవసరం, కానీ సేవాపరాయణుడైన లక్ష్మణుడు అలా రామాజ్ఞచేత నిలబడి పిడుగులు పడినా కదిలేలా లేడు. అప్పుడిక ఆయనను దూరంగా పంపడం ఎలా? అందుకే అనేక రామాయణాల్లో 'నీవు వెళ్ళకపోతే నేను ఇప్పుడే ప్రాణత్యాగం చేస్తాను జాగ్రత్త' అని హెచ్చరించడం కనిపిస్తుంది.

ఆధ్యాత్మిక అర్థంలో - స్వర్ణమృగం పైన సీతకు కోరిక కలగడం, రాముణ్ణి వెళ్లి దాన్ని పట్టి తెమ్మనడం, సాధ్యాన్ని సాధన వెంటపంపడమే. మారీచుడి కంఠాన్ని, రాముడి స్వరంగా భావించడం రెండవ భ్రాంతి. సర్వశక్తిమంతుడైన ఈశ్వరుడు సంకటస్థితిలో ఉన్నాడని భావించడం ఆయన శక్తిపై అవిశ్వాసపడినట్లవుతుంది. జీవుడు ఈశ్వరుడి నుండి దూరమైనా కనీసం సత్పురుషులను (సత్సాంగత్యం) విడవకూడదు. కానీ సత్పురుషుడి శీలాన్నే శంకించడం పూర్తి బుద్ధివ్యామోహాన్నే సూచిస్తుంది. నిజమైన మహాత్ముడి పైన అవిశ్వాసం యొక్క ఫలితం వెంటనే కనిపిస్తుంది. ఫలరూపకంగా మాయాసాధువు రంగంలోకి ప్రవేశించాడు. ఈ మాయా సాధువు మోహితురాలి విశ్వాసాన్ని సులభంగా జయించి, సాధువు (లక్ష్మణుడు) గీసిన గీతను దాటేలా చేశాడు. చివరికి సీత మాయామోహ నగరంలో బందీ అవక తప్పలేదు.

ఈ సంఘటనలో వ్యాఖ్యాతలు లక్ష్మణుడి లోపాన్ని కూడా ఎత్తి చూపుతారు. ఒకప్పుడు ఆయన చిత్రకూటం వైపుకు వస్తున్న భరతుడి సైన్యాన్ని చూసి, భరతుడు రామ సంహారార్థమై వస్తున్నాడని భావించి, భరతుడి విషయంలో అనేక దుర్భాషలాడతాడు. మాయ ఎంత ప్రబలమైనదో ఆయనకు ఆ సంఘటన బాగా నేర్పింది. కానీ ఈ రోజు మాయకులోనై



భయకంపితురాలవుతున్న సీత తనను వెళ్ళమనగానే పెద్దగా నవ్వడం తప్పు. ఆ నవ్వులో రాముడి సర్వశక్తిమత్వం పైన ఆయనకున్న అచంచల విశ్వాసాన్నే ప్రకటించి ఉండవచ్చుగాక! కాని మాయామోహ వశురాలైన సీతకు దాని అర్థం మరోలా భాసించి ఉండవచ్చు కదా! అప్పుడు లక్ష్మణుడు కూడా భారీగానే మూల్యం చెల్లించవలసి వచ్చింది. చాలాకాలం వరకు ఆయన ముఖం నుండి నవ్వు కూడా మాయమైంది. దాదాపు ఒక సంవత్సర కాలం దుఃఖంలో మునిగి ఉన్న శ్రీరాముని ముఖాన్ని వీక్షిస్తూ దుఃఖపడవలసి వచ్చింది.

పై వేదమంత్రాన్ని అనుసరించి, తనను సమీపించిన రావణుడిని సీత వెంటనే గుర్తించి, వాడి ధనం గానీ, కీర్తి గానీ, అందం గానీ, తనను ఆకర్షించవనీ, తన క్రోధం చేత వెంటనే అతడిని తాను నాశనం కూడా చేయగలనని అన్నది.

తులసీ రామాయణాన్ని అనుసరించి ఈ మాట వినగానే రావణుడు కోపగించాడు. వెంటనే మనసులో ఆవిడకు నమస్కరించాడు. కోపంతో పాటు రావణుడికి ఆ పతివ్రత నిజంగానే తన శాపాగ్నితో ఎక్కడ దగ్ధం చేస్తుందో అనే భయం కూడా కలిగింది. అందుకే మనసులో నమస్కరించాడు.

సునత వచన దససేస రిసానా।
మన మహు చరన బంది సుఖమానా॥

సీతాపహరణానికి ఉద్యుక్తుడౌతున్న రావణుడిని చూసి, నిరంతరం తనను సేవించే రాముడికి ఈ విషయం తెలియజెప్పడం కోసం అగ్ని సూక్ష్మరూపధారియై దూరంగా అరణ్యంలో మారీచుడిని సంహరించి వస్తున్న రాముడి మనసులోకి ప్రవేశించి హెచ్చరించడం కూడా పై వేద మంత్రంలో కనిపిస్తుంది. నిత్యాగ్నిహోత్రులను వారి ధర్మం ఎలా నడిపిస్తుందో మనకీ మంత్రం తెలియజేస్తుంది.

భృగు, నారదుల శాపాల కారణంగా సీతాపహరణం జరిగిందని అనేక పురాణాల్లో కనిపిస్తుంది. 'ధిక్ త్వ మద్య వినశ్యన్తి యన్మామేవం విశంకసే' 'శత్రుహస్తం గమిష్యసి' నన్ను శంకించే నీకు ధిక్కారమగు గాక! నీవు వినాశనాన్ని పొందుతావు. నీవు శత్రువుల చేత పడతావు అంటూ లక్ష్మణుడు ఇచ్చిన శాపం కూడా సీతాపహరణ కారణమయిందంటారు కొందరు. కానీ, 'స్వస్తి తే2స్తు - నీకు స్వస్తి అగుగాక!'

ఓ విశాలాక్షీ వనదేవతలంతా నిన్ను రక్షింతురు గాక! నాకు అనేక అపశకునాలు కనిపిస్తున్నాయి. మళ్లీ నిన్ను రాముడితో పాటు దర్శించ గలనా? నీకు శుభమగు గాక!

*రక్షన్తు త్వాం విశాలాక్షీ సమగ్ర వన దేవతాః!*
*అపి త్వాం సహ రామేణ పశ్యేయం పునరాగతః॥*
అని శుభకారం చేసిన లక్ష్మణుడు ఎలా శపించగలడు?

కృత్తివాస రామాయణాన్ని అనుసరించి తాను కళ్యాణ సమయంలో చంద్రుడు ఉన్మత్తుడై నృత్యం చేయగా, అంతా స్థాణువులై చూస్తూ ఉండిపోయి ముహూర్తం దాటిపోవడం గుర్తించరు. చక్కని ముహూర్తానికి వివాహం కాని కారణంగా, సీతాపహరణ జరిగిందని తెలుస్తుంది.

పై వేదమంత్రంలో తనను చెరబట్ట వస్తున్న రావణుడిని చూసి సీత తన నిజరూపాన్ని అగ్నిలో దాచి, ఛాయా సీతను తన స్థానంలో నిలపడం కనిపిస్తుంది. ఈ ఛాయాసీత వృత్తాంతం అనేక రామాయణాలలో కనిపిస్తుంది.

నేను రాక్షసులను సంహరించే వరకు నువ్వు అగ్నిలో నివసించు - అని రాముడుచెప్పగానే ఆయనకు నమస్కరించి సీత అగ్నిలో ప్రవేశించింది.
జబహి రామ సబ కహా బఖానీ।
ప్రభు పద ధర హియ అనల సమానీ॥



'త్వాం అగ్నివర్ణాం తపస్వాజ్వలంతీం' తపస్సుచేత అగ్నివర్ణంలో ప్రజ్వలించేది - అని, 'చిదగ్నికుండ సంభూత' చైతన్యమనే అగ్నికుండం నుంచి ఉద్భవించిందని అమ్మవారిని స్తుతిస్తారు. కనుక సీత అగ్నిలో తన నిజరూపాన్ని దాచడం సహజమే. పైగా పంచభూతాలలో రూపతన్మాత్ర అగ్నికి సంబంధించినదే. ఆకాశ తన్మాత్ర అయిన శబ్దం గానీ, వాయు తన్మాత్ర అయిన స్పర్శ గానీ మనకు కనిపించదు. అగ్నితత్వం మరియు అంతకన్నా స్థూలమైన జల, భూ తత్వాలే రూపం కలిగి ఉంటాయి.

సీత ఆదిపరాశక్తి; శక్తి సర్వవ్యాపకమైనది అంటే పంచభూతాలలోనూ నిండి ఉంది. కానీ ఏ భూతం నుండి శక్తి ప్రకటమౌతుందో ఆ తత్వం యొక్క గుణాలు ఆ శక్తిలో ఉంటాయి. మొదట సీత భూమి నుండి ప్రకటమైంది. అందుకే భూమి యొక్క గుణమైన సహనశీలత ఆవిడలో ఎక్కువగా కనిపిస్తుంది. రాముణ్ణి వివాహమాడిన దగ్గర నుండి అన్ని కష్టాలు సహిస్తూ ఇంతవరకు అరణ్యవాసం చేస్తూ వచ్చింది. కానీ రావణవినాశనానికి ఈ క్షమ సహనశీలతాదిగుణాలు అపేక్షింప తగినవి కావు. అగ్ని యొక్క ముఖ్యగుణాలు దాహకత, ప్రకాశం. ప్రస్తుతం ఆ రెండు గుణాలే ఎక్కువ అవసరం. నిశాచారుల ద్వారా వ్యాపించే అంధకారాన్ని తొలగించడానికి, వారిని దహించడానికి అగ్ని అవసరమైంది. అందుకే సీతను రాముడు అగ్నిలో ప్రవేశించమన్నాడు.

సీతారాములు అభిన్నులు. వారిద్దరూ వేరు వేరు వ్యక్తులుగా కనిపించినా, రాముడు శక్తిమంతుడు - సీత శక్తి. వీరిని విడదీయడం సాధ్యం కాదు. అలా విడదీసే మనోవృత్తితోనే వారిని నడిపిద్దామని ఇటు శూర్పణఖ, అటు రావణుడు కూడా ప్రయత్నించారు. కానీ వారికి సాధ్యం కాలేదు. కనుక రాముడు ప్రస్తుతం భూతత్వ రూపంలో ఉన్న తన శక్తిని అగ్నితత్వంగా మార్చుకొని రాక్షస సంహారానికి సమాయత్తమైనాడు. యుద్ధానంతరం ఛాయాసీత అగ్నిలో ప్రవేశించగా, యథార్థసీత బయటికి వస్తుంది. ఆ

తర్వాత సీతను లక్ష్మీరూపిణిగా వర్ణిస్తారు. రాజ్యపాలనలో ధనావశ్యకత ఉంటుంది. అందుకే రాముడు పరిపాలనాకాలంలో తన శక్తిని ధనరూపంలో వినియోగించాడు. ఈ విధంగా సీత భూరూపంలో ఉద్భవాన్ని (సృష్టి), లక్ష్మీరూపంలో పాలనను (స్థితి), అగ్నిరూపంలో సంహారాన్ని (లయ) చేయడం కొరకు మూడు రూపాలలో ఆదిపరాశక్తిగా ప్రకట మౌతుంది.

ప్రసన్నరాఘవంలో గోదావరి మొదలైన నదులు సాగరానికి సీతాపహరణ వృత్తాంతాన్ని వివరిస్తాయి 'అపి నామ యమ వధూటికా స్ప్రుష్టా నిశాచరేన?' నా పుత్రవధువు (కోడలు)ను ఆ నిశాచరుడు స్పర్శించాడా? అని సాగరుడు ప్రశ్నించగా గోదావరి, 'న స్ప్రుష్టా' స్పర్శించ లేదు అని జవాబిస్తుంది. అంతేకాదు రావణుడు చెయ్యి వేద్దామని చూసినప్పుడు సీతకు అనసూయమాత ఇచ్చిన అంగరాగం అగ్నిలాగ కవచమై నిలిచింది. అప్పుడు రావణుడు వరుణ మంత్రంతో మేఘాలను రప్పించి వాటితో ఆవిడను కప్పిచుట్టి తీసుకువెళ్లాడు.

వాల్మీకి రామాయణంలో మాత్రం సీతాపహరణ ప్రసంగం అత్యంత భీభత్సంగా చిత్రించబడింది.

రావణుడు ఎడమచేత్తో పద్మాక్షి సీత జుట్టు పట్టుకొని, కుడిచేత్తో తొడలను పట్టుకొని రథం మీద కూర్చోబెట్టాడు.

వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణచ।
ఊర్వోస్తు దక్షిణే నైవ పరిజగ్రాహ పాణినా॥ (వా.రా. 3-49-17)

అయినప్పటికీ వాల్మీకి రామాయణంలోనే మాయాసీత యొక్క సూచన కూడా ఇలా ఉంది. మాయాదానవుడు ఆసురీమాయను దాచిపెట్టినట్లుగా రావణుడు సీతను లంకలో పెట్టాడు.

*నిదధే రావణః సీతాం మాయోమాయా మివాసురమ్ (వా.రా. 3-54-24)*

రావణుడు గోటితో భూమిని త్రవ్వి, చేతులతో లేపి, మట్టిపెళ్లను



రథం మీద ఉంచి తీసుకు వెళ్లాడు అని ఆధ్యాత్మ రామాయణంలో ఉంది.

*తతో విదార్యం ధరణీం న ఖైరుధృత్య బాహుభిః*
*తోలయిత్వా రధేక్షత్వా యయే క్షిప్రం విహాయస॥ (ఆ.రా. 8 సర్గ)*

అనుమతి లేనిదే పరస్త్రీని ముట్టుకుంటే తల పగిలిపోతుందని ఉన్న శాపం వల్ల ఇలా చేసినట్లు కథలు చెబుతారు.

అనేక కల్పాంతర కథలలో ఇలా అనేక సీతాపహరణ కథలు వివిధంగా కనిపిస్తాయి.

ఇవన్నీ భారతీయ సంస్కృతి 'పతివ్రత' కు ఇచ్చిన గొప్ప విలువను వ్యక్తపరుస్తాయి. పతివ్రత అయిన ఇల్లాలు ఎంత శక్తిమంతురాలో చూడమని చెబుతాయి; పతివ్రతా ధర్మాన్ని పాటించమని భారతనారిని ప్రేరేపిస్తాయి. భారతనారి తపస్సు, సాధన, యోగం, జపం, ధ్యానం, వ్రతం, ఉపాసన ఇవేవీ చేయనక్కరలేదు; కేవలం పతివ్రతగా నూటికి నూరుపాళ్లు జీవిస్తే చాలు; ఆమె సర్వశక్తిమంతురాలవుతుంది, సుమతిలా సూర్యుడిని శాసిస్తుంది, అనసూయలా సృష్టిని పోషిస్తుంది, సావిత్రిలా మృత్యువును నియంత్రిస్తుంది. ఆమెకు అసాధ్యం అంటూ ఏదీ లేదని భారతీయ సంస్కృతి వక్కాణిస్తుంది. అందుకే పాపం సీతను అపహరించటానికి రావణుడు ఇన్ని పాట్లు పడవలసి వచ్చింది! మరి 'పతివ్రత' అంటే మజాకా!

అవతారిక:- గతమూడు మంత్రాల్లో రావణుడు సీతనపహరించి ఆకాశమార్గాన వెళ్లటాన్ని వివరించింది వేదమాత. మరి ఆ అబలను రక్షించేవారే లేరా? కనీసం ఎవరైనా అందుకు ప్రయత్నించారా? ఆ తర్వాత ఏం జరిగిందీ? మళ్లీ మూడు మంత్రాల్లో ఈ విషయాన్ని వివరిస్తుంది కరుణామయి వేదమాత.

**మంత్రాలు 57, 58, 59 :**

**విధుం దద్రాణం సమనే బహూనాం యువానం సన్తం పలితోజగార। దేవస్య పశ్య కావ్యం మహిత్వా ద్యా మమార స హ్యః సమాన॥** (ఋగ్: 10-55-5)

**శాక్మనా శాకో అరుణః సుపర్ణ ఆ యో మహః శూరః సనాద నీళః। యచ్చికేత సత్యమిత్తన్న మోఘం వసుస్పార్హ ముత జేతోత దాతా॥** (ఋగ్: 10-55-6)

**ఐభిర్దదే వృష్ణ్యా పౌంస్యాని యేభిరౌక్షద్వృత్ర హత్యాయ వజ్రీ। యే కర్మణః క్రియమాణస్య మహ్న ఋతే కర్మ ముద జాయన్త దేవాః॥** (ఋగ్: 10-55-7)

తాత్పర్యము:- సంగ్రామంలో అనేక వీరులను పరాజితులను చేసిన వాడు, ఏడ్పించిన వాడు, యువకుడు, సీతాపహరణ కర్త అయిన రావణుని వృద్ధజటాయువు ఆపాడు. రావణుడు అతడిని చంపివేశాడు. సర్వరాక్షస సంహారాన్ని కోరుకునే ఇంద్రుడు - ప్రస్తుతం జటాయువు చేతిలో రావణుడు చచ్చిపోతే తక్కిన రాక్షసులు మిగిలిపోతారు. రాముడు వారిని కూడా చంపడానికి ఉద్యుక్తుడు కాడు - అని ఆలోచించి రావణుడి ద్వారా జటాయువు మరణించేలా చేశాడు.

ఉత్సాహి, అరుణపుత్రుడు, మహాశూరుడు, దూరగామి అయిన జటాయువు, 'నేను రావణుడిని చంపి సీతను రాముడికి అప్పగిస్తాను' అనే సంకల్పం - అతను మరణించినప్పటికీ నిష్ఫలం కాలేదు. ఎందుకంటే స్పృహనీయసీతారూప ధనాన్ని రాముడు రావణుడిని చంపి జయించగలడు.

ఏ విధంగా ఈ సంకల్పం నెరవేరిందో ఇక్కడ చెబుతున్నారు. వృత్రవధరూప పాపఫల రూపంగా ఇంద్రాది దేవతలు మనుష్య, పశు రూపాలను ధరించి రాముడికి సహాయపడ్డారు. ఆ దేవతలు వానర యోనులలో పుట్టి, సేతు బంధనం లోను, రావణ వధ కార్యంలోనూ సహాయ పడినవారైనారు.

వ్యాఖ్యానము:- కేవలం ఆకృతిని బట్టి ఇతడు మనిషని గానీ, పశువని



గానీ, పక్షి అనిగానీ విడదీయవద్దు. హృదయగత భావాన్ని, తద్గత ఆచరణను బట్టే ఎవరు జంతువో, పక్షో నిర్ణయించుకునే సందేశాన్ని మన కందిస్తుంది రామాయణం. వివేక శూన్య మనిషే పశువు. రామాయణంలో రాముడిని సేవించి ఉత్తమ సంస్కారాలను చూపిన హనుమదాది కపివీరులను, జటాయువు సంపాతి ఆదిపక్షులను పశుపక్షులు అనలేము. వారి గుణాల కారణంగా వారు విశ్వవంద్యులైనారు. సీతాపహరణం, జటాయువు యుద్ధంలో మనకు గొప్పశూరుడైన, సర్వసంపదలతో తులతూగే తపస్సం పన్నుడైన ఒక రాజు యొక్క పశుత్వం, ఒక పక్షి యొక్క మానవత సాక్షాత్కరిస్తాయి.

పక్షధారిని (రెక్కలున్నదాన్ని) పక్షి అంటారు. మనుషులలో కూడా మధ్యే మార్గంలో అన్ని కోణాల నుండి చూడకుండా మూర్ఖంగా ఏదో ఒక పక్షమే వహించేవాణ్ణి (ధరించేవాణ్ణి) పక్షి అనవచ్చు. నిష్పక్షపాతికి సర్వపక్షాల మీద సహిష్ణుత ఉంటుంది. నిష్పక్షపాతులమంటూ సహిష్ణుత కోల్పోయేవారు కేవలం నటులే.

ఆకాశంలో ఎగిరే గద్ద దృష్టి, క్రింద భూమి మీద శవంపై ఉండటం వల్లే దాన్ని నీచపక్షి అన్నారు. అలాగే మనిషి సామాజిక దృష్టిలో ఎంత ధనం, కీర్తి, పదవి సంపాదించినా, అల్ప విషయాల మీది దృష్టి తీయకపోతే లేదా అల్ప భావనలకు లోనైతే వాడిని కూడా పక్షి అనవచ్చు. స్వార్థ చింతనను, వ్యష్టి ఆకాంక్షను కోరి చేసే కృషిని విడవనంత కాలం ఆ వ్యక్తి, మొదట స్వదృష్టిలోనే పడిపోతాడు.

అన్నదమ్ములైనప్పటికీ, సంపాతి జటాయువులు జీవితంలో ఎన్నుకున్న మార్గాలు వేరు. కిష్కింధకాండలో సంపాతి వానరులకు చెప్పిన కథను బట్టి సంపాతి కన్నా పిరికివాడుగా కనిపించే జటాయువు మహా శక్తిమంతు డైన రావణాసురుడిని వెనకా ముందూ చూడకుండా తన పండు వృద్ధావస్థ

లో ఎదుర్కోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఒక్కసారి ఉప్పెనలాగా వచ్చి మీదపడుతున్న జటాయువును ముందు రావణుడు గుర్తుపట్టలేదు. అతడెవరై ఉంటాడా అని ఊహించ ప్రయత్నించాడు. మైనాకుడా? గరుత్మంతుడా? అని. ఇంతలో ఆ వచ్చినది వృద్ధ జటాయువని గుర్తుపడతాడు. అతడి దుస్సాహసానికి ఆశ్చర్యపోతాడు. తన అహంకార స్వభావాన్ని ప్రకటిస్తూ వృద్ధులకు త్వరగా మరణం రాకపోతే, ఏదైనా కాశీ లాంటి తీర్థక్షేత్రానికి వెళ్లి అక్కడ ప్రాణం విడుద్దామని చూస్తారు. అలాగే మరణం రాని ఈ వృద్ధ జటాయువు నా బాహు తీర్థంలో మునిగి ప్రాణం విడవడానికి వస్తున్నాడనుకున్నాడు. తన పుత్రవధువు అయిన సీతను విడిచిపెట్టి, లంకకు వెళ్లిపొమ్మని జటాయువు హెచ్చరిస్తాడు. తన మాట వినని రావణుడిని ముక్కుతోనూ, గోళ్లతోనూ గాయపరచి రక్త ప్రవాహం కట్టిస్తాడు.

*మహీసోపాన చిత్రాంగం విభంజ చ మహారథమ్ (126)*
*స భగ్నధన్వా విరథో హతాశ్వో హత సారథీః(127)*
*(వాల్మీకి రా. అ.-51 సర్గ)*

వాడి ధనస్సును, రథాన్ని, అశ్వాలను, సారథిని జటాయువు ఛిన్నా భిన్నం చేశాడు. చివరకు 'పపాత భువి రావణ' - రావణుడిని కూడా భూమి మీద పడిపోయేలా చేశాడు జటాయువు.

రావణుడు కోపోద్రిక్తుడై చేతి కరవాలంతో ఆకాశమార్గానికి ఎగిరి జటాయువు ఎడమరెక్కను నరుకుతాడు. అయినా అది మరల మొలుస్తుంది. చివరికి సీతను భూమి మీద విడిచి ఆ వృద్ధ గృధం రెక్కలు - పార్శ్వాలు - కాళ్లు నరికి భూమి మీద పడవేస్తాడు.

'అభ్యధావత వైదేహీ స్వబంధుమివ దుఃఖితా' (వా.రా. 3.51.44) - రక్తపు ముద్దలా నేలరాలిన జటాయువును కౌగలించుకొని సీత



స్వబంధువును కోల్పోయినట్లు దుఃఖిస్తుంది.

'జగామాదాయ చాకాశం రావణో రాక్షసేశ్వరః (వా.రా. 3.52.13)' - చివరికి రావణుడు రామలక్ష్మణులను పిలుస్తూ విలపిస్తున్న సీతను తీసుకొని ఆకాశమార్గాన లంకకు వెళ్లిపోయాడు.

మారీచుడిని సంహరించి వెనక్కువస్తున్న రాముడికి పర్ణకుటీరం వైపు నుండి లక్ష్మణుడు ఎదురు వస్తూ కనిపించాడు. అతడిని చూడగానే రాముడు -

'త్వయి ప్రమత్తో రక్షోభిర్భక్షితావా తపస్వినీ' - (వా.రా. 3.57-11) లక్ష్మణా! సీతను ఒంటరిగా విడిచి వచ్చావా? నీ ఈ అజాగరూకత వల్ల రాక్షసులు తప్పక సీతను తినివేసి ఉంటారు అంటాడు.

అశుభాన్ని శంకిస్తూ పర్ణశాలకు వెళ్లిన అన్నదమ్ములకు సీత జాడ కనిపించదు. ఆవిడను వెతుక్కుంటూ బయలుదేరిన రామలక్ష్మణులకు విరిగిన రథపు ముక్కలు, గుఱ్ఱాల కళేబరాలు, విరిగిన ఆయుధాలు, రక్తంతో తడిసిన ఈకలు కనిపించాయి. సీత చంపివేయబడిందేమోనని శంకిస్తూ ముందుకు వెళ్లిన వారికి, రక్తపుముద్దలాగా జటాయువు దర్శనం ఇచ్చాడు. ఎవడో రాక్షసుడు మారువేషంలో వచ్చి, సీతను భక్షించాడన్న ఆవేశంతో రాముడు జటాయువు మీదికి ఉరకబోతుంటే, జటాయువు తన పరిచయాన్ని ఇచ్చాడు.

*కర సరోజ సిర పరసెఉ కృపాసింధు రఘువీర౹*
*నిరఖి రామభజ దామ ముఖని గత భఈ సబసీత॥*

రాముడు జటాయువు తల నిమరగానే అతని శరీరబాధలన్నీ సమసిపోయాయి. రాముడి ముఖసౌందర్యాన్ని వీక్షిస్తూ, జటాయువు ఆనందంలో మునిగిపోయాడు. రాముడు అమరత్వం ఇస్తానన్నా కాదన్నాడు.

జీవుడి అనేక జన్మల సంస్కారాలకు అనుగుణంగా (Blue Print) ఈ శరీరం నిర్మాణమవుతుంది. అన్ని ఇండ్లు ఒక్కలాగ ఉండనట్లే, అన్ని శరీరాలు ఒక్కలా ఉండవు. కొందరికి సంపూర్ణ ఆరోగ్యం, పూర్ణాయువు, అందం, అన్నీ లభిస్తాయి. అటువంటి శరీరాన్ని సర్వవసతులున్న భవనం అనవచ్చు. కానీ అన్ని వసతులు చేసిన ఇంట్లో మిమ్మల్ని గృహనిర్బంధంలో ఉంచారనుకోండి. ఆ చేష్టను మీరు ఇష్టపడతారా? అందుకే పరమాత్మ ఈ శరీరం అనే ఇంట్లో నుండి బైటకి రావడానికి మృత్యువనే ద్వారాన్ని ఏర్పాటు చేశాడు.

ఒకవేళ మృత్యువనే ద్వారం లేకపోతే, బ్రతుకు మరింత భారమే అవుతుంది. అశ్వత్థామ చరిత్రను చూసినప్పుడు తెలుస్తుంది ఈ విషయం. చిన్నతనంలో త్రాగడానికి పాలు కూడా లేని కటిక దరిద్రాన్ని, యవ్వనంలో కౌరవుల ఎంగిలి మెతుకులను, తన కండ్ల ముందే తండ్రి హత్యను చూచిన అశ్వత్థామ, ద్వేషం (పాండవుల మీద), ఈర్ష్య, క్రోధం, ప్రతీకార వాంఛలతో నిండి, నిదురించే ఒక అక్షౌహిణి సైన్యాన్ని ఒక రాత్రిలో చంపిన నరరూప రాక్షసునిగా మారాడు. ఇంకా ద్వేషం తీరక పాండవ వంశనాశనానికి ఒడిగట్టి, అది సాధ్యంగాక పాండవుల చేత అవమానింపబడి, శిరస్సులోని మాణిక్యాన్ని పోగొట్టుకొని శక్తిహీనుడై, చిరంజీవియై, అభిశప్తుడై, పిశాచంలాగా ఇప్పటికీ భూమి మీద తిరుగాడుతున్నాడంటుంది మహాభారతం'. 'అడిగితే లభించే మృత్యువు అమృతంతో సమానం; అవసరంలేనప్పుడు లభించే అమృతం కూడా విషంతో సమానం' అంటాడు తలసీదాసు దోహావళిలో.

ఈ జ్ఞానం కల్గిన జటాయువు మృత్యువునకు భయపడలేదు. ఒక జీవితంలో వ్యక్తి ఎంత దుర్మార్గుడిగానైనా జీవించవచ్చు; సాధువుగా నైనా జీవించవచ్చు. లేదా మిశ్రిత సంస్కారాలను ప్రకటించవచ్చు. కానీ ఒక జీవితంలో జీవుడు, తన అనంత సంస్కారాల నుండి కొద్దిశాతం మాత్రమే ప్రకటిస్తాడు. మృత్యుక్షణాలలో మాత్రం వ్యక్తి తన మూలవాస్తవిక



సంస్కారాన్ని ప్రకటించక తప్పదు. ఆ సమయంలో అతడి వ్యవహారానికి ఆధారం బాహ్యచేతన కాదు. ఆ సమయంలో ప్రేమగా భగవన్నామం పలుకగలిగితే - తన ఆసక్తి నుండి బయటకు వచ్చినట్లే. ఆసక్తి రాహిత్యమే ముక్తి. అంతిమ ఘడియలలో బాహ్యాసక్తి నుండి మనసును మరలించి, ఈశ్వరుడితో, సంబంధం పెట్టుకోగలిగితే ఆ జీవితం సార్థకమైనట్లే. కృతకృత్యుడైన ఆ గృధరాజుకు ఏ పని పూర్తిచేయడం కొరకు లేదా ఏ సంస్కార పూర్తి కొరకు శరీరాన్ని నిలుపుకోవాలో తెలియలేదు.

'నా కండ్ల ముందు నాకు చతుర్విధ పురుషార్థాలు సిద్ధించినట్లుగా కనిపిస్తుంది. ఒకవేళ నేను పొరబడితే, నన్ను దారిన పెట్టు రామా ...... మొదటిది 'అర్థం' - డబ్బు సంపాదించుకునే వ్యాపారి కొద్ది పెట్టుబడితో ఎక్కువ లాభం కోరతాడు. నేను తమోగుణ పూరితమైన ఈ పక్షి శరీరం అనే పెట్టుబడి పెట్టి, అనంతుడివైన నిన్ను పొందుతున్నాను. రెండవది 'ధర్మం' - పరహితాన్ని మించిన ధర్మం లేదంటుంది శాస్త్రం. నా శరీరం పరహితాన్ని కోరే సమర్పింపబడింది. మూడవది 'కామం' - ఐశ్వర్య, సౌందర్య, ఆరోగ్యాది సంపత్తిని శాశ్వతంగా భోగించడమే కామం. లక్ష్మీనాథుడు, పుంసాం మోహన రూపుడు, నిత్యుడు అయిన నువ్వే నాకు భోగ్యమైనావు. ఇంతకు మించిన కామ తృప్తి ఏముంది? నాలుగవది 'మోక్షం'-అంత్య కాలేచ .......... చివరి క్షణాల్లో నిన్ను దర్శిస్తూ నీ నామం స్మరిస్తూ ఉన్నవాడికి ఇక పునరాగమన మెక్కడిది?

మౌనంగా రాముడు జటాయువుకు తన సమ్మతి తెలియజేశాడు. 'మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛలోకాననుత్తమాన్ - (వా. రా. 6-7-30) నా అనుజ్ఞతో నువ్వు ఉత్తమలోకాలను పొందుదువు గాక' అని మంగళా శాసనం చేశాడు స్వామి. 'కానీ స్వర్గానికి వెళ్లిన తర్వాత సీతాపహరణ వార్తను నా తండ్రి దశరథునికి చెప్పకు. ఆ విషయం త్వరలోనే రావణుడు వెళ్లి ఆయనకు చెప్పగలడు' అన్నాడు.

పద్మపురాణంలో రాముడు జటాయువునకు, శ్రాద్ధతర్పణాది కర్మలను స్వయంగా చేసినట్లు ఉంది. ఆధ్యాత్మిక రామాయణాన్ననుసరించి జటాయువు దివ్యరూపాన్ని ధరించాడు. జన్మనిచ్చిన దశరథమహారాజుకు కూడా ప్రాప్తించని అదృష్టం పక్షిజాతిలో జన్మించిన జటాయువుకు లభించింది. వాల్మీకి రామాయణాన్ననుసరించి, జటాయువు, దశరథుడు మిత్రులు. సంపాతి జటాయువులు సూర్యసారథి అరుణుడి పుత్రులు. సీతాపహరణ సమయానికి జటాయువు వయసు అరవైవేల సంవత్సరాలు. రావణుడిని పరివారంతో సహా అంతమవడాన్ని కోరుకునే దేవతలు, తమ సంకల్పంతో జటాయువు ప్రయత్నం నెరవేరనివ్వలేదని, కానీ అది సాధువు చేసిన సంకల్పం గనక, అతడి ద్వారా కాకున్నా, వానరరూపాలు ఎత్తిన దేవతలద్వారా నైనా లంకావిజయ రూపంలో అది సిద్ధించిందని చెబుతోంది పై వేదమంత్రం.

త్రిశిర - వృత్రాసురాదులను వధించిన పాప కారణంగా దేవతలు వానరులై, ఎలుగుబంట్లయి పుట్టారని, ఇంద్రుడు వాలిగా - వాయువు హనుమంతుడిగా-సూర్యుడు సుగ్రీవుడిగా-బ్రహ్మ జాంబవంతుడిగా - ఇతరులు వానర భల్లూకాలుగా పుట్టారని చెబుతోంది పై వేదమంత్రం.

దేవతలైతే నేం, పాపం పాపమే. పాపానికి ఫలం పతనమే. బ్రహ్మ కూడా భల్లూకమయ్యాడంటే, ఎవరికైనా కర్మఫలం అనుభవించక తప్పదని తేలుతోంది. కనుక కర్మ విషయంలో కుశలబుద్ధితో వ్యవహరించాలి.

ఇటు రాముడు జటాయువుకు దహన సంస్కారాలు చేస్తుండగా, రావణుడి చేత లంకకు చేర్చబడిన సీత స్థితి ఎలా ఉంది?

*జెహి బధి కపట కురంగ సంగ ధాఇ చలే శ్రీరామ।*
*సోచబి సీతా రాఖి ఉర రటతి రహతి హరినామ॥*

మాయామృగం వెంట పరుగెడుతున్న శ్రీరాముడి సుందర రూపాన్ని హృదయంలో ధరించి, హరినామ స్మరణలో సీత కాలం వెళ్లబుచ్చుతున్నది.



రాముడి అనేక సుందరరూపాలుండగా, మాయామృగం వెంట పరుగెత్తే రాముడి రూపాన్నే సీతామాత ఎందుకు ఎన్నుకున్నట్లు?

పరమాత్మ పూర్ణకాముడు. కానీ సీత యొక్క కోరికను పూర్తి చేయడం కొరకు ఆవిడ మీద ఉన్న ప్రీతితో కామనారహితుడై ఉండి కూడా మాయామృగం వెంట పరిగెత్తాడు. ఇది అర్థం కావాలంటే వ్యాస మహర్షి మాటలను స్మరించాలి.

*త్య క్త్వాసు దుస్త్యజ సురేప్సిత రాజ్యలక్ష్మీం*
*ధర్మిష్ఠ ఆర్య వచసా యద గాదరణ్యమ్।*
*మాయామృగం దయిత మోప్సిత మన్వధావద్*
*వన్దే మహాపురుష తే చరణారవిన్దమ్॥*

దేవతలకు కూడా దుస్త్యజమైన అయోధ్యారాజ్యలక్ష్మిని పరిత్యజించడం లో ఒక్కక్షణం కూడా ఆలశ్యం చేయని ఓ రామా! మరొకవైపు ప్రియతమురాలి కోరికను పూర్తిచేయడం కొరకు మాయామృగం వెంట పరిగెట్టావు. ఓ మహాపురుషా! నీ చరణాలకు వందనము.

నా చిన్న కోరికను తీర్చడానికి, అంతగా శ్రమించిన నా పరమాత్మ, ఈ నా దుస్సహమైన కష్టాన్ని తీర్చడా? అనే సంకల్పంతో, మాయామృగం వెంట పరిగెత్తినంత వేగంగా లంకానగరానికి పరుగెత్తుకొని వచ్చి తనను రక్షిస్తాడనే భావంతో ఆ రూపాన్ని సీతమ్మ హృదయంలో నిలిపింది.

అంతేకాదు, భక్తితో భక్తుడు భగవంతుడి వెంట పడతాడు. కానీ మారీచుడి అదృష్టమే అదృష్టము. భగవంతుడే ఆ భక్తుని వెంట పరుగులు పెట్టాడు. 'తన వెంటన్ సిరి ........ ' లక్ష్మికి కూడా లభించని అదృష్టం ఇది.

అవతారిక:- జటాయువును సంహరించి సీతను రావణుడు హరించుకొని వెళ్లిన తరువాత రాముడేమైనాడు? ఆయన ఏం చేశాడు? ఈ ప్రశ్నలకు రెండు మంత్రాలలో జవాబు చెబుతోంది వేదమాత.

**మంత్రాలు 60, 61 :**

**సఈం వృషా న ఫేనమస్య దాజౌ స్మదా పరైదప దభ్ర చేతాః సరత్పదా న దక్షిణా పరావృఙ్న తాను మే పృశన్యో గృభ్రే॥**
(ఋగ్: 10-61-8)

**నీచీన బారం వరుణః కవన్ధం ప్ర ససర్జ రోదసీ అన్తరిక్షమ్। తేన విశ్వస్య భువనస్య రాజా యువం న వృష్టిర్వ్యునత్తి భూమ॥**
(ఋగ్: 5-85-3)

తాత్పర్యము:- కోపావిష్టుడైన మహోక్షుడు ముక్కునోటి నుండి ప్రశ్వసించినట్లు రాముడు రాక్షసులతో యుద్ధం చేశాడు. దక్షిణ దిశగా సీతాప్రాప్తి కొరకు వెదుకుతూ పదచిహ్నాలకై పరీక్షిస్తూ వెళ్ళి, సీతాప్రాప్తికి సంబంధించిన శకునాన్ని కూడా చూడలేక శ్రీరాముడు దుఃఖితుడైనాడు.

సుగ్రీవ మిత్రత కన్నా ముందు కబంధ వధను వర్ణిస్తున్నారు. ఈ సంసారానికి స్వామి అయినవాడు ద్యులోకాన్ని-పృథ్వీలోకాన్ని రచించిన వాడు అయిన రాముడు వక్షస్థలంలో ముఖం ఉన్న కబంధుడనే రాక్షసుడిని చంపి వాడి రక్తంతో భూమిని తడిపాడు.

వ్యాఖ్యానము:- జటాయువు అంత్యక్రియలు పూర్తిచేసిన రాముడు లక్ష్మణ సమేతంగా దక్షిణ దిశగా ప్రయాణం సాగించాడు. కానీ ఆయనకు ఎక్కడా సీత జాడ గానీ సూచన గానీ తెలియరాలేదు. దుఃఖంచేత వివశుడైన రాముడు నరలీల కొనసాగిస్తూ ప్రతి చెట్టునూ, పుట్టనూ పక్షినీ, జంతువునూ సీత జాడ అడగటం మొదలు పెట్టాడు. ఋష్యాశ్రమాలకు వెళ్ళి వారిని కూడా అడిగాడు.

ఒక రామాయణంలో రాముడి ఈ దుఃఖలీలకు ఒక వింత విశ్లేషణ కనిపిస్తుంది. సీతాలక్ష్మణ సహితంగా శ్రీరాముడు పంచవటిలో నివసించడం మొదలు పెట్టాడు. అప్పుడు ఆ ప్రాంతాలలో తపస్సు చేసుకుంటున్న



ఋషులకు మనసులు చలించటం మొదలు పెట్టాయి. సౌందర్యరాశి అయిన సీతా దర్శనం వల్ల ఆ విరాగులకు మేము కూడా పెండ్లి చేసుకుంటే బాగుండును - అనే సంకల్పం మొదలైంది. కానీ వారికి పిల్లనెవరిస్తారు? అంతా కూర్చొని యోచించగా వారికి ఒక ఉపాయం తట్టింది. శ్రీరామ చరణ స్పర్శతో రాయి నారిగా మారిందని (అహల్య) వారికి తెలుసు. తాము కూడా అలాగే 'నారి' ని సంపాదిద్దామనుకొన్నారు వారు. రాముడు గోదావరిలో స్నానం చేయడానికి వెళ్లే దారిలో ఋషులు తలా ఒక రాయిని వేశారు. ఎంతో శుభ్రంగా ఉండే దారి ఇలా ఒకేసారి రాళ్లమయం కావటం చూసి శ్రీరాముడు తన దివ్యదృష్టితో జరిగిన విషయాన్ని గ్రహించి వారికి బుద్ధి చెప్పదలిచాడు. అందుకే ఈనాడు సీతను కోల్పోయిన రాముడు దుఃఖవివశుడైనట్లుగా నటిస్తూ, ప్రతి ఋషి ఆశ్రమానికి వెళ్లాడు. 'అయ్యో! రాముడంతటి శూరుడి నుండే రావణుడు స్త్రీని లాక్కున్నాడే, మనలాంటి వారి విషయంలో మాత్రం అలా జరగదా! అప్పుడు మనం కూడా దుఃఖ వివశులం కావలసిందే కదా! దీని కన్నా మన ఏకాంత తపోవనాల జీవితాలే నయం' అనుకున్నారట. రాముడి లీలలకు అర్థాలెన్నో ఎవరు చెప్పగలరు?

సీతాన్వేషణలో ముందుకు సాగిన రామలక్ష్మణులను రెండు బలమైన హస్తాలు బంధించాయి. క్రమంగా అవి కదులుతున్నాయి. కానీ ఆ బంధించిన వాడెవడో కనిపించలేదు. ఇంతలో ఒక వికృతరూపం కనిపించింది. ఆ మొండానికి కాళ్లు తల లేవు. గుండెల మీద ఒక కన్ను ఉన్నది. పొట్టలోనే ఒక నోరున్నది. చేతులు చాలా పొడుగ్గా ఉన్నాయి. వాడే కబంధుడు. రామలక్ష్మణులిద్దరూ కూడబలుక్కుని ఒకేసారి కబంధుడి రెండు చేతులు నరికారు. అప్పుడు వాడు తనకు సంప్రాప్తమైన రెండు శాపాలను గూర్చి వివరించాడు.

కబంధుడు భయంకర రూపాన్ని ధరించి ఋషులను భయపెట్టే వాడు. స్థూలశిరాఋషి అతడిని శాశ్వతంగా అదే రూపంలో ఉండమని

శపించాడు. కబంధుడు ఆయన కాళ్ల మీద పడి వేడుకోగా, 'రామలక్ష్మణులు నీ చేతులు నరికి నీ శరీరాన్ని దహనం చేసినప్పుడు నువ్వు శుభరూపాన్ని పొందుతావు' అని ఆయన అనుగ్రహించాడు.

రెండవ కథ ననుసరించి వాడు 'ధను' అనేవాడి కుమారుడు. ఉగ్రమైన తపస్సు చేసి బ్రహ్మ ద్వారా దీర్ఘాయువునుపొందాడు. వాడు గర్వించి ఇంద్రుడితో తలపడినప్పుడు, వాడి తలను మొండెం లోపలికి దిగేలాగ ఇంద్రుడు తన వజ్రాయుధంతో, కొట్టాడు. బ్రహ్మ ఇచ్చిన వరం వమ్ముకాకుండా ఉండటం కొరకు, ఆహార సంచయార్థం, వాడికి దీర్ఘ బాహువులు (ఒక యోజనం = 8 మైళ్ల పొడవు) ఇచ్చాడు. ఈ రోజు రామలక్ష్మణుల ద్వారా చేతులు నరకబడి చివరికి దహనసంస్కారం కూడా వారిచేత అందుకొని, దివ్య శరీరాన్ని ధరించి, సీతాన్వేషణలో సహాయపడే సుగ్రీవుడితో మిత్రత్వం నెరపమని చెప్పి దివ్యలోకాలకు వెళ్లిపోయాడు. రామోపాఖ్యానాన్ని అనుసరించి అతడు విశ్వావసు అనే గంధర్వుడు. బ్రహ్మశాపం వల్ల ఇలా అయ్యాడు. ఆధ్యాత్మ, ఆనంద రామాయణాల ననుసరించి కూడా వాడు అందమైన ఒక గంధర్వుడు. అష్టావక్రుడిని అపహాస్యం చేయడం వల్ల వాడు రాక్షసుడయ్యాడు. అక్కడ శాపవిముక్తి పొందిన తరువాత రాముడిని శబరి వద్దకు వెళ్లమని చెబుతాడు. మానస రామాయణాన్ని అనుసరించి కూడా దూర్వాసుడి శాపం వల్ల ఇలా మారాడు. ఇవన్నీ కల్పభేదం వల్ల వచ్చిన కథలుగా భావించవచ్చు.

వాల్మీకాన్ని అనుసరించి, కబంధుడు మరోమాట కూడా చెబుతాడు.

*తేషాం గతానామద్యాపి దృశ్యతే పరిచారిణీ।*
*శ్రమణీ శబరినామ కాకుత్స చిరజీవిని॥*
*త్వాం ధర్మేస్థితానిత్యం సర్వలోక నమస్కృతమ్।*
*దృష్ట్వా దేహోపమమ్ రామ స్వర్గలోకం గమిష్యతి॥*

*(వా.రా. 3-73-26, 27)*



మీరు మాతంగ మహర్షి ఆశ్రమానికి వెళ్లండి. ఆ మహర్షి, ఆయన శిష్యులు అంతా పైలోకాలకి వెళ్లిపోయారు. కానీ శ్రమణి శబరి మాత్రం అక్కడే ఉంది. ఆవిడ చిరంజీవి. ధర్మనిష్ఠ గలది. సర్వలోకాలచేత నమస్కారాలను అందుకోగల యోగ్యురాలు. ఆవిడ మిమ్ము దర్శించుకున్న తర్వాత స్వర్గానికి వెళ్లగలదు.

**శబరి :** రామాయణంలో ఈ శబరి వృత్తాంతం ఎంత ప్రసిద్ధి గాంచిందంటే, ఏ రామాయణంలోనూ ఆవిడ తినిపించిన పండ్లు ఏవో స్పష్టంగా లేక పోయినా, అవి రేగుపండ్లుగాను-అవి కూడా శబరి చేత ఎంగిలి చేయబడ్డవి గానూ లోకవిఖ్యాతి గాంచాయి.

ఆ పండ్ల రుచి ఏమిటో గాని, లంకా విజయం తర్వాత అయోధ్యను చేరిన రాముడు షడ్రసోపేతమైన భోజనము మధ్యన కూడా శబరి పెట్టిన పండ్ల రుచినే స్మరిస్తాడు.

లక్ష్మణ సమేతంగా ముందుకు సాగిన రాముడు మాతంగ మహర్షి ఆశ్రమంలో శబరిని చూశాడు. మార్గమధ్యంలో లక్ష్మణుడు ఆవిడ కథను అడగగా, రాముడు వివరిస్తూ ఇలా చెప్పాడు. భిల్లజాతికి చెందిన ఈ స్త్రీ జన్మతః మాంసాహారాన్ని అసహ్యించుకొనేది. యవ్వనావస్థను చేరిన ఈవిడకు వివాహం నిశ్చితమయింది. తన వివాహనిమిత్తమై అనేక వన్య మృగాలను ఆహారం కింద మార్చడం ఆవిడ చూడలేక ఆ రాత్రి అడవిలోకి పారిపోయింది. పంపాసరోవరతీరంలో ఉన్న మాతంగ మహర్షి ఆశ్రమ పరిసరాలలో ఒక చెట్టు ఎక్కి కూర్చున్నది. భిల్లులు అడవంతా గాలించి వెళ్లిపోయారు. పగలంతా శబరి చెట్టు మీద ఉండేది. చీకటి పడగానే కిందికి దిగివచ్చి, ఆశ్రమం అంతా ఊడ్చి, మళ్లీ తెల్లవారేసరికి చెట్టు మీదికి వెళ్లి పోయేది. ఒకసారి మాతంగ మహర్షి ఆజ్ఞతో ఆయన శిష్యులు శబరిని పట్టుకున్నారు. ఆయన అనుజ్ఞ ఇవ్వగా శబరి, ఆశ్రమంలో ఉండటం మొదలు పెట్టింది. 'మేము పవిత్రులం' అనే అహంకారం గల మహర్షి

శిష్యులు కొందరు శబరిని పంపాసరోవరంలో స్నానం చేయవద్దని నిర్బంధించారు. వెంటనే పంపాజలం రక్తవర్ణంలోకి మారిపోయింది. అది చూసి మాతంగ మహర్షి అహంకారులైన శిష్యులను మందలించి, భావితరాలలో శబరి గొప్ప భక్తురాలుగా కీర్తికెక్కబోతున్నదని చెప్పారు. ఆయన అంత్యకాలంలో ఆశ్రమమంతా ఆవిడకు అప్పజెప్పి, రాముడి కొరకు ఎదురు చూస్తుండమని చెప్పి వెళ్లాడు.

అద్యమే సఫలం తప్తం సర్వశ్చైవ భవిష్యతి।
త్వయి దేవవరే రామ పూజితే పురుషర్షభా॥ *(వా.రా. 3.74-12)*

లక్ష్మణ సహితంగా రాముడు ఇక్కడికి వస్తాడు. నువ్వు అతడికి అతిథిసత్కారాలు చేసి, దివ్యలోకాలను పొందగలవు.

'దేవశ్రేష్ఠా! నీ పూజతో ఆరోజే నీ జపం-తపం అన్నీ సఫలం అవుతాయని మా గురువుగారు చెప్పారు. ఇక నాకు స్వర్గం కూడా నిశ్చితమయింది' అన్నది శబరి రాముడితో.స్వామి శబరికి నవవిధ భక్తిని వివరించి, ఆవిడ ఆ తొమ్మిది మెట్లను కూడా దాటి భక్తిమార్గంలో ఉత్కృష్టస్థాయికి చేరిందని చెప్పాడు. శబరి మాత్రం నేను ఏ చదువులూ ఎరగను, ఏ సాధనలు చేయలేదు, జన్మతః నీచజాతిదాన్ని అంటూ తన స్థితిని తెలియజేసింది.

ఏ ఋషిముని ఆశ్రమంలోనూ పొందని ఆనందాన్ని తృప్తిని శ్రీరాముడు శబరి వద్ద పొందాడు. అందుకు కారణాన్ని వివరిస్తూ శ్రీతులసీ-సత్సంగమనేది ఆమ్రవృక్షం, శ్రద్ధ వసంత ఋతువు, శమం-దమం-దయ అనే లతలు ఆ వృక్షానికి చుట్టుకొని ఉంటాయి. జ్ఞానం ఆ చెట్టుకు పండే పండు. భగవత్ చరణాలలో రతే ప్రీతి, అదే ఈ పండ్లలో రసం - అంటాడు. ఎందరో మహర్షుల తపస్సు సిద్ధించి జ్ఞానమనే పండు పండినప్పటికీ, ఆ పండ్లలో భగవత్ చరణం అనే రసం లేని కారణంగా, వాటిలో రుచి లేదు. శబరి పండ్లలో రుచి ఉండటానికి కారణం ఇదే.



ఎంత పూర్ణుడైన జ్ఞానిలో కూడా సూక్ష్మంగా నేను సాధించాననే అహంకారం లేశమంతయినా మిగిలిపోతుంది. భక్తి మార్గంలో ప్రయాణించి, అదే పరిపక్వస్థితిలో ఉన్న శబరిలో మాత్రం వినయం-ప్రేమ, రసోత్పత్తి తప్ప మరొకటి లేదు. ఆధ్యాత్మిక అర్థాలలో చెప్పాలంటే సీత అనే భక్తిని రావణుడనే మోహం ఎత్తుకు వెళుతుంటే, వివేకమనే పక్షి ఎదుర్కొంటుంది. శాయశక్తులా ప్రయత్నిస్తుంది. కానీ మోహం బారి నుండి భక్తిని రక్షించలేక అది మరణిస్తుంది. సాధనలో మనం అందరం చేసేదిదే. మనలో వాసనరూపంలో మోహం విజృంభించినపుడు ఎంతటి బలమైన లోతైన వివేకం కూడా పనిచేయదు. వాసనా ప్రవాహంలో మనసు కొట్టుకపోతుంది. భక్తి దొంగిలించబడుతుంది. ఇక ఆ పనిని శబరి అనే భగవత్ చరణమే చేయగలదు. అందుకే భగవంతుడు సీత జాడ చెప్పమని శబరి నడిగాడు. ఆవిడ సంకోచిస్తూ 'సర్వజ్ఞులు, సర్వవ్యాపులు అయిన మీరు తెలియనట్లు నన్ను అడుగుతారేమిటి'? అంటూ 'మీరు పంపాసరోవరం వెళ్లండి. అక్కడ మీకు సుగ్రీవుడు మిత్రుడౌతాడు. ఇక ముందు ఏం చేయాలో అక్కడ తెలుస్తుంది' అన్నది.

శబరి శ్రీరాముడి వద్ద సెలవు తీసుకొని, ఉత్తమ లోకాలకు వెళ్లి పోయింది. ఇప్పటివరకూ దుఃఖిస్తూ ప్రతిచోటా సీతజాడ నడిగే రాముడు ప్రశాంతంగా ఋష్యమూక పర్వతం వైపుకు కదలివెళ్లాడు. శబరి ధర్మసంస్థిత అయిన శ్రమణి. రాముడు కూడా ఆవిడను 'తపోధన' అని, 'సిద్ధాసిద్ధ సమ్మితా' అని కూడా సంబోధించాడు. ఆవిడ భిల్లజాతికి చెందిన వనకన్య కాదు గానీ, 'మయాతు సంచితమ్ వన్యమ్' - నా చేత అనేక వనద్రవ్యాలు (పూలు, ఫలాలు - పండ్లు, కందమూలాలు మొదలైనవి) మీ కొరకు సంచితం చేయబడినాయి అని మాత్రం చెప్పింది.

రాముడు ఋష్యమూకం వైపుకు ప్రయాణం సాగించాడు.

# కిష్కింధాకాండము

అవతారిక:- శబరిని ఉత్తమలోకాలకు పంపిన పరమాత్మ ఆవిడ సలహాపై సుగ్రీవుడితో స్నేహం చేశాడా? వారి స్నేహానికి మధ్య వారధిగా నిలిచింది ఏమిటి? ప్రేమా? లోభమా? లేక భయమా? కిష్కింధాకాండ రూపంలో వేదమాత కథను ముందుకు నడుపుతుంది.

**62వ మంత్రం :**

**భీతాయ నాధమానాయ ఋషయే సప్తవధ్రయే। మాయాభి**
**రశ్వినా యువం వృక్షం సంచ విచాచథః॥** (ఋగ్: 5-78-6)

తాత్పర్యము :- సంబంధి జనుల చేత బాధింపబడి సప్తవఘ్రి ఋషి ఆశ్రమంలో నివసిస్తున్న సుగ్రీవుడు రామలక్ష్మణులతో ఇలా అన్నాడు. 'అశ్వనీకుమారులలాగ సుందరులు, మాయచేత మానవరూపాలు ధరించిన వారు అయిన మీరిరువురు యువకులు పశుదేహాన్ని పొందిన నాకు దర్శనమిచ్చి నన్ను అనుగ్రహించారు.

వ్యాఖ్యానము:- భక్తిలో తెలుసుకోవడం మొదటి మెట్టుగా చెప్పబడింది. ఒక వ్యక్తిని గురించి గానీ లేక వస్తువును గురించి గానీ తెలుసుకోలేకపోతే దానిలో విశ్వాసం పెంచుకోవడం ఎలా? విశ్వాసం దృఢం కాని దానితో ప్రీతిని పెంచుకోవడం ఎలా? ప్రీతిలేకుండా భక్తిలో దృఢత్వం అనేది నీళ్లలో మీగడను ఆశించడం లాంటిదవుతుంది.



వజ్రం అంటే ఏమిటో తెలియనివాడు దానిని గాజు ముక్కగా ఎంచి విడిచిపెట్టడం సహజమే కదా! అలాగే ఋష్యమూక పర్వతం వైపుకు వస్తున్న రామలక్ష్మణులను చూచి సుగ్రీవుడు అజ్ఞానం చేత భయభీతుడైనాడు.

ఒకప్పుడు మతంగ మహర్షి ఈ పర్వతం మీద ఒక ఆశ్రమం కట్టుకొని మౌనంగా తపస్సు చేశాడు. ఋషి మౌనంగా ఉండి తపస్సు చేశాడు కనుక ఆ పర్వతానికి ఋష్యమూక పర్వతమని పేరు వచ్చింది. సప్తధాతువులు(చర్మము, మాంసము, ఎముకలు మొదలైనవి) తాదాత్మ్యం నుండి ఎదిగినవాడు గనుక ఆయనకు సప్తవఘ్రిమహర్షి అనే పేరు వచ్చింది. వాలి దుందుభి అనే రాక్షసుడిని చంపి వాడి శరీరాన్ని విసిరివేస్తే అది వచ్చి ఈ ఆశ్రమంలో పడింది. ఆశ్రమాన్ని ఈ విధంగా రక్తమాంసాలతో అశుద్ధం చేయడంతో కోపగించిన మతంగ మహర్షి ఈ పర్వతం మీదికి వాలి గనుక వస్తే తలపగిలి చనిపోతాడని శపించాడు. వాలితో జరిగిన సంఘర్షణలో సుగ్రీవుడు తన్నులు తిని, వాలి రావడానికి భయపడే ఈ పర్వతాన్ని చేరి, శిథిలమైపోయిన ఈ మతంగ మహర్షి ఆశ్రమంలో నివసించడం మొదలు పెట్టాడు.

స్వయంగా వాలి రాకపోయినా తనను సహరించడానికి ఎవరినన్నా పంపిస్తాడేమోనని సుగ్రీవుడు భయపడుతున్నాడు కనుక ఆ పర్వతం వైపు వస్తున్న బలశాలులైన రామలక్ష్మణులను చూడగానే వారిని శత్రువులుగా ఎంచి భయకంపితుడైనాడు.

*ధరి ఒటు రూప దేఖుతై జా ఈ।*
*కహెసు జాని జియ సయన బుఝూఈ॥*

తన మంత్రి హనుమంతుడిని పిలిచి 'బ్రాహ్మణ వటువు (బ్రహ్మచారి) రూపం ధరించి ఆ వస్తున్నవారెవరో ఎందుకు వస్తున్నారో తెలుసుకో. ఒకవేళ వారేమైనా హాని చేయడానికి వస్తున్నట్లు తెలిస్తే నాకు సైగ చేయి వెంటనే పారిపోతాను' అన్నాడు.

ఆ వస్తున్నవారు ఒక ప్రక్క వల్కలాలు ధరించి ఋషులలాగా ఉన్నారు. మరో పక్క ఆయుధాలు ధరించి క్షత్రియులలాగా ఉన్నారు. కనుక బ్రహ్మచారి రూపంలో వెళ్లిన వాణ్ణి క్షత్రియులైతే బ్రాహ్మణుడిగా భావించి చంపరు. ఒకవేళ వారే ఋషులైతే వటువును వాత్సల్యంతో చేరదీస్తారు కూడా. అవన్నీ ఆశ్రమాలతో నిండి ఉన్న అరణ్యప్రాంతాలే కనుక ఏదో ఒక ఆశ్రమం నుండి వచ్చిన చదువుకునే విద్యార్థిగా భావిస్తారే గాని రహస్యదూత అని అనుమానించరు.

వటువు రూపంలో రామలక్ష్మణుల వద్దకు వచ్చిన ఆంజనేయస్వామి ఒక విచిత్రాన్ని చూచాడు. 'కుందేందీవర సుందర వతిబలౌ విజ్ఞాన ధామావుభౌ' ఆ యిరువురు యువకులలో ఒకరు శ్యామవర్ణంలోనూ మరొకరు గౌరవర్ణంలోనూ ఉన్నారు. అందంగా ఉన్నారు. వారి ముఖకాంతి విజ్ఞానంతో భాసిల్లుతోంది. నిజానికి ఇవన్నీ విరుద్ధ ధర్మాలు. ఒకటి ఉన్నచోట మరొకటి ఉండదు. సామాన్యంగా లోకంలో సౌందర్యం ఉన్నచోట కోమలత ఉంటుంది గానీ బలం ఉండదు. బాగా కసరత్తు చేసి బలాన్ని పెంచుకున్న వాడికి కాస్త బుద్ధి తక్కువగా ఉంటుంది. కానీ ఇక్కడ విరుద్ధ ధర్మాలకు ఆటపట్టయిన రామలక్ష్మణులు హనుమంతుడికి దర్శన మిచ్చారు. క్షత్రియ రూపంతో తిరుగుతున్న మీరెవరు? ఏ కారణం చేత మీరీ కఠిన అరణ్యభూములలో కందిపోయే కోమల చరణాలతో తిరుగాడు తున్నారు? మిమ్మల్ని చూస్తుంటే ఎక్కడో రాజభవనంలో హంసతూలికా తల్పాలపై విశ్రమించవలసినవారు అని నాకనిపిస్తున్నారు. అటువంటి మీరు ఎండవానలను, ఈదురు వడగాలులను సహిస్తూ ఎందుకు ఈ భీకరా రణ్యాలలో తిరుగాడుతున్నారు? మీరు త్రిమూర్తులా? ఓహో మీరు ఇద్దరే ఉన్నారు కదా! కనుక నరనారాయణులా? లేక ఈ భూ భారాన్ని తగ్గించడానికి ఏకకాలంలో రెండు రూపాలను ధరించి దిగివచ్చిన పరమాత్మే కాదు కదా! అంటూ హనుమంతుడు ప్రశ్నల వర్షం కురిపిస్తూనే వెళ్లాడు.



వాల్మీకి రామాయణం దక్షిణాదిపాఠాన్ని అనుసరించి హనుమంతుడి సంభాషణను విన్న రాముడు లక్ష్మణుడి వైపుకు తిరిగి 'ఇతడెవరో గొప్ప వ్యాకరణ పండితుడై ఉంటాడు, గొప్ప విద్వాంసుడై ఉంటాడు; ఇంతవరకు ఆయన మాట్లాడిన మాటలలో ఒక్క వ్యాకరణ దోషం కాని, ఉచ్ఛారణ లోపం గానీ లేవు' అంటాడు. ఈ విషయం అన్ని ప్రాంతాల పాఠాలలో లేదు.

హనుమంతుడి ప్రశ్నలకు సమాధానమిస్తూ రాముడు 'మేము దశరథ మహారాజు కుమారులం, రామలక్ష్మణులం, మా తండ్రి ఆజ్ఞమీద అడవికి వచ్చాం. నా వెంట నా భార్య సీత కూడా ఉండేది. ఎవడో దుష్టరాక్షసుడు ఆవిడను ఎత్తుకెళ్లాడు. ఆమెను వెతుకుతూ ఇలా తిరుగుతున్నాము. ఇది మా కథ. ఇక నీవెవరో చెప్పు' అన్నాడు.

స్వామి మాటలలో నేను సర్వజ్ఞుడైన పరమాత్మనయితే నా భార్యను ఎవడు ఎత్తుకు వెళ్లాడో, ఎక్కడ ఉందో తెలుసుకోలేకపోయానా అనే భావన, నేను ఆజ్ఞాపించే ప్రభువునైతే తండ్రి ఆజ్ఞ మేరకు అడవికి ఎందుకు వచ్చేవాణ్ణి? అనే ప్రశ్న, భూభారాన్ని తగ్గించడానికి వచ్చిన పరమాత్మనే గనుక అయితే నాకు భార్యా విరహదుఃఖభారం ఎందుకు ఉంటుందనే చమత్కారం కనిపిస్తాయి.

ఇది భక్తుడికి భగవానుడికి మధ్యన నడిచిన దోబూచులాట. ఇద్దరు సమర్థులైన నటకులు వేషాలు మార్చుకొని వచ్చారు. ఒకరి ముందు ఒకరు నటిస్తున్నారు. పరమాత్మ మానవుడైతే జీవుడు వటువైనాడు. రామాయణం లోని మరో పాత్ర రావణుడు. రాముడు పరమాత్మ అవునో కాదో పరీక్షించడం కొరకు మాయ జింకను సృష్టించాడు. చివరికి వాడు రాముడు పరమాత్మ కాకపోగా, సృష్టిలో బంగారు జింక అనేది ఉండదు అనే సామాన్యజ్ఞానం కూడా లేని మూర్ఖుడు అనే నిష్కర్షకు వచ్చాడు. పరమాత్మ అనుగ్రహం లేనిదే ఆయనను గుర్తించడం ఎవరితరం.

శివపురాణంలోనూ, మానసరామాయణంలో కూడా రాముడు భగవంతుడు అవునో కాదో పరీక్షించడం కొరకు వెళ్లిన సతీదేవి కథ కనిపిస్తుంది.

'భవానీ శంకరౌ వందే శ్రద్ధా విశ్వాసరూపిణౌ' - శంకరుణ్ణి మానస కారుడు విశ్వాసమనీ, పార్వతిని శ్రద్ధ అనీ అంటాడు.

మొదట పార్వతి సతీరూపంలో దక్షుడి పుత్రికగా పుట్టింది. దక్షత యొక్క కూతురు కనుక ఆవిడ విశ్వాసాన్ని అంటిపెట్టుకొని ఉండలేదు. అగస్త్యమహర్షి ద్వారా రామాయణం విని వస్తున్న సతీశివులకు సీతాన్వేషణలో దుఃఖితుడై ఉన్న రాముడు కనిపిస్తాడు. సర్వజ్ఞుడైన ఈశ్వరుడే రాముడై అవతరిస్తే మరి ఆయనకు సీత ఎక్కడ ఉన్నదో తెలియదా! అనే సంశయం కలుగుతుంది. భగవద్భక్తి ఉన్నవాడికి అది రామలీలలాగా కనిపించేది. కానీ అది లేని సతికి రాముడు మామూలు రాకుమారుడేమో అనే సందేహం కలిగింది. విశ్వాసరూపుడైన శివుడు స్వయంగా ఆయన పరమాత్మే అని ఉపదేశించినా సంశయం వీడలేదు. ఆవిడ వెళ్లి రాముడిని పరీక్షిస్తానన్నది.

హో ఇహి సోయి జో రామరచిరాఖా,
అసకహిలగై జపన హరినామా॥

రాముడి సంకల్పంలో ఏముందో (ఆ పరమాత్మ భవిష్యత్తు ఎలా మలచబోతున్నాడో) అలాగే అవుతుంది, అంటూ భగవన్నామం స్మరిస్తూ శివుడు ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు.

రాముడు సర్వజ్ఞుడవునో కాదో తెలుసుకుందామని వెళ్లిన సతి ఆయనను పరీక్షించి వెనక్కు వస్తుంది. కానీ తాను ఆయనను పరీక్షించ లేదని శివుడితో అబద్ధం చెబుతుంది. శివుడు దివ్యదృష్టితో జరిగిన విషయాన్ని చూస్తాడు. ఆయన జరిగిన విషయానికి కోపగించుకోవచ్చు. కాని ఇది కూడా రాముడి లీలలలో ఒక భాగం అయి ఉంటుందంటూ



స్వీకరించాడు. కాని తనకు పూజ్యురాలై తల్లి స్థానంలో నిలిచే సీత రూపాన్ని ధరించి సతి రాముడిని పరీక్షించింది కనుక ఆవిడను భార్యగా ఎలా స్వీకరించాలి? ఈ సమస్యను కూడా రామునికే విడిచి ఆయనను ధ్యానిస్తూ కూర్చుంటాడు శివుడు. 'ఇక ఈ జన్మలో ఆవిడ నీకు భార్య కాలేదు' అనే అంతర్వాణి వినిపించింది. ఆయన దానిని రాముని ఆజ్ఞగా భావించి పాటిస్తాడు. తరువాత సతీదేవి శివుడి మాటను కాదని దక్షయజ్ఞానికి వెళ్లి ఈ దక్షత కారణంగానే, అహంకారం జనిస్తుందనీ దీని వల్లే జీవుడు విశ్వాసం నుంచి దూరమవుతాడని గ్రహించి దక్షత నుండి ఏర్పడ్డ శరీరాన్ని విడిచిపెడుతుంది. రెండవ జన్మలో శ్రద్ధారూపిణిగా పార్వతి రూపంలో చల్లని హిమవంతుని ఇంట పుడుతుంది. ఆ రుద్రుడే (శివుడే) రామ సేవార్థమై హనుమంతుడిగా పుట్టడానికి నిశ్చయించినపుడు ఆయనను విడవలేక ఆయన బ్రహ్మచారిగా అవతరించబోతున్నాడు గనుక ఆయన భార్య కాలేక ఆయన శరీరంలో ఒక భాగమైన తోకగా పార్వతి పుట్టిందని భావార్థరామాయణం చెబుతోంది. ఇలా శ్రద్ధావిశ్వాసాల అభిన్నరూపంగా హనుమంతుడు అవతరించాడు.

పార్వతి సతిగా ఉన్నప్పుడు రాముడి స్వరూపాన్ని తెలుసుకోవడానికి చేసిన పరీక్ష ఆవిడకు సంతోషాన్నిగాని, ఆవిడకు భవిష్యత్తులో శుభాన్ని గాని చేకూర్చలేదు. రావణాసురుడు కూడా తాను రాముడికి పెట్టిన మాయా జింక పరీక్షలో బావుకున్నది ఏమీ లేదు. ఈ ఇద్దరిలో ఒకరు విశ్వాసానికి ప్రతిరూపమైన శివుడికి భక్తుడు, మరొకరు భార్య. ఒకరు రాముడిని గురించి శివుడిని అడగలేదు, మరొకరు చెప్పినా వినలేదు. వీరిద్దరూ పరీక్షల ద్వారా ఈశ్వరుడిని తెలుసుకుందామనుకున్నారే కానీ, జిజ్ఞాసువులై విశ్వాసం ద్వారా పరమాత్మను పొందుదామనుకోలేదు.

తాను సర్వజ్ఞుడిని గానీ, ఆజ్ఞాపించే ప్రభువును గానీ కానని తండ్రి దశరథమహారాజు ఆజ్ఞకు బద్ధుడనై అడవికి వచ్చిన సేవకుడినని, భార్యను

పోగొట్టుకొని ఆవిడ ఎక్కడ ఉందో తెలియక వెతుకుతున్న అజ్ఞానినని, దుఃఖభారంతో క్రుంగిపోతున్న మామూలు జీవినని, అంతేగాని భూ భారాన్ని తగ్గించడానికి వచ్చిన పరమాత్మను కానని రాముడు చెప్పగానే, స్వామిని గుర్తించిన హనుమంతుడు ఆయన కాళ్లపైన ఒరిగిపోయాడు.

ఈ విషయం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. తాను సాధారణ జీవినని, కష్టాలలో ఉన్నవాడినని, అజ్ఞానినని, తండ్రి ఆజ్ఞకు బద్ధుణ్ణని శ్రీరాముడు చెబుతుంటే ఆయనే భగవంతుడనే విషయం ఆంజనేయ స్వామి ఎలా గ్రహించాడు? నిజమైన భక్తుడు లేదా జ్ఞాని భగవంతుడిని గుర్తించగలడు. పుంసాం మోహనరూపుడు, తేజోనిధి అయిన స్వామిని గుర్తించడం కష్టమా అని కొందరు అనవచ్చు, కానీ ఒక విచిత్రమైన విషయం ఏమిటంటే, తేజస్సులో రావణుడు రాముడికి ఏ మాత్రం తీసిపోడు. రావణాసురుడి తేజాన్ని మొదటిసారి చూచినప్పుడు రాముడే ఆశ్చర్య పోయాడు. కాబట్టి తేజస్సును చూసి ఎవరూ భగవంతుడిని గుర్తించలేరు. మొదటిసారి లంకలో కొలువుదీరి ఉన్న రావణుడిని చూసిన ఆంజనేయ స్వామి ఆశ్చర్యపోయాడు. సాక్షాత్తు భగవంతుడిలాగా అష్టదిక్పాలకులను శాసించగలిగిన మహాశౌర్య, ఐశ్వర్యవంతుడైన ఆ మహాశివభక్తుడి తేజస్సును మనసులోనే పొగడకుండా ఉండలేకపోయాడు. కానీ వాడు స్వయంగా తన నోటితోనే తన శౌర్యాన్ని పొగుడుకుంటూ, అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుడైన శ్రీరాముడిని దూషించగా వాడి అల్పత్వాన్ని, అజ్ఞానాన్ని చూసి ఆంజనేయస్వామి జాలిపడకుండా ఉండలేకపోయాడు. ఆత్మస్తుతి, పరనింద, అజ్ఞాని అయిన జీవుడి లక్షణం. **గోప్యత, వినయం, సరళత, నమ్రత, కోమలత్వం భగవత్ లక్షణాలు.** వీటిని చూసే రాముడిని భగవంతుడిగా ఆంజనేయస్వామి గుర్తించాడు.

భగవత్ చరణాలను పెనవేసుకున్న ఆంజనేయస్వామి శరీరం పులకరించగా, ఆనందాశ్రువులు ధారలై ప్రవహించగా ఇలా అన్నాడు,



'స్వామీ! చిన్నతనంలో తప్పిపోయిన తనయుడు తండ్రిని గుర్తించలేక పోవడం సహజమే కదా! కనుక నేను మిమ్మల్ని గుర్తించలేకపోయాను. అందుకే నేను మీ పరిచయం అడిగాను కానీ, ఈ జీవిని నీవెవరని మీరడగడం న్యాయమేనా? ఎందుకని నన్నిలా దూరంగా నిలుపుతున్నారు స్వామీ?' కానీ ఈ రోజు స్వామి ఎందువల్లో కాఠిన్యముద్రను అవలం బించాడు. తన చరణాల నుండి ఆంజనేయ స్వామిని లేపలేదు.

ఆంజనేయస్వామి తన లోపం ఏమై ఉంటుందో ఆలోచించడం మొదలుబెట్టాడు. సాధారణ జీవుడికి, సాధకుడికి ఉండే తేడా ఇదే. భగవంతుడు అనుగ్రహించకపోతే సాధారణ జీవి నాస్తికుడౌతాడు, సాధకుడు మాత్రం తన లోపం ఏమై ఉంటుందా అని ఆలోచించి, దాన్ని తొలగించుకోడానికి ప్రయత్నిస్తాడు. ఆంజనేయస్వామికి తన లోపం ఏమిటో అర్థమైంది. వెంటనే ఆయన తన సహజ మర్కట రూపాన్ని ధరించాడు. భగవంతుడు శరణాగతుడైన కామిని, క్రోధిని, లోభిని కూడా స్వీకరిస్తాడు, కాని కపటిని స్వీకరించడు. కపటం అంటే సరళత్వం లేకుండా ఉండటం (త్రికరణశుద్ధి లేకపోవడం). మనసులోని మాటనే మాటల ద్వారా చెప్పడం, చెప్పినదాన్నే చేయడాన్ని సరళత్వం అంటారు. ఒక వ్యక్తి స్వలాభాన్ని అపేక్షించో లేక గుర్తింపు కోరుకునో లేక మరేదైనా కారణం వల్లనయినా త్రికరణశుద్ధిగా ప్రవర్తించనప్పుడు ఆ వ్యక్తి యొక్క వ్యక్తిత్వం అనేకంగా విభజింపబడుతుంది. భగవంతుడు ఎప్పుడూ ఒకే వ్యక్తికి లభిస్తాడు. అనేక ముఖాలుగా విడిపోయిన జీవికి కాదు. ఆయన 'నేను ఎవరిని స్వీకరించాలి, చెడు చేయాలని ఆలోచించే వాడినా? పొగుడుతూ మాట్లాడిన వాడినా? లేక పని తప్పించుకు తిరిగిన వాడినా? నువ్వు నా దగ్గరికి ఈ మూడు రూపాలలో వచ్చావు, ఇప్పుడు నేనేం చేయాలి?' అని అడుగుతాడు. భగవంతుడు మిమ్మల్ని వికృతంగా సృష్టిస్తే అలాగే ఆయన వద్దకు వెళ్లండి; అంతేగాని ప్లాస్టిక్ సర్జరీ చేయించుకొని కాదు. ఆంజనేయస్వామి ఈ

సత్యాన్ని గుర్తించాడు. నన్ను స్వామి మర్కట రూపంలో సృష్టించాడు, నేను రూపం మార్చుకొని రావడం వల్ల ఆయన నన్ను స్వీకరించడం లేదు అనిగ్రహించాడు. అందుకే తన సహజ మర్కట రూపాన్ని ధరించాడు. వెంటనే శ్రీరాముడు ఆంజనేయస్వామిని లేపి గట్టిగా కౌగలించుకొని 'ఎందుకు బాధపడతావు హనుమా! నువ్వు నాకు లక్ష్మణుడి కన్నా రెండందాల ప్రియుడివి' అన్నాడు.

పార్వతీమాతకు రామాయణాన్ని వినిపిస్తున్న పరమశివుడు 'పార్వతీ! శ్రీరామచంద్రస్వామి కౌగిలిలో ఆంజనేయస్వామి పొందిన ఆ సుఖం ఇంతంత అని వర్ణించలేను' అని చెబుతూ సమాధిని పొందాడు. ఏకాదశ రుద్రావతారుడిగా తాను పొందిన ఆ బ్రహ్మసుఖ స్పర్శను స్మరించడం వల్ల ఆయనకు సమాధి కలిగింది. అటువంటి ఆలింగన సుఖం సీతామాత కూడా పొందలేదు అంటారు పెద్దలు. రాజభవనంలో ఉన్నప్పుడు అనేక ఆభరణాలు, అరణ్యవాసంలో స్వామి వ్రతదీక్ష ఆవిడకు ఈ సుఖాన్ని దక్కనివ్వలేదు. కేవల కౌపీనధారి అయిన ఆంజనేయస్వామికి మాత్రం ఈ అదృష్టం వరించింది.

లక్ష్మణుడి కన్నా తాను రెండందాలు ప్రియుడిననే మాటను భగవంతుడు తనలో అహంకారం పెరుగుతుందో లేదో చూడటానికి వాడి వుంటాడనే భావనను ఆంజనేయస్వామికి కలగజేసింది. కానీ అదే మాట లక్ష్మణస్వామిని ఆలోచించేలా చేసింది. 'చిన్నతనం నుండే సేవచేస్తున్న తనకన్నా, ఇప్పుడే స్వామి సన్నిధికి చేరిన ఆంజనేయస్వామి ఏవిధంగా రెండందాల స్వామికి ప్రియుడు' అంటూ ఆలోచించడం మొదలు బెట్టాడు. లక్ష్మణస్వామి స్థానంలో మరే యితర జీవి ఉన్నా ఆంజనేయస్వామి విషయంలో ఈర్ష్యపడేవాడు; రామచంద్రస్వామి తనను నిరాదరించాడని బాధపడటమో లేదా క్రోధం చెందడమో లేక ద్వేషం పెంచుకోవడమో చేసేవాడు. కానీ నిస్వార్థసేవలో మునిగివున్న వైరాగ్యస్వరూప లక్ష్మణుడిని స్వామి వారి ఈ మాట ఆలోచించేలా చేసింది.



కొందరు సేవకులు, యజమాని దగ్గర ఉంటేగానీ సేవచేయలేరు, మరి కొందరు సిగ్గరులు యజమాని నుండి దూరంగా ఉంటేగాని సరిగ్గా సేవచేయలేరు. లక్ష్మణుడు మొదటి జాతికి చెందినవాడు. భరతుడు రెండవ జాతికి చెందినవాడు. 14 సంవత్సరాలు అయోధ్యా సింహాసనాన్ని కాపాడటమే గాక రాజ్య సంపదను అనేక రెట్లు వృద్ధి జేసి స్వామికి సమర్పించడం అనే కార్యం భరతుడు శ్రీరాముడి నుండి దూరంగా ఉండే చేయగలిగాడు. లక్ష్మణుడు స్వామిని జీవితాంతం నీడలాగా వెంట ఉండి సేవ చేశాడనే విషయం అందరికీ తెలిసిందే. కానీ కొందరు సర్వసమర్థులైన సేవకులుంటారు; వారు యజమానికి దగ్గరగా ఉన్నా దూరంగా ఉన్నా కూడా సేవచేయగలరు. అటువంటివాడే ఆంజనేయస్వామి. ఆయన భగవంతుడి వద్ద ఉండి సేవచేయగలడు, దూరంగా లంకకు, అయోధ్యకు వెళ్లి స్వామి కార్యం నెరవేర్చగలడు. అందుకే భరతుడు + లక్ష్మణుడు = ఆంజనేయుడు అని లెక్కచెప్పవచ్చు. పైగా భరతుడు, లక్ష్మణుడు కేవలం భగంతుడి సేవ మాత్రమే చేయగలరు, ఆయన వాత్సల్యాన్ని మాత్రమే పొందగలరు. కానీ ఆంజనేయస్వామి భగవంతుడి సేవ, భక్తిమాత సేవ, భక్తుల సేవ కూడా చేయగలడు. భక్తుల విశ్వాసాన్ని, భగవత్ అనుగ్రహాన్ని, భక్తిమాత వాత్సల్యాన్ని కూడా పొందగలడు. కాలస్వరూపుడైన లక్ష్మణుడు భవిష్యత్తులో ఆంజనేయస్వామి లంకలో సీతామాత అనుగ్రహాన్ని పొందుతూ ఉండటం, విభీషణాది భక్తుల విశ్వాసపాత్రుడవుతూ మెలగడం, రామాయణ పాత్రలన్నీ ఈ భూమి నుండి అవతారం చాలించి వెళ్లి పోయినా, చిరంజీవిగా కోట్లకొద్దీ సంవత్సరాలు రామభక్తులను స్వామి సన్నిధానానికి చేర్చుతూ ఉండటం చూడగలిగాడు. అందుకే ఆయన స్వామికి రెండందాల ప్రియుడని గ్రహించాడు లక్ష్మణస్వామి.

మీరు మీ భార్య ఎడల ఎక్కువ ప్రేమ కలిగి ఉంటారా లేక మీ భార్య మెడలోని ఆభూషణాల ఎడలా? భార్య ఎడలనే కదా! లక్ష్మణుడు

ఆదిశేషుడు శ్రీమన్నారాయణుడి అవతారమైన రాముడికి తల్పం, శివుడికి కంఠాభరణం. తన సేవకుడు లేదా తన మిత్రుడి కంఠాభరణం అయిన వాడు స్వామికి ఇష్టుడైనా అంతకన్నా ఆయనకు తన మిత్రుడు, హృదయేశ్వరుడే రెండందాల ప్రియుడు.

సుప్రసన్నుడై తనను ఆదరించిన స్వామి అనుకూలుడిగా ఉన్నాడని గ్రహించిన ఆంజనేయస్వామి, సుగ్రీవుడి ప్రస్థావన తీసుకువచ్చాడు. 'స్వామీ! సుగ్రీవుడనే వానరరాజు ఒకడు ఈ ఋష్యమూక పర్వతం మీద ఉన్నాడు; వాడు కష్టాలలో ఉన్నాడు. వాడి కష్టం మీరు తీర్చండి, సీతామాతను అన్వేషించడంలో మీకు వాడు సాయం చేయగలడు. వాడు మీ సేవకుడు, వాడి దగ్గరకు వెళదాం రండి' అన్నాడు ఆంజనేయస్వామి.

రామచంద్రస్వామి నవ్వుతూ 'వాడు నా సేవకుడైతే వాడు నా దగ్గరికి రావాలి గానీ, నన్ను వాడి దగ్గరికి రమ్మంటావేమిటి?' అన్నాడు. దానికి ఆంజనేయస్వామి నవ్వుతూ 'స్వామీ! వామనావతారంలో బలిచక్రవర్తిని ఉద్ధరించడానికి ఆయనింటికి మీరు బిచ్చమెత్తుతూ వెళ్లగాలేనిది, ప్రహ్లాదుణ్ణి ఉద్ధరించడానికి ఆయన ఇంటికి మనిషో పశువో తెలియని వింతరూపం ధరించి వెళ్లగా లేనిది, వేదరక్షణకు కంపుకొట్టే చాప రూపంలో నీళ్లలో నానగా లేనిది, సాగరమథనంలో కూలివాడిగా పర్వతాన్ని నడుము మీద మోయగాలేనిది, భూమాతను రక్షించడానికి సూకర ప్రవృత్తిని స్వీకరించగా లేనిది, ఈరోజు సుగ్రీవుడి విషయంలో ఇబ్బంది ఏమొచ్చింది? ఇలా అన్నానని ఆగ్రహించకండి స్వామి, కాలానుగుణంగా సాంప్రదాయాలు మారుతున్నాయి. శిష్యులైన మీరు గురు విశ్వామిత్రులకు సేవచేయాలి కానీ ఆయనే మీకు సుప్రభాతం పాడి నిద్రలేపుతాడు; పైగా సుగ్రీవుడిని మీ దగ్గరికి తీసుకురాకపోవడానికి మరోకారణం కూడా ఉంది స్వామీ; అదేమిటంటే ఎత్తు మీద ఉన్న వాణ్ణి క్రిందికి లాగడం కన్నా మనమే పైకి వెళ్లడం మంచిది కదా' అన్నాడు.



లీలామానుషవిగ్రహుడు ఈరోజు మిత్రుడు, తనయుడు, హృదయేశ్వరుడు లభించిన ఆనందంలో దోబూచులాట ఆడుతున్నాడు. 'ఈరోజు సుగ్రీవుడి దగ్గరికి వచ్చేవాణ్ణే గాని నడిచి నడిచి అలిసి ఉన్నాను, ఏం చేసేది ఈ రాజభోగాలు నన్ను సుకుమారుడిగా మార్చాయి' అన్నాడు. ఆంజనేయస్వామి నవ్వుతూ 'ఇన్నాళ్లూ మీరు వాహనం లేక నడిచి అలిసిపోయారు స్వామి, కాని ఇప్పుడు ఇక ఆ కొరత లేదు. ఇక నుండి నేనే మీ వాహనాన్ని' అంటూ పర్వతాకారుడై అన్నదమ్ములనిద్దరినీ తన భుజాల మీద కూర్చోబెట్టుకొని ఆకాశమార్గాన ఋష్యమూక పర్వత శిఖరాగ్రాన వాలాడు.

సాధకుడు సాధనా పటిమలేక గానీ, భగవదనుగ్రహం లేక గానీ పతనం కాడు, గురు అనుగ్రహం లేనప్పుడే అతడు పతనమయ్యేది. దత్తాత్రేయస్వామిని సాక్షాత్కరించుకున్న కార్తవీర్యార్జునుడు, శివుడిని సాక్షాత్కరించుకున్న రావణాసురుడు, సాక్షాత్తు భగవంతుడిని వెంట బెట్టుకొని తిరిగిన పాండవులు కూడా కష్టాలు పడ్డారు. ఏ సాధనాలేని పశువు సుగ్రీవుడు, భోగలాలసత, కృతఘ్నత, పిరికితనం, ధనాకాంక్ష, రాజ్యేచ్ఛ వాడి స్వభావంలోనే ఉన్నాయి. అయినా వాడు భగవంతుడిని పొందాడు. తన వెంట ఉన్న ఆంజనేయస్వామిని వాడు ఏనాడూ గురువుగా గుర్తించలేదు; తన సేవకుడు లేదా మంత్రి అని మాత్రమే అనుకున్నాడు. కానీ ఆయనలో సంపూర్ణవిశ్వాసాన్ని నిలిపాడు. తన కండ్లకు రామ లక్ష్మణులు శత్రువులుగా కనిపించినా తన కండ్లను వాడు నమ్మలేదు, పరీక్షించడానికి తాను విశ్వసించిన ఆంజనేయస్వామిని పంపాడు. దానికి ఫలితంగా ఈ రోజు ఆంజనేయస్వామి సాక్షాత్తు పరమాత్మను తీసుకువచ్చి అతడి ఇంటి ముందు దింపాడు. శివ సాక్షాత్కారం పొందిన మహాజ్ఞాని రావణాసురుడు ఆంజనేయస్వామి మాటవినని కారణంగా కృష్ణపక్ష చంద్రుడిలా నశిస్తే, రాముడిని భగవంతుడిగా గుర్తించలేని అజ్ఞాని

సుగ్రీవుడు, ఆంజనేయస్వామి మాట విని శుక్లపక్ష చంద్రుడిగా వృద్ధిపొందాడు.

అవతారిక:- భోగేచ్ఛ కలిగిన సుగ్రీవుడు పూర్ణకాముడైన రాముడితో స్నేహం చేశాడా? ఈ విచిత్ర మైత్రికి మధ్య అనుసంధాత ఎవరు? అతడేమి ఆశించి వీరిని కలిపాడు? 63, 64, 65 మంత్రాలలో రామ సుగ్రీవ మైత్రి ద్వారా వాలి వధను, సుగ్రీవుడి కృతఘ్నతను సూచిస్తోంది వేతమాత.

**మంత్రాలు 63, 64, 65 :**

**దేహి మే దదామి తే నిధేహి మే నితే దధే। నిహార మిన్మే హర నిహరం నిహరామి తే॥** (వాజసనేయ సంహిత 3.50)

**ఏవా హి త్వామృతుథా యాతయన్తం మఘా విప్రేభ్యో దదతం శృణోమి। కిం తే బ్రహ్మాణో గృహ్ణతే సఖాయో యే త్వయా నిదధుః కామమిన్ద్ర ॥** (ఋగ్: 5-32-12)

**కథా దేవానాం కతమస్య యామని సుమంతు నామ శృణ్వతాం మనామహే। కో మృళాతి కతిమో నో మయస్కర త్కతమ ఊతీ అభ్యావవర్తతి ॥** (ఋగ్: 10-64-1)

తాత్పర్యము:- సుగ్రీవుడు రాముడితో 'ముందు మీరు నాకు ఇవ్వండి తర్వాత నేను మీకు ఇస్తాను. ముందు మీరు నాకు నా ధనాన్ని - స్త్రీని ఇప్పించండి. ఆ తర్వాత మీ భార్య మీకు లభించేలా చేస్తాను' అన్నాడు.

సకామ సుగ్రీవుడిని అనుగ్రహించిన రాముడితో నిష్కామి హనుమంతుడు ఇలా అన్నాడు. 'శాస్త్రీయ దృష్టిలో మీరు అంతర్యామి అవటం వల్ల యజ్ఞం చేసినవారికి ఫలితం ఇస్తారని నేను విన్నాను. కానీ మీరిచ్చినా నాలాంటి వారు తీసుకోరు. సఖులు నిష్కాములైన సేవకులు



కనుక మీ కార్యాలన్నీ నేను చేస్తాను, దానికి ఫలితం మాత్రం మీ నుండి ఆశించను'.

వాలిని వధించి, సుగ్రీవుడి రాజ్యం ఇప్పించిన తర్వాత రాముడు తనను గురించి ఇలా ఆలోచిస్తున్నాడు. 'నా మాట వినే ఈ వానరరూప దేవతలలో ఏ రూపం, ఏ నామం గల వానరుడు సీతాన్వేషణ చేయడం ద్వారా నన్ను సంతోషపెట్టగలడు? ఎవడు నవమూర్తి సీతను నాకు తెచ్చి ఇవ్వగలడు? ఈ పని చేయగల వాడెవరో నాకు తెలియడం లేదు'.

వ్యాఖ్యానము:-

అనేక రామాయణాల్లో అనేక రకాలుగా రాముడితో హనుమ - సుగ్రీవుల కలయిక వర్ణింపబడింది.

*'పావన సాఖీ దేఇకరి జోరీ ప్రీతి దృఢాయి'*

రామ, సుగ్రీవులలో ప్రీతి ధృఢమయ్యే విధంగా వారిరువురికి హనుమ అగ్నిసాక్షిగా స్నేహం చేయించాడు.

ప్రజ్వలించే అగ్ని మైత్రీ ధర్మానికి ఉత్తమ ఉదాహరణ. కట్టెలు మండాలంటే అగ్ని కావాలి. అగ్ని ప్రకటమై జీవించాలంటే కట్టెలు కావాలి. బాగా ప్రజ్వలిస్తున్న అగ్ని నుండి కట్టెలను-అగ్నిని విడదీయటం అసంభవం. అవి రెండూ ఏకమై కలిసిపోయాయి. అగ్ని బాగా మండాలంటే వాయువు వీచాలి. కాని తాను ఉన్న విషయం తెలియచేయకుండానే, తన అస్తిత్వం బైటపడకుండానే వాయువు అగ్నిని ప్రజ్వలింపచేస్తుంది. అందుకే వాయువు ను అగ్నికి మిత్రుడంటారు. వాయువు నిష్కామకర్మకు పరాకాష్ట. అగ్ని ఇంధనం పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. అవి అవసరం కొద్దీ స్నేహం చేస్తాయి. కానీ వాయువు నిరపేక్ష భావనతో (వాటి నుండి ఏమీ ఆశించక) రెండింటినీ కలిపి బ్రతికిస్తుంది. ఈ కార్యం వల్ల వాయువుకు లభించేది ఏమీ లేదు. అలాగే వాయునందనుడైన

ఆంజనేయుడు కూడా. సుగ్రీవ శ్రీరాములు పరస్పరం వారివారి అవసరాల కొద్దీ స్నేహం చేశారు. వారిని కలిపినవాడు పవననందనుడు.

ఈ విధంగా స్నేహం చేసిన తర్వాత, లక్ష్మణుడు రామకథను - సీతాపహరణ విషయాన్ని సుగ్రీవుడికి తెలిపాడు. వెంటనే సుగ్రీవుడు ఒకరోజు తాను మంత్రులతో బాటు ఈ పర్వతం మీద సమాలోచనలో ఉండగా, రావణుడి చేత కొనిపోబడుతున్న సీత ఆక్రందనను విని తలెత్తి చూడగా, ఒక వస్త్రాన్ని క్రింద పడవేసిందని చెప్పి, దాన్ని తెప్పించి రాముడికి ఇచ్చాడు. దానిని చూడగానే రాముడికి దుఃఖం పొంగి పొరలింది. వాల్మీకి రామాయణంలో సీత నగలమూటను క్రిందవేయడం, వాటిని సుగ్రీవుడు చూపగా కాలి అందెలను మాత్రం లక్ష్మణుడు గుర్తించినట్లు ఉంది.

రామకథను విన్న తర్వాత సుగ్రీవుడు 'స్వామీ మీరు దిగులు విడిచి పెట్టండి. సీత తప్పక లభిస్తుంది' అన్నాడు. కరుణామూర్తి రాముడు తన నూతన మిత్రుడి ఆ కొద్ది మాటలకే పొంగి పోయాడు. తొందరపడి అతి త్వరగా మాట ఇచ్చేవారు, ఈ లోకంలో త్వరగా మాట కూడా తప్పుతా రేమో! కుదుటపడిన రాముడు సుగ్రీవుడి వృత్తాంతం చెప్పమనగా, ఆయన ప్రారంభిస్తాడు..........

సుగ్రీవుడి చరిత్ర :-

వాల్మీకి రామాయణాన్ని అనుసరించి స్త్రీ రూప ఋక్షరజ సంతానమైన వాలి సుగ్రీవులను బ్రహ్మ ఆదేశానుసారం దండకారణ్యంలో విడిస్తే, వారిని అహల్య పెంచుతుంది. ఖడ్గదుడనే కిష్కింధ రాజు వేటకు వచ్చి వారిని తీసుకెళ్లిపోతాడు. వాలిని రాజును, సుగ్రీవుడిని యువరాజును చేస్తాడు. విష్ణువు రాముడై అవతరించగా, ఆయన సహాయార్థమై ఇంద్రుడు వాలిని, సూర్యుడు సుగ్రీవుడిని, బృహస్పతి తారను, కుబేరుడు గంధమాదనుడిని, విశ్వకర్మ నలుడిని, అగ్ని నీలుడిని, అశ్వనీ కుమారులు



మైంద-ద్వివిధులను, వరుణుడు సుశేణున్ని, పర్జన్యుడు శరభుడిని, వాయువు ఆంజనేయుడిని, బ్రహ్మ జాంబవంతుడిని ఉత్పన్నం చేశారు.

తమ అన్నదమ్ముల ఉత్పత్తి కథను తెల్పిన సుగ్రీవుడు, తమ మధ్య శత్రుత్వం పుట్టిన కథను కూడా చెప్పటం మొదలుపెట్టాడు.

ఒకరాత్రి మయదానవ పుత్రుడు, మాయావి (దుందుభి సోదరుడు) వాలిని యుద్ధానికి పిలవగా, వాలి కోపంతో వాణ్ణి చంపడానికి పరిగెత్తాడు. అన్నకు ఎక్కడ హాని కలుగుతుందోనని సుగ్రీవుడు కూడా వెంట పరిగెత్తాడు. మాయావి ఒక గుహలోనికి ప్రవేశిస్తే, వాలి దానిలోకి వెళుతూ తన కొరకు పదిహేను రోజులు ఎదురుచూసి, రాకపోతే చనిపోయానని భావించమని (తులసీ రామాయణం) చెప్పాడు. బైటకి తెల్లని రక్తం ప్రవిస్తే తాను, ఎర్రటి రక్తం ప్రవిస్తే రాక్షసుడు మరణించినట్లు భావించమని (ఆ.రా) సుగ్రీవుడితో చెప్పి వెళ్లాడు. ఒక సంవత్సరం (నెల అని తు.రా) ఎదురు చూసిన తర్వాత రక్తధారా ప్రవాహం (తెల్లని రక్తం-ఆ.రా) రావటం చూసి, రాక్షస గర్జనలు వినిపించటంతో వాలి చనిపోయాడని భావించి ఆ రాక్షసుడు బయటకు వస్తే తనను చంపుతాడేమో అనే శంకతో, గుహ ముఖద్వారానికి పెద్దరాయి అడ్డం పెట్టి, వాలికి తర్పణం వదిలి, కిష్కింధకు తిరిగి వచ్చాడు. మంత్రులు అతడికి రాజ్యాభిషేకం చేశారు. వాలి భార్య తారను తన పత్నిగా ఉండమని సుగ్రీవుడు కోరితే ఒక వారం గడువు ఇమ్మన్నది (ఆ.రా). ఇంతలో వాలి తిరిగి వచ్చాడు. సుగ్రీవుడు గౌరవంగా పక్కకు తొలగి వాలికి సింహాసనం ఇచ్చాడు. కానీ వాలి కోపోద్రిక్తుడై సుగ్రీవుడి భార్య 'రూమా'ను, ధనాన్ని లాక్కొని అతడిని వెంటబడి కొట్టాడు. సుగ్రీవుడు అన్నివైపులకు పరిగెత్తి, వాలి రాలేని ఋష్యమూక పర్వతం మీద నివసించటం మొదలుపెట్టాడు. అరవై వేల సంవత్సరాల క్రితమే, దశరథుడి పట్టాభిషేకం రోజే ఈ విధంగా సుగ్రీవుడు పదవీచ్యుతుడయ్యాడు (పద్మ పురాణం)

సుగ్రీవుడి దుఃఖభరితమైన జీవిత కథను వినగానే, వాలిపై కోపోద్రిక్తుడైన స్వామి "సును సుగ్రీవ మారెహ ఉ బాలి హి ఏకహి బాన - సుగ్రీవా, నేను వాలిని ఒకే ఒక బాణంతో నేలకూల్చుతాను" అన్నాడు. అంతేకాదు, ఒక మంచి మిత్రుడి లక్షణాలను వివరిస్తూ, 'మిత్రుడు తన స్నేహితుడిని చెడునడవడికల నుండి తప్పించి, మంచి నడవడికలో పెడతాడు. సుగుణాలను ప్రకటిస్తాడు. అవగుణాలను దాచిపెడతాడు' అన్నాడు.

వాలి వధ-సుగ్రీవ శంక

ప్రతి వ్యక్తి జీవితంలోను, సుగుణాలు దుర్గుణాలు కలిసే వుంటాయి. అటువంటప్పుడు సత్యాన్ని ప్రకటిస్తున్నామనే నెపంతో, దోషాలను ప్రకటించేవాడు కుమిత్రుడు. ఏదైనా భయంకర రోగంతో పీడితుడయ్యే వ్యక్తి దగ్గరకి వెళ్లి 'ఇక నీకు చావు తప్పదు' అని సత్యం చెప్పేవాడు అసలు మిత్రుడే కాదు. అంతకన్నా 'ఈరోజు నీ ముఖం తేటగా వుంది, క్రమంగా నువ్వు నీ జబ్బు నుండి కోలుకుంటున్నావు; తప్పక మరల మనం అంతా వినోదాలలో పాలు పంచుకునే రోజు వస్తుంది' అంటూ అబద్ధం చెప్పి అయినా ఉత్సాహపరిచేవాడే నిజమైన మిత్రుడు. మిత్రుడికి వచ్చిన కష్టాన్ని తన కష్టంగానూ, అతడి సుఖాన్ని తన సుఖం గానూ భావించనివాడు మిత్రుడే కాదు. ఇచ్చిపుచ్చుకోవటంలో కూడా వెనుకాడనివాడే సరైన మిత్రుడు. రాముడు చివరకి -'తుమ్హ ప్రియ మోహి భరత జిమిభాఈ- నీవు నాకు భరతుడి లాగా ప్రియమైన తమ్ముడివి'- అన్నాడు సుగ్రీవునితో. ఎన్నో కుసంస్కారాలతో కూడుకున్న సుగ్రీవుడి వెన్నుతట్టి ఆ తర్వాత అవసరమైన చోట ప్రేమతో చెప్పిగానీ, భయపెట్టిగానీ అతడిని కర్తవ్య కర్మలో నిలిపి అతడి అభివృద్ధికి పునాది వేసిన ఉత్తమ మిత్రుడు రాముడు.

కాని, శంకిత మనస్కుడైన సుగ్రీవుడికి రాముడిపైన పూర్తి విశ్వాసం కలగలేదు. అందుకే 'బాలి మహాబల అతిరణధీరా-కానీ



వాలి చాలా బలసంపన్నుడు, గొప్ప వీరుడు స్వామి (మీరతణ్ణి చంపగలరా?)' అన్నాడు. వాలితో సుగ్రీవుడు తనను పోల్చి, తాను వాలికన్నా బలశౌర్యాలలో మిన్న అని తెలుసుకున్నప్పుడే విశ్వసించగలడని గ్రహించిన రాముడు పరీక్షించుకోమన్నాడు. వాలి చేత సంహరింపబడి, విసిరి వేయబడ్డ దుందుభి శరీరపు అస్తికలు అక్కడే ఉన్నాయి. సుగ్రీవుడు వాటిని చూపగా, రాముడు తన కాలి బొటనవ్రేలితో ఆ ఎముకల కుప్పను పది యోజనాల (80 మైళ్లు) దూరం విసిరివేసాడు. రక్తమాంసాలతో నిండినప్పుడు వాలిచేత విసిరివేయబడిన ఆ శరీరంతో పోల్చుకుంటే ఈ ఎముకలు చాలా తేలిక, కనుక సుగ్రీవుడు రాముని బలం చూసి తృప్తి చెందలేదు.

అప్పుడు సుగ్రీవుడు, 'ఒకసారి వాలి ఒక గుహలో కొన్ని తాటిపండ్లు దాచాడు. వాటిలో ఎవరో ఏడు పండ్లను ఎత్తుకొని పోయారు. ఆ గుహలోనే ఉన్న ఒక మహా సర్పాన్ని చూచిన వాలి, ఇదే వాటిని దొంగిలించిందని భావించి ' నీ శరీరం మీద ఏడు తాటిచెట్లు మొలుచుగాక' అని శపించాడు, (ఆ.రా) వెంటనే కాలసర్పం కూడా కోపించి, ' ఆ ఏడుతాళ్లను ఒకే బాణంతో కూల్చినవాడు నీ మృత్యుకారకుడౌతాడు' అని ప్రతిశాపం ఇచ్చింది. కనుక రామా, మీరు ఈ చెట్లను ఒకే బాణంతో పడగొట్టగలిగితే మీరు వాలిని వధించగలరని నేను నమ్ముతాను' అన్నాడు.

రాముడు శేష అంశగల లక్ష్మణుడి కాలిని తన కాలితో నొక్కిపెట్టి సర్పంలో మెలికలు లేకుండా తిన్నగా (సూటిగా) ఉండేటట్లు చేసి, ఒకే బాణంతో ఆ తాటిచెట్లనన్నింటిని కూల్చాడు. అంతటితో ఆ సర్పానికి శాపవిముక్తి అయింది. కానీ మళ్లీ సుగ్రీవుడు, 'కాస్యప మహర్షి తన తపశ్శక్తితో ఒక మాలను సంపాదించి దాన్ని ఇంద్రుడికి ఇచ్చాడు. ఇంద్రుడు దాన్ని వాలికి ఇచ్చాడు. ఆ మాలను చూచిన శత్రువులు యుద్ధభూమిలో బలహీనులౌతారు. వాలి ఆ మాలను నిరంతరం ధరించే ఉంటాడు. కనుక ఇప్పటికీ నాకు సందేహమే' అన్నాడు.

రాముడు శాపవిముక్త సర్పాన్ని ఆ మాలను దొంగిలించమని ఆజ్ఞాపించాడు. ఆ సర్పం మాలను దొంగిలించి దాన్ని ఇంద్రుడికి ఇచ్చింది. అప్పుడే సుగ్రీవుడు వాలితో ద్వంద్వయుద్ధం చేయటానికి సిద్ధమయ్యాడు (ఆనంద)

ద్వంద్వయుద్ధం :-

శ్రీరాముడి ప్రేరణ చేత సుగ్రీవుడు, ఋష్యమూకపర్వతం దిగి కిష్కింధ రాజభవనం ప్రహరీవద్ద నిలబడి వాలిని యుద్ధానికి పిలిచాడు. క్రోధావేశంతో వాలి యుద్ధానికి బయలుదేరాడు.

తార ఉపదేశం : అప్పుడు తార అతణ్ణి ఆపింది. 'నాథా, తేజోబల సంపన్ను లైన రామలక్ష్మణులు అనే దశరథ రాకుమారులు సుగ్రీవుడికి అండగా నిలిచి ఉన్నారని తెలిసింది. వారి బలం చూసుకునే మీ తమ్ముడు మిమ్ములను యుద్ధానికి పిలుస్తున్నాడు. కనుక మీరు వెళ్లవద్దు' అంటూ వాలికి తార ఉపదేశించింది. అదివిని వాలి-

'కహ బాలీ సును భీరుప్రియ సమదరసీ రఘునాథ'

'ఓ పిరికిదానా! రాముడు సమదర్శి, ఆయన నన్నెందుకు చంపుతాడు' అన్నాడు.

తన చిన్న కొడుకును ఏ కారణం లేకుండా హింసించి కొట్టే పెద్ద కొడుకును తల్లి తప్పక దండిస్తుంది. మేమిద్దరమూ నీకు సమానంగా కొడుకులమే అయినపుడు నన్నెందుకు దండిస్తావు అని అడగడానికి వీలు లేదు. ఎవరి దగ్గరన్నా డబ్బు తీసుకొని, అది వెనుకకు ఇవ్వనప్పుడు, తీసుకున్నవాడు వైరాగ్యం మీద ఉపదేశం చేయటం, కపటం స్వార్థం అవుతుందే తప్ప ధర్మం కాదు. ఒక వ్యక్తి పైన గల ద్వేషం వల్ల అతడి వల్ల సంఘానికి జరుగుతున్న అన్యాయాన్ని (న్యాయాన్ని దాచి) బైటపెట్టడం సంఘసేవ అంతకన్నా కాదు.



వాలికి నిజంగా సమదర్శిత్వపు భావనే గనక ఉంటే, సుగ్రీవుడి లాగా తాను కూడా రాముడి శరణాగతి పొంది, ఆయనకు తన సమదర్శిత్వాన్ని ప్రకటించుకునే అవకాశం ఇవ్వాలి. కానీ ఆ అహంకారి, రామరక్షణలో ఉన్న సుగ్రీవుడితో యుద్ధానికి వచ్చాడు. మొదటిసారి యుద్ధంలో వాలిచేత సుగ్రీవుడు చావుదెబ్బ తిని అతికష్టం మీద మృత్యుదేవతలాంటి వాలి నుండి బయటపడ్డాడు. ఋష్యమూక పర్వతానికి తిరిగి వచ్చిన సుగ్రీవుడు, మళ్లీ యుద్ధానికి వెళ్లనన్నాడు. రాముడు తన చేతి స్పర్శతో అతడి శారీరక బాధలన్నీ తొలగించాడు (తు.రా). 'మీరిద్దరూ ఒకే రూపంలో ఉండటం వల్ల ఎవరు వాలో తెలియక నేను బాణం వేయలేదని' చెప్పి ఈసారి సుగ్రీవుడిని గుర్తించటానికి వీలుగా అడవి పూలతో అల్లిన మాల ఒకటి అతడి మెడలో వేశాడు. కానీ ఇతర రామాయణాల ననుసరించి, అతడి తోకకు ఒక అద్దాన్ని, నడుముకు ఒక మూలికను కట్టడం జరిగింది. రెండవసారి యుద్ధంలో మళ్లీ వాలి విజృంభించసాగాడు. ఇంద్రజిత్తు హేమమాల కారణంగా తన ఎదురుగా ఉన్న శత్రువు బలంలో సగం వాలి గ్రహిస్తాడు. కనుక ఎవరూ ఎక్కువసేపు అతని ముందు నిలిచి యుద్ధం చేయలేరు. (ఆనంద రామాయణం, భావార్థ రామాయణం). వాల్మీకిని అనుసరించి రాముడు దాక్కొని వాలిని చంపిన విషయం ఏమీ లేదు.

'తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరమ్।
సశరం వీక్షతే వీరో వాలినో వధ కాంక్షయా॥ (వా.రా. 4-16-33)

యుద్ధ సమయంలో సుగ్రీవుడి బలం క్షీణిస్తూ ఉండటం చూసి రాముడు బాణం విడిచాడు. క్షణకాలం పక్షులన్నీ నిశ్శబ్దమయినాయి. మృగాలన్నీ పారిపోయాయి. ప్రళయం వస్తుందా అన్నట్లుగా అరణ్యం అంతా స్తబ్ధం అయిపోయింది. వాలి మెడలో ఉన్న మాల కారణంగా అతడు బాణం దెబ్బకు పడిపోయినా అతడిని తేజస్సు వీడలేదు (వాల్మీకం).

రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు మొ॥వారు మెల్లిగా పడిపోయిన వాలి దగ్గరకు వచ్చారు' 'నన్ను చెట్టు చాటు నుండి ఎందుకు చంపావ'ని వాలి అడగలేదు.

వాలి ప్రశ్న-రాముని సమాధానం :

'న మన్యేన సంరబ్ధం ప్రమత్తం వేద్ధు మర్హసి- (వా.రా. 4-17-21)- ఇతరులతో యుద్ధం చేస్తున్న నన్ను ఎందుకు కొట్టావు?' అని మాత్రం అన్నాడు.

ధర్మహేతు అవతరెహు గోసా ఈ।
మారెహు మోహి వ్యాధకీ నా ఈ॥
మై బైరీ సుగ్రీవ పి ఆరా।
అవగున కవన నాథ మోహి మారా॥ (తులసీ రామాయణం)

ధర్మోద్ధరణకు అవతరించిన ఓ స్వామీ, పశువును కొట్టినట్లు నన్ను ఎందుకు కొట్టావు? నీకు నేను శత్రువును, సుగ్రీవుడు మిత్రుడా? నాలో ఏ లోపాన్ని (తప్పిదాన్ని) చూసి, ఇలా నన్ను దండించావు?-అంటూ పడిపోయిన వాలి రాముడిని ప్రశ్నించాడు.

అనాది నుండి వాలి వధ విషయం ఒక చర్చనీయాంశంగా మారింది. భాగవతంలో (సూరసాగర) కూడా, గోపికలు కృష్ణుడిని ఆయన పూర్వావ తారంలో (రామ) చేసిన రెండు తప్పులను ఎత్తి చూపుతారు. శూర్పణఖ ముక్కు, చెవులు కోయటం, వాలిని చంపడం. ఈ సంఘటనలను ఇతర దృష్టికోణాల నుండి ఆలోచించే ముందు స్వయంగా రాముడి దృష్టికోణం ఏమిటని చూడవలసి ఉంది. ఎవరైనా వ్యక్తి తాను చేసిన పనికి పశ్చాత్తాపపడడమో ఇతరులు ఆ పనిని తప్పు అని ఖండించాలని చూడడమో, లేక ప్రాయశ్చిత్త పడడమో, చేసిన పనికి తాము శిక్ష అనుభ వించటమో చేస్తే, అతడు స్వయంగా తన దృష్టిలోనే పడిపోయాడన వలసివస్తుంది.



వాలి వధ తర్వాత రాముడిలో అటువంటి గ్లాని గాని, పశ్చాత్తాపం గాని కనిపించదు. రామరాజ్యంలో వాక్ స్వాతంత్ర్యం ఉంది. విమర్శలను రాముడెప్పుడూ కాదనలేదు, భయపడలేదు, అణచిపెట్టలేదు. 'నేననేదైనా తప్పుగా మాట్లాడినా, అధర్మంగా ప్రవర్తించినా భయం విడిచి మీరు నాతో మాట్లాడండి' అంటూ అయోధ్యానగర వాసులకు ఆయన ఉపదేశిస్తాడు. సుగ్రీవుడికి ఇచ్చిన మాట ప్రకారం ఆయన వాలిని ఒకే బాణంతో చంపాలి. తలచుకుంటే, ఆ ఒకే బాణంతో ఆయన వాలి తల నరకగలిగేవాడు, కాని వాలికి మాట్లాడే అవకాశం ఇవ్వాలని అనుకొని, తాను వివరణ కూడా ఇవ్వగలననే ఉద్దేశ్యంతో బాణాన్ని గుండెల్లో దింపాడు. వెంటనే వెళ్లి వాలికి ఎదురుగా నిలిచాడు. అప్పుడు పైమాటలన్నాడు వాలి.

ఇంతకూ రాముడిని ఏ దృష్టితో చూసి వాలి ఈ ప్రశ్నలు వేస్తున్నాడు - అనే విషయం ఆలోచించాలి. రాముడిని సర్వేశ్వరుడిగా భావిస్తే, ఆయన చేసే మూడు కార్యాలలో సంహారం కూడా ఉంది. కనుక ఒక వ్యక్తిని చంపిన నేరానికి, మరొక వ్యక్తికి శిక్షవేసినట్లుగా ఆయనను దండించలేము. వాలి ఆయనను ధర్మోద్ధరణకు అవతరించిన పరమాత్మ అంటూనే మళ్లీ మానవీయ దృష్టితో ఆలోచిస్తున్నాడు. వాలి, రాముడి సమక్షాన్ని న్యాయాలయంగా భావిస్తే, న్యాయనిర్ణేతకు సర్వ స్వాతంత్ర్యం ఉంటుంది. ఆయనను ఈ తీర్పు ఎందుకు ఇచ్చావని అడిగే అవకాశమే ఉండదు. అక్కడ ఆయన మృత్యుదండన ఇచ్చినపుడు, న్యాయాధీశుడు ముద్దాయితో యుద్ధం చేయవలసిన పనిలేదు. యుద్ధంలోనయితే ప్రత్యక్షంగా ఇద్దరూ యుద్ధం చేయవలసిఉంటుంది. వాలి ఒకసారి రాముడిని ఈశ్వరుడిగా ఒప్పుకున్న మరుక్షణం యుద్ధ ప్రసక్తే రాదు. కేవలం దండనే ఉంటుంది. అక్కడ రాముడు న్యాయాధీశుడు, శత్రువు కాదు. పైగా వాలితో వ్యక్తిగత పరిచయం గాని, వ్యక్తిగత ద్వేషం కానీ లేదు. కనుక శత్రువు కాదు. యుద్ధం చేసే ప్రసక్తే రాదు. సుగ్రీవుడు వాలిపై చేసిన ఆరోపణలను విని,

అవి వాస్తవాలని గ్రహించి వాలిని దండించాడు. సర్వజ్ఞుడైన ఈ న్యాయాధీశుడికి ముద్దాయి నుండి స్వపక్ష వివరణ వినవలసిన పనిలేదు.

'వాలీ!, తమ్ముడి భార్య (మరదలు), కొడుకు భార్య(కోడలు), చెల్లెలు, కుమార్తె, ఈ నలుగురికీ ఒకే స్థానం ఇవ్వబడుతుంది. వీరి మీద కామదృష్టి వేసిన వారిని చంపితే పాపం అంటదు' అన్నాడు రాముడు. మరికొందరు-వాలి పశువు, ఈ వావి వరుసల సంబంధాలు అతడికి అంటగట్టడం ఏమి భావ్యం అంటారు. అప్పుడు ఇక నన్ను పశువును చంపినట్లు ఎందుకు చంపావనే ప్రసక్తే రాదు. క్షత్రియులకు వేట (మృగయా వినోదం) ధర్మమే. పులిని చెట్టు చాటు నుండే చంపుతారు. లేక ఇతర రామాయణాల ననుసరించి అతడి మెడలో ఉన్న మాల కారణంగా ఎదురుగా వచ్చినవాడి బలంలో సగం అతడిలోకి ప్రవేశిస్తుంది అనేట్లయితే, క్షత్రియుడు సామ-దాన-భేద-దండోపాయాలలో ఏ మార్గాన్నయినా గెలవ వచ్చు అనే నీతి ప్రకారం చెట్టు చాటునుండి చంపటం కూడా న్యాయమే అవుతుంది.

'మూఢ తోహి అతిసయ అభిమానా।
నారిసి బావన కరసిన కానా॥'

మూర్ఖుడా!, నీవు అహంకారివి, నీ భార్య చెప్పినా వినలేదు- అన్నాడు రాముడు. దానితో రాముడి సర్వజ్ఞత్వం ప్రకటితమైంది. రాముడు పరమాత్మ అని తెలిసి, సుగ్రీవుడు ఆయనను ఆశ్రయించాడు అని తెలిసి కూడా అతడిని 'తృణం'తో సమానంగా ఎంచటం, వాలి అహంకారాన్ని సూచిస్తుంది. పరమాత్మ తన భక్తుడి అవమానాన్ని తనదిగా ఎంచుతాడు. తార నోటి వెంట ఆ మాటలు పలికించింది రాముడే అన్న విషయం వాలికి తెలిసి వచ్చింది. రాముడి ఈశ్వరత్వం తెలిసిన మరుక్షణం వాలి శరణాగతుడై ఆయన సమక్షానికి వచ్చి తన తప్పిదాలను ఒప్పుకొని క్షమాపణ వేడకపోగా, శరణాగత భక్తుడైన సుగ్రీవుడిని దండించడానికి వెనుకాడలేదు.



వాలికి అతడి అహంకారమే శత్రువు. అతడి భార్య రాముడి ఈశ్వరత్వాన్ని తెలియజేసినప్పుడు, వాలి కూడా దానిని సమర్థించాడు. కాని అక్కడా శరణాగత భావంలేదు సరికదా కేవలం నీకన్నా నేనేమి జ్ఞానంలో చిన్నవాణ్ణి కాదు అని తార వద్ద నిరూపించ ప్రయత్నించే ప్రక్రియే కనిపిస్తుంది. కానీ జ్ఞానం యొక్క పరిభాష అహంకారరాహిత్యంగా చెప్పబడిందే కాని, అన్యుల కన్నా ఎక్కువ విషయసేకరణ కాదు. నేను జ్ఞానిని అనే అభిమానం కూడా అజ్ఞానమే. అటువంటి జ్ఞానం (అహంభావం) ఉన్నప్పుడు ఈశ్వర సమదర్శిత్వ ప్రవర్తనను నిర్దేశిస్తూ కూర్చుంటాడే గానీ, శరణాగతుడై అహంకార ప్రక్షాళన చేసుకోడు. తారలోని భగవత్ భక్తిని పిరికితనంగా వర్ణించి, తన అహంకారానికి జ్ఞానమనే మసిపూసి, సమత్వ సిద్ధాంతాన్ని మట్టికలప ప్రయత్నించాడు వాలి. పరమాత్మ సముడు కనుక పాప పుణ్యాలను లెక్కించడు. అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే, వ్యక్తులు మరికాస్త ఉత్సాహంతో నిశ్చితులై పాపం చేస్తారు.

అందుకే కర్మ ప్రధానమైన ఈ లోకంలో ఎవరు చేసిన కర్మల ఫలితం వారు అనుభవించక తప్పదు. పరమాత్మ సముడు కనుక ఎవరినీ వారి పాప విషయంలో శిక్షించడు, పుణ్య విషయంలో సన్మానించడు. కానీ స్వయంగా వాడి కర్మే వాణ్ణి శిక్షిస్తుంది లేదా ఉత్తమగతిని ఇస్తుంది. ఈశ్వరుడి సమత్వస్థితిని వర్ణించింది, జీవుడిని కూడా ఆ స్థితికి ఎదిగి ఎవరి పాపపుణ్యాలను ఎంచక అందరినీ సమంగా ప్రేమించగల స్థాయిని సాధించమనే గానీ, సమత్వ సిద్ధాంతాన్ని అడ్డుపెట్టుకొని పాడైపొమ్మని కాదు. వాలి లాగా ఆలోచించేవాడు అభిమాని, మూర్ఖుడు అవుతాడే గాని జ్ఞానికాడు.

సునహు రామ స్వామీ సనచలన చాతురీ మోరీ।
ప్రభు అజహుమై పాపీ అంతకాలగతి తోరి॥

స్వామీ, నా అతితెలివి మీ ముందు పనిచేయలేదు. కానీ ఒకమాట-

మీరు నన్ను పాపి అన్నారు. ఒకప్పుడు పాపినే కాని ఇప్పుడు కాదు. అంతిమ క్షణంలో ఎవరి ఎదురుగా పరమాత్మ నిలిచి ఉంటాడో, అతడు పాపి ఎలా అవుతాడు? అన్నాడు వాలి. చివరికి అతడి శరీర బాధలన్నీ తొలగించి బ్రతికిస్తానన్నాడు స్వామి. వాలి ఒప్పుకోలేదు. 'జన్మజన్మల సాధన తరువాత కూడా మునులకు అంత్యకాలంలో నోటినుండి మీ నామం పలకదు. మీరు దర్శనమివ్వరు. నాకు ఈ రెండూ ప్రాప్తించాయి. మళ్లీ ఇటువంటి మరణం నాకు కావాలంటే మాత్రం లభిస్తుందా? కనుక ఇక నన్ను ఆపకండి' అంటూ వాలి అంగదుడిని స్వామికి అర్పించి ప్రాణాలు విడిచాడు. ఏనుగు కంఠం నుండి పూలమాల జారిపోతే, ఏనుగుకు ఎలా తెలియదో అలాగే ఏ బాధ లేకుండా సులభంగా వాలి ప్రాణాలు విడిచాడు. అతడికి ముక్తి లభించింది. (తు.రా).

**సుగ్రీవుడి రాజ్యం-భోగం :**

కిష్కింధానగరం నుండి తార మొదలైన స్త్రీలు విలపిస్తూ మరణించిన వాలి కొరకు వచ్చారు. రాముడు తారకు ఉపదేశం చేసి ఆవిడ దుఃఖాన్ని పోగొట్టాడు. (తు.రా).

సుగ్రీవుడు, అంగదుడు కలసి, వాలికి అంత్యక్రియలు చేశారు. లక్ష్మణుడు రామాజ్ఞతో వారిని వెంటబెట్టుకొని కిష్కింధా నగరానికి వెళ్లి, సుగ్రీవునికి రాజ్యాభిషేకం, అంగదుడికి యువరాజ్యాభిషేకం చేశాడు. రాజు రూపంలో తన దగ్గరకి వచ్చిన సుగ్రీవుడికి రాముడు అనేక రాజనీతి ధర్మాలు చెప్పి 'ఇక గ్రీష్మఋతువు వెళ్లి వర్షఋతువు ప్రవేశించనున్నది. ఈ మూడు నెలలు నేను ప్రవర్షణ పర్వతం మీద నివసిస్తాను. అంగదుడి సహాయంతో రాజ్యం చేయి. చాలా సంవత్సరాలు కష్టపడ్డావు. ఇప్పుడు సుఖపడు. కానీ నా పనిని మాత్రం మరచిపోకు. వర్షాకాలం కాగానే నా పని చేసిపెట్టు' అని బోధించి పంపాడు

**సుగ్రీవుని మైమరపు-రాముని కోపం :**

రాముడు, లక్ష్మణుడితో పాటు ప్రవర్షణగిరి గుహలో వర్షఋతువు



గడిపాడు.(వా.రా.) ఆ నాలుగు నెలలు నారదుడి సలహాపై స్వామి నవరాత్రి ఉపాసన చేసాడు. (దే.భా.) ఈ సమయంలోనే శివుడి నుండి రాముడు ధనుర్బాణాలను పొందాడు (శివపురాణం). సింహారూఢ భగవతి నుండి విజయవరం పొందాడు.

వర్షఋతువు వెళ్లిపోయింది. శరదృతువు కూడా ప్రవేశించింది. కానీ ఇంకా సుగ్రీవుడు రాకపోవడంతో రాముడు కోపంతో

సుగ్రీవ హు సుధిమోరి బిసారీ। సావా రాజ కోసపుర నారీ॥
జహిం సాయక మారా మైబాలీ। తెహి సరహతౌ మూఢ కహ కాలీ॥

'లక్ష్మణా, రాజ్యాన్ని-ధనాన్ని-భార్యను పొందిన సుగ్రీవుడు నన్ను మరిచాడు. వాలిని చంపిన బాణంతోనే రేపటిలోగా ఆ మూర్ఖుడిని కూడా చంపుతాను' అన్నాడు రాముడు.

ఆ నాలుగు నెలలు స్వామి విరహంతో బాధపడి, సహాయం చేస్తా నన్న సుగ్రీవుడు రాకపోవటంతో ఎంత బాధకు లోనైనాడో పై వేదమంత్రంలో కనిపిస్తుంది. తినడానికి తిండి, నిలవడానికి నీడలేక కొన్ని సంవత్సరాలుగా తన పరివారం నుండి దూరమై అరణ్యజీవితం గడుపుతున్న సుగ్రీవునికి, స్వామి నిత్యజీవితావసరాలతో పాటు సమస్త భోగభాగ్యాలను, పరివారాన్ని అందించి, శాశ్వతంగా శత్రురహితం చేసిపెట్టి, వెంటనే తనపని చేయమనక, నాలుగు నెలల విశ్రాంతి తర్వాత చేయమన్నా అందుకు పూనుకోని స్వార్థిని ఏమనాలి? ఈ మాటలు స్వామి లక్ష్మణుడితోనే ఎందుకు అన్నాడు? ప్రస్తుతం అతడే రాముడి వద్ద ఉన్నాడనే విషయం పక్కన పెడితే, సుగ్రీవుడి కోసం ఎన్నో చేసిపెడితే, అతడు రాముని కార్యాన్ని మరిచాడు. కానీ లక్ష్మణుడు రామకార్యం కొరకు సుగ్రీవుడు పొందినవన్నీ విడిచాడు. ఎన్ని తర్కాలిచ్చినా యుగయుగాల వరకు వాలి వధ అధర్మమనే ఎవరో ఒకరు అంటూనే ఉంటారు. అటువంటి కళంకాన్ని కూడా సుగ్రీవుని కొరకు

రాముడు భరిస్తే, అతడు ప్రత్యుపకారంగా చేసిందేమిటి? ఇంత మిత్రద్రోహానికి పాల్పడిన సుగ్రీవుడిని రేపు చంపుతానంటాడు స్వామి. అంటే రేపటిలోగా అతడు రాముడి సన్నిధికి వస్తే, అతడిని వధించే ప్రసక్తే రాదు. రేపు రేపుగానే ఉంటుంది. అదిరాదు. వాడిని ఇప్పుడే సంహరిస్తాను అని కోపంతో బయలుదేరిన లక్ష్మణుడిని వారిస్తూ 'త్వరపడకు అతడికి కాస్త నచ్చజెప్పి తీసుకురా' అంటాడు.

స్వార్థపరుడైన సుగ్రీవుడు స్వామి కార్యం మరిచినా, నిష్కాముడైన హనుమంతుడు మాత్రం తన రాజుకు రామకార్యాన్ని గుర్తు చేసాడు. ఆయన అనుమతితో హనుమంతుడు నలుదిక్కులకు వార్తాహరుల ద్వారా వానరవీరులందరినీ త్వరగా కిష్కింధానగరానికి రమ్మని వార్తనంపాడు.

'రామ చరణ దృఢప్రీతి కరి బాలి కీన్హ తను త్యాగ'

దృఢంగా రామచరణాల మీద మనసును ప్రేమను నిల్పి వాలి శరీరాన్ని త్యాగం చేశాడు. ఆ తర్వాత రాజ్యానికి వచ్చిన సుగ్రీవుడు మాత్రం భోగాలలో మునిగిపోయి రామకార్యం మరిచాడు. వాలిని కాలబాణంతో మేలుకొలిపిన రాముడు సుగ్రీవుడిని మేలు కొలపటానికి సాక్షాత్తు కాలస్వరూపుడైన లక్ష్మణుడిని పంపాడు.

అవతారిక :- దారికి వచ్చిన సుగ్రీవుడు ఏం చేశాడు? అతని సైన్యంలో రామకార్యం చేయగల సమర్థుడెవడు? అటువంటి సమర్థుడిని రాముడు గుర్తించి తన కార్యాన్ని అతడికే అప్పగించగలిగాడా? వేదమంత్రాలు రామ కథను ముందుకు నడిపిన విధానాన్ని తెలుసుకుందాం.

**మంత్రాలు 66, 67, 68 :**

**క్రతూయంతి క్రతవో హృత్సుధీ తయో వేనంతి వేనాః పతయంత్యా దిశః। న మర్డితా విద్యతే అన్య ఏభ్యో దేవేషు మే అధికామా అయంసత ॥** (ఋగ్: 10-64-2)



**ప్ర వో వాయుం రథయుజం పురంధింస్తోమైః కృణుధ్వం సఖ్యాయ పూషణమ్॥ తే హి దేవస్య సవితుః సవీమని క్రతుం సచంతే సచితః సచేతసః॥** (ఋగ్: 10-64-7)

**త్రిః సప్త సస్రా నద్యో మహీరపో వనస్పతీ న్పర్వతాగ్ం అగ్నిమూతయే। కృశానుమస్తౄన్ తిష్యం సధస్థ ఆ రుద్రం రుద్రేషు రుద్రియం హవామహే॥** (ఋగ్: 10-64-8)

తాత్పర్యం :- సత్ సంకల్పంతో నా సేవ చేయాలని ఇచ్ఛగించేవారు, బుద్ధిమంతులు వానరరూప దేవతలు నా కార్యార్థమై అన్ని దిక్కులకూ వెళతారు. నా కోరిక తీరుస్తారు.

ఓ దేవతలారా! మీ మధ్యలో శరీరాన్ని ధరించి ఉన్న వాయుదేవతను మిత్రుడిలాగా నా కార్యం నెరవేర్చగలందులకు స్తుతిస్తున్నాను. ఆయన సవితా దేవతా లోకంలో నా సంకల్పాన్ని పూర్తి చేయగలడు. సహృదయులు ప్రార్థించినపుడు ఆ సజ్జనపురుషుడు తప్పక నా పని చేసిపెడతాడు. ఇరవై ఒక్క నదులను, సముద్రాలను, మూలికలను, పర్వతాలను, అగ్నిని, కాలాగ్నిని స్వరూపంగా కలవాడు, నక్షత్ర మండలంలో స్థితమై ఉండేవాడు, అన్ని లోకాలలోనూ నివసించేవాడు, తన గర్జనతో బ్రహ్మాండాన్ని కంపింప చేసేవాడు, రుద్రులందరిలో హనుమత్‌రూప రుద్రుడు, రాక్షసులను సంహరించగల సమర్థుడు అయిన హనుమంతుడిని నా కార్యార్థం ఆవాహన చేస్తున్నాను.

క్రోధాతురుడైన రామానుజుడు నగర ద్వారం వద్దకు వచ్చాడనే సమాచారం అందగానే సుగ్రీవుడు భయంతో వణికిపోయాడు. తాను ఆయన ముందుకు వెళ్లే ధైర్యం చేయలేకపోయాడు. తారను వెంటబెట్టు కొని వెళ్లి లక్ష్మణుడిని ప్రసన్నుడిని చేసుకునే ఉపాయం చూడమని హనుమంతుడికి చెప్పాడు.

వ్యాఖ్యానం :- అనేక బలహీనతల మధ్య కూడా సుగ్రీవుడిలో ఒక గొప్ప గుణం కనిపిస్తుంది. ఆ ఒక్కగుణమే అతడిని జీవితంలో అనేకసార్లు రక్షించింది. వ్యక్తులలో క్షమతను గుర్తించి వాళ్లను ఎన్నుకోవడం, వారు ఏఏ పనులు సమర్థవంతంగా నెరవేర్చగలరో ఎరిగి వారికి ఆ పనులు ఒప్పజెప్పగలగడమే ఆ గొప్ప గుణం. వాక్పటిమ, ధైర్యం, శౌర్యం, సహనశీలత, శాంతం, వప్పజెప్పబడ్డ పనిని నిర్వర్తించడంలో అవసరమైతే తన అహంకారాన్ని, వ్యక్తిత్వాన్ని కరిగించగల కళ ఎరిగిన హనుమంతుడిని ఇటువంటి పనులలో నియోగిస్తాడు సుగ్రీవుడు. రామలక్ష్మణులను మొదటి సారి చూసినపుడు కూడా హనుమంతుడిని వినియోగించి రాముడి మిత్రత్వాన్ని పొంది లాభపడ్డాడు సుగ్రీవుడు. కానీ ఈసారి ఒంటరిగా కాక తారను కూడా వెంటపంపాడు. విచిత్రమైన ఈపని మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. విశ్వవిఖ్యాత వైరాగ్యవంతుడైన లక్ష్మణుని సానుకూలం చేసుకోవటానికి మదవిహ్వాలాక్ష అయిన తారను పంపటం అసంగతంగా కనిపిస్తుంది. హనుమంతుడు మొదటి నుండి ఉభయపక్షాలకు మధ్యవర్తిగా ఉన్నాడు. రెండు పక్షాలవారు ఆయనను విశ్వసిస్తారు. కనుక ఇరుపక్షాలలో ఎవరికి ఎదుటి పక్షంవారి పైన భ్రాంతి, అనుమానం ఉత్పన్నమయినా దానిని తీర్చే బాధ్యత హనుమంతుడిది. ఈవైపు ఆయన కిష్కింధ రాజ్యమంత్రి. ఆ ప్రక్కన అయోధ్యనగర రాజుకు నమ్మినబంటు. రెండువైపులా సఖ్యాన్ని కాంక్షించే ఆయన నిస్వార్థపరుడు. కానీ ఆయన వెంట తారను ఎందుకు పంపినట్లు?

తనకు పట్టాభిషేకం చేయటానికి కిష్కింధ నగరంలోకి ప్రవేశించిన రామానుజుడిని సుగ్రీవుడు జాగ్రత్తగా గమనించి ఉంటాడు. ఆయన ఎక్కడెక్కడ స్త్రీలతో వ్యవహరించవలసి వస్తే అక్కడక్కడ సంకోచానికి లోనవడాన్ని గమనించి సుగ్రీవుడు హనుమంతుడి వెంట తారను పంపటం వల్ల లక్ష్మణుడి హృదయంలో కరుణను ఉత్పన్నం చేసి ఆయన క్రోధాన్ని తగ్గించవచ్చని అంచనా వేశాడు. అది నిజమని తేలింది కూడా.



తార, హనుమంతులు లక్ష్మణుడిని సమీపించి గట్టిగా రెండు చరణాలను పట్టుకున్నారు. తారను చూచిన లక్ష్మణుడిలో వెంటనే క్రోధఛాయలు అంతమైనాయి. ఇది మంచి సమయమని గ్రహించిన ఆంజనేయస్వామి తన మధుర గళమెత్తి రామకథాగానం ప్రారంభించాడు. గంధర్వులను కూడా సంగీత విద్యలో ఓడించగల ఆంజనేయస్వామి గళం రామభక్తిలో మునక వేయించగా శరీర తాదాత్మ్యాన్ని కోల్పోయిన లక్ష్మణుడిని చెరొక చేయి పట్టుకొని తార, హనుమంతులు సుగ్రీవుని అంతః పురములోనికి తీసుకునివెళ్లారు. లక్ష్మణస్వామిని చూసి భయంతో సుగ్రీవుడు తల్పంక్రింద దాక్కున్నాడు. అదే తల్పం మీద హనుమంతుడు లక్ష్మణుడిని కూర్చోబెట్టాడు. ఇదే సమయంగా భావించి సుగ్రీవుడు తల్పం క్రింద నుండి వచ్చి గట్టిగా లక్ష్మణుడి కాళ్లు పట్టుకున్నాడు. స్పృహ తెలిసేటప్పటికి లక్ష్మణుడు తాను సుగ్రీవుడి తల్పం మీద కూర్చొని ఉన్నానని, సుగ్రీవుడు చరణాలను పట్టుకుని ఉన్నాడని గ్రహించాడు. తరువాత అంతా శ్రీరామచంద్రస్వామి వద్దకు బయలుదేరారు.

లక్ష్మణసహితంగా సుగ్రీవుడు వెళ్లి స్వామికి చరణవందనమాచ రించాడు. తరువాత స్వామి అడగకుండానే తాను మాటతప్పిన కారణాన్ని ఎంతో మనోహరంగా చెప్పి, తన తప్పుకు చక్కని రంగు పూసి రాముని హృదయంలో స్థానం సంపాదించుకున్నాడు.

యహగున సాధన తేనహిహో ఈ।
తుమ్హ్మరీ కృపాపావ కోఇ కోఈ॥

'స్వామి సేవా పరాయణత్వం, సత్యవాక్ పరిపాలనాదులను సాధన వల్ల ఎవరు సాధించలేరు. అవి కేవలం మీ కృపవల్ల మాత్రమే అలవడతాయి' ఎందుకంటారా వీటన్నింటికీ మూలమైంది మీ మాయ. ఈ మాయ చాలా బలమైంది. మీ కృప లేనిదే దీని నుండి ఎవరూ బయటపడలేరు. దేవతలు,

మునులు, ఋషులు కూడా విషయవాసనలకు లొంగిపోతారు. ఇక నా విషయం అంటారా నేను పశువుని, కామిని. అందమైన స్త్రీ చూపులనే బాణాల చేత బాధించబడని వాడెవడున్నాడీ లోకంలో? క్రోధ రూప, అమావాస్య రాత్రిలో కూడా జాగరూకుడై నిలవగలవాడెవడు? లోభరూపపు ఉరిత్రాడు ఎవరి మెడకన్నా తగలకుండా ఉందా? అటువంటి వాడు ఎవడైనా ఉంటే వాడు మీతో సమానుడే ఓ రామా! అన్నాడు సుగ్రీవుడు.

సరే, జరిగినదేదో జరిగింది. ఇకనైనా సీతాన్వేషణకు ఏర్పాట్లు చేయి, అని స్వామి అంటూ ఉండగానే హనుమంతుడు దూతల ద్వారా పంపిన వార్తలనందుకుని నలుదిక్కుల నుండి అనేకమంది వానర భల్లూకాలు రావటం మొదలుపెట్టాయి. 'ఇది రామకార్యం. నా ఆజ్ఞ. మీరు నలుదిక్కులకు వెళ్లండి. సీతాన్వేషణ చేయండి. ఒక నెలరోజుల లోపల తిరిగి రండి. సీతజాడ తెలుసుకోకుండా అవధి దాటి వచ్చిన వారికి నా చేతిలో చావు మూడుతుంది' అని సుగ్రీవుడు చెప్పగానే ఉత్సాహంతో వానరులు బయలుదేరారు. అప్పుడు సుగ్రీవుడు అంగద, నీల, నల, హనుమ, జాంబవతాదులను ప్రత్యేకంగా పిలిచి రాముడి ముందు నిలిపాడు. వారిని తన కార్యం నెరవేర్చడం కొరకు పుట్టిన దేవతలుగా ఎరిగి, రాముడు వారిని స్తుతించడం పై వేదమంత్రంలో కనిపిస్తుంది. తరువాత హనుమంతుడిని ప్రత్యేకంగా రెండు మంత్రాలలో ఒకదానిలో వాయువుగాను, మరొకదానిలో రుద్రుడుగానూ, స్తుతించడం మనం చూడవచ్చు. అనేక పురాణాలలోను, రామాయణాలలోనూ హనుమంతుడిని వాయునందనుడిగాను లేక వాయువు అవతారంగాను, రుద్రనందనుడిగానూ లేదా రుద్రావతారంగానూ చూపించే కథలు కన్పిస్తాయి.

వానరులను నలుదిక్కులకూ పంపుతున్న సుగ్రీవుడు వారికి ప్రత్యేకంగా ఏ దిక్కున ఏరకం అరణ్యాలు, నదులు, పర్వతాలు ఎదురయ్యేది, ఎటువంటి రాక్షసులు, సిద్ధులు, చారుణులు, ఋషులు, ఆశ్రమాలు కన్పించేది



వివరంగా చెప్పటం చూచిన రాముడు ఆశ్చర్యంగా ఈ భూగోళానికి చెందిన ఇంత పరిజ్ఞానం నీకు ఎలా కలిగింది? నీవు ఏ పాఠశాలలో చదువుకున్నావు? అని అడిగితే 'స్వామీ!, ఇది పుస్తకజ్ఞానం కాదు, అనుభవజ్ఞానం. వాలి వెంటబడి తరమగా నేను తిరగని ప్రదేశం లేదు' అన్నాడు. మనకు ఈ సృష్టిలో ఏది ఎందుకు జరుగుతుందో తెలియదు. కానీ ప్రతి కర్మకూ ఒక నిర్దిష్ట ఫలం మాత్రం ఉంటుంది.

జద్యపి ప్రభు జానత సబబాతా।<br>
రాజనీతి రాఖత సురత్రాతా॥

దేవతారక్షకుడైన స్వామి సర్వజ్ఞుడై కూడా రాజనీతిని రక్షిస్తున్నాడు (సీత జాడ తెలుసుకోవటానికి అన్ని దిక్కులకూ వానరులను పంపుతున్నాడు) అంటాడు తులసి. అంతేకాదు హనుమంతుడిని ప్రత్యేకంగా దగ్గరకు పిలిచి తన వేలి ఉంగరాన్ని ఇచ్చినట్లుగా కొన్ని రామాయణాల లోనూ, ఏకాంతంలో సీతారాములు మాట్లాడుకునే కొన్ని మాటలు చెప్పినట్లుగా మరికొన్ని రామాయణాలలోనూ, సీత ఋష్యమూక పర్వతం మీద ఉన్న వానరుల మధ్య జారవిడిచిన వస్త్రం ఇచ్చినట్లుగా మరికొన్ని రామాయణాలలోనూ ఉన్నది.

సీతాపహరణం చేసింది రావణుడని, వాడు దక్షణదిశలో ఉన్న లంకలో ఉంటాడనే సమాచారం వాడు ఆమెను దక్షిణ దిశగా తీసుకెళ్లడం ప్రత్యక్షంగా చూచిన వాళ్లు చెప్పిన వార్తను బట్టి వానరులను వివిధ దిక్కులకు పంపటం వ్యర్థం. పైగా దక్షిణ దిక్కుగా కూడా అంగదాది వానరులనందరినీ పంపవలసిన పనికూడా లేదు. హనుమంతుడొక్కడే ఈ కార్యం చేయగలడని రాముడికి స్పష్టంగా తెలుసు. కనుకనే చిహ్నాలన్నీ అతడికి ఇచ్చాడు. సీతకు అందించవలసిన సందేశం కూడా ఆయనకే చెప్పాడు. మరి ఇక ఈ ఆర్భాటం దేనికి?

సీతారాములు అభిన్నతత్త్వం. అలా విడదీయరాని ఏకతత్త్వాన్ని మోహరూపి రావణుడు విడదీశాడు. మోహం కారణంగానే భేదం, భిన్నత దర్శనమిస్తాయి. అయితే విడదీయలేని తత్త్వాన్ని మోహం మాత్రం ఎలా విడదీసింది? నిజానికి దొంగిలించబడింది మాయాసీతే. తాత్త్వికంగా ఇది అసత్యమే అయినా వ్యావహారికంగా సత్యమై కూర్చుంది. అద్వైత సిద్ధాంతం ప్రకారం సృష్టి మిథ్య అయినా ఈ మాయాబంధం వదలడం చాలా కష్టం. వాస్తవిక సీతాపహరణం జరగకపోయినా అరణ్యకాండ నుండి కిష్కింధాకాండ వరకు ఆవిడ సమాచారం కొరకు పడిన ప్రయాస, విశాల సేనను కదిలించడం, ఇకముందు జరగబోయే సేతుబంధనం, లంకా యుద్ధం, చివరకు ఏనాడు విడిపోని సీతారాముల కలయిక, ఎంత చిత్రం!. కానీ జీవిత సత్యాలు ఇలాగే ఉంటాయి. సత్యం సరళమై కూడా చాలా కఠినమౌతుంది. పరమాత్మ దగ్గర ఉండికూడా దూరం అనిపిస్తాడు. బుద్ధికి ఈ సత్యం అర్థమైనా సంస్కారం మాత్రం ఇందుకు ఒప్పుకోదు.

భ్రాంతి కళ్లకు కనిపిస్తుంది. ఏ వ్యక్తి అయినా వాక్కుద్వారా (ఉపదేశంతో) దాన్ని తొలగిద్దామని ప్రయత్నిస్తే మాత్రం సాధ్యం కాదు. వినేవాడికి ఇంకా ఎక్కడో సంశయం ఉండిపోతుంది. చెవుల కన్నా కంటినే మనం ఎక్కువ ప్రామాణికంగా భావిస్తాం. నేను నా కండ్లతో చూశాను అనే మాటకే, విన్నాను అనే మాటకన్నా ఎక్కువ విలువ ఉంటుంది. కాబట్టి ఈ కండ్లకు కనిపించిన భ్రాంతిని కండ్లముందు నుండి తొలగించినపుడే జ్ఞానం కలుగుతుంది.

దాహమైనవాడు తీరికగా కూర్చోలేడు. వ్యగ్రతతో ప్రతిచోటా నీళ్లకోసం వెతుకుతాడు. శక్తి నశించినపుడు దీనుడై జలం యాచిస్తాడు. సాధకుడి స్థితి కూడా ఇదే. భక్తిని (సీతను) భగవంతుడిని (రాముడిని) పొందాలనే వ్యగ్రతతో సాధకుడు ఏమైనా చేయడానికి సిద్ధపడతాడు. తన ప్రయత్నం చేత వారు భక్తిని పొందలేకపోయినా వారి ప్రయాస వ్యర్థం



మాత్రం కాదు. భౌతిక కర్మలకు, ఆధ్యాత్మిక సాధనకు ఉండే తేడా ఇదే. భౌతికకర్మ ఏ మాత్రం తేడా లేకుండా పూర్తి అయినపుడే ఫలితాన్ని ఇస్తుంది. సకామ వైదిక కర్మలు కూడా ఈ పరిధిలోకే వస్తాయి. త్వష్ట, ఇంద్రవధను చేయగల కుమారుడి కోసం యజ్ఞం చేస్తే మంత్రలోపం వల్ల ఇంద్రుడి చేత మరణించే పుత్రుడు పుడతాడు.

భక్తిమార్గంలో చేసే సాధనలో కర్మకన్నా భావానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. సాధనలో ఎన్ని లోపాలున్నా భావన ప్రేమమయంగా అన్యచింతన లేక పరమాత్మ ప్రాప్తి కొరకు వ్యగ్రుడై ఉంటే చాలు సిద్ధి కలుగుతుంది (స్వల్పమప్యస్య ధర్మస్య......)

ఒక వ్యక్తిని వెతకాలంటే ఆ వ్యక్తి ఏ దిశలో తప్పిపోయాడో అటే వెళ్లి వెతకాలి. కానీ భక్తిని వెతుకుతూ ఏ దిశకు వెళ్లాలి? పైగా దక్షిణానికి వెళ్లిన వానరులలో కూడా ఒక్క హనుమంతుడికి తప్ప గమ్యం చేరగల సామర్థ్యం ఎవరికీ లేనపుడు దక్షిణానికి వెళ్లినవారి ప్రయత్నం కూడా ఇతర దిక్కులకు వెళ్లినవారి లాగా వ్యర్థం అయింది అనవలసివస్తుంది. కానీ చివరకి వానరులందరూ లంకలో భక్తిని (సీతను) దర్శించగలిగారు. కనుక సరియైన మార్గం దొరకని సాధకులైనా సరే, అసమర్థులైన సాధకులైనా సరే కేవలం వారు మనోశుద్ధి గలవారైతే చాలు రామకరుణకు పాత్రు లౌతారు.

భక్తిలోనే కాక రాజనీతిలో కూడా రాముడు ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు అనవలసివస్తుంది. రెండు సేనల మధ్యన ఎన్ని లక్షల మంది సైనికులు యుద్ధం చేసినా విజయంగానీ, పరాజయం గానీ రాజులకే లభిస్తాయి గానీ సైనికులకు కాదు. ఇప్పటివరకు సైనికులలో ఓడిన రాజుపై గల నిష్ఠ, గెలిచిన రాజువైపుకు మారుతుంది. ఈ పద్ధతిని మార్చి రాముడు వానరుల నిష్ఠను రాజుపై గాక సిద్ధాంతంపై నిలిచేలా చేశాడు. అన్యాయాన్ని చేసే రాజును వ్యతిరేకించాలి అనేది సిద్ధాంతం. (బలహీనుడైన

రాజును వ్యతిరేకించటం కాదు) అటువంటి వాడిని దేశద్రోహి, మిత్రద్రోహి అనడం మిథ్యావాదన. విభీషణుడు రావణుడిని విడిచాడు, ఎందుకు? అతడు బలహీనుడైన రాజనా? లేక అధర్మాత్ముడైన రాజనా? రాజనీతిని జననీతిగా మార్చదలిచాడు రాముడు. కనుకనే రాముడు నిర్బలులను, పీడితులను మిత్రులుగా చేసుకున్నాడు. ఆయన సేన కూడా సుసంజ్జనితము, ప్రశిక్షితము అయినది కాదు. అయినా వారి వెనుక ఆదర్శభావాల బలం ఉంది.

రాముడి సేనలో మిథిల, అయోధ్య సేనలలోవారు ఒక్కరు కూడా కనిపించరు. సీత కేవలం జనకుడి కుమార్తెగానీ, దశరథుడి కోడలు గానీ, రాముడి భార్యగానీ కాదు. పక్షి జటాయువు కుమార్తె, వానరుల తల్లి, రాక్షస విభీషణుడి సోదరి; కనుకనే వారంతా ఈ అన్యాయాన్ని వ్యతిరేకించారు. ప్రాణాలొడ్డి యుద్ధం చేశారు.

సీతాప్రాప్తే రాముడి కార్యమైతే బలవంతుడైన వాలి స్నేహంతో ఆ పని జరిగిపోయేది. కానీ ప్రతి కోతియొక్క సానుభూతిని ఆయన పొందదలిచాడు. ప్రతి వానరుడికీ సీతను పోగొట్టుకోవటం వల్ల తను ఎంతగా మాతృవాత్సల్యం నుండి దూరమైనాడో తెలియాలి. అప్పుడు గానీ వారు యుద్ధాన్ని తమ కర్తవ్యంగా భావించలేరు. సుగ్రీవుడి ఆజ్ఞగా కాక తమ బాధ్యతగా వారు దానిని పూర్తి చేశారు.

ఆ వానరులకు మా వల్ల ఈ కార్యం కాదు అనే భావన కలగ కూడదు. ప్రతి ఒక్కరూ ఈ కార్యంలో ప్రవృత్తులు కావాలి. కనుక అసలు ఎవరి వల్ల ఈ పని కావలసి ఉందో ఆ మహానుభావుడు రాముడి చేత ప్రార్థించబడి, ఆయన మనోనుగత భావానుగుణంగా అందరికన్నా చివరిన వచ్చాడు. అప్పటి వరకూ అందరు వానరులూ వెళ్లిపోయారు. ముద్రికను మాత్రం ఆంజనేయస్వామికి ఇచ్చి అందరినీ శ్రీరాముడు సీతాన్వేషణకై పంపాడు.



**సీతాన్వేషణలో వానరులు :**

అవతారిక : సీతాన్వేషణ ఎలా సాగింది? వానరులు ఏ శక్తి సహాయం వల్ల తమ కష్టాల నుండి గట్టెక్కారు? 69వ మంత్రంలో ఈ వృత్తాంతాన్ని వేదమాత తెల్పబోతోంది.

**మంత్రం 69 :**

**సిన్ధోరివ ప్రవణే నిమ్న ఆశవో వృషచ్యుతా మదాసో గాతు**
**మాశత। శం నో నివేశే ద్విపదే చతుష్పదే2స్మే వాజాః సోమ**
**తిష్ఠంతు కృష్టయః॥** (ఋగ్: 9-69-7)

తాత్పర్యం :- ఒక నెలలో సీతను అన్వేషించగలమనే ప్రతిజ్ఞ నుండి చ్యుతులై, నదీప్రవాహం లాగా శీఘ్రగాములైన వానరులు సీతాన్వేషణలో పాతాళమార్గం ద్వారా నరకానికి వెళ్లిపోయినట్లయినారు. అప్పుడు వారు సోమరాజును స్తుతించారు. మాకు కల్యాణమగుగాక, మా శత్రువులు పరాజితులగుదురు గాక, ఇలా స్తుతించగా వారంతా ఆ బిలం నుండి బైటపడి భూమి మీదకి వచ్చారు.

వ్యాఖ్య : 'సేరీ రామ్-రామకీర్తి' మొదలైన రామాయణాల్లో, జంబూ అనేవాడు ఇంద్రశాపం వల్ల వానరుడైనాడు. అతడు వాలికి మిత్రుడు. సుగ్రీవుడు రాముడి చేత వాలిని చంపించాడని తెలిసి, జంబూ, సుగ్రీవుడికి వ్యతిరేకంగా అనేక వానరవీరులను సమీకరించటం మొదలుపెట్టాడు. సుగ్రీవుడు ఈ విషయం రాముడికి చెప్పగా, లక్ష్మణుడు జంబూకు ఉత్తరం వ్రాశాడు. అందులో రాముడిని విష్ణువు అవతారంగా స్వీకరించమని తెలియజేశాడు. ఆ ఉత్తరం తీసుకువెళ్లిన హనుమంతుడికి జంబూ స్పష్టమైన జవాబేమీ ఇవ్వలేదు. దానితో హనుమంతుడు అతడిని అతడి మంచంతో సహా రాత్రికి రాత్రే ఎత్తుకువచ్చాడు. రాముడిని చేరిన తర్వాత జంబూ ఆయనను అవతారపురుషుడిగా స్వీకరించాడు.

జాంబవంతుడు జ్యోతిష విద్య ద్వారా, సీత శరీర త్యాగం చేయాలనే సంకల్పాన్ని విడిచిందని, రావణుడు ఆవిడకు కేవలం నాలుగు ధనస్సుల దూరం వరకే వెళ్లగలడని చెప్పాడు. ఈ విషయంలోని నిజానిజాలు గ్రహించడానికి లంక వరకు ఎవరు వెళతారని రాముడు అడిగితే, అందుకు ఎవరూ సిద్ధం కాలేదు. చివరికి ఆంజనేయుడు, తాను సీతాన్వేషణకు వెళ్లగలనంటాడు. మొత్తానికి వానరుల ద్వారా సీతాన్వేషణ మొదలయింది.

రామకాజ లయలీన మన- ' బిసరా తనకరచోహ'

వారి మనస్సు రామకార్యంలో లీనమైపోగా శరీరబాధలన్నీ మరిచి పోయారు. వారంతా అత్యుత్సాహంతో ముందుకు పరుగెత్తుతున్నారు. వాయుపుత్రుడు వెనకబడ్డాడు. కొండలు-గుట్టలు-నదీతీరాలు-పర్వతాలు-గుహలు-అరణ్యాలు వెతుకుతూ వానరులు ముందుకు సాగారు. మధ్యలో ఎవరైనా రాక్షసుడు కనిపిస్తే, వీడే రావణుడంటూ ఒకే దెబ్బతో నేల కూల్చేవారు. మళ్లీ రావణాసురుడైతే మా దెబ్బకెలా చస్తాడు అనుకునేవారు.

ముందున్నవారి ఉత్సాహం, శక్తి క్రమంగా సన్నగిల్లాయి. వెనకనున్న హనుమంతుడు ముందుకు వచ్చాడు. ముందు నడవడం నాయకత్వాన్ని సూచిస్తుంది. దీన్ని గౌరవప్రదంగా భావిస్తారు ప్రపంచ ప్రజలు. అది వారిలో అహంకారాన్ని పెంచుతుంది. కాని కొందరు ముందు నిలవడానికి భయపడతారు. ముందున్న వారికే కష్టం వస్తుందని కొందరి వాదన. వారిలో ఆత్మవిశ్వాసం తక్కువగా ఉంటుంది. ఇక వెనక నడవడాన్ని ప్రజలు పిరికితనంగా భావిస్తారు. కనుక ఇటు సన్మానం కోరుకునే పిరికివాళ్లు ముందు నడుస్తూ, ఆపద వచ్చినపుడు వెనుకకు చేరతారు. కానీ పవననందనుడి విషయంలో వెనుక నడవవలసివస్తే గ్లానిగానీ, ముందు నడవవలసి వస్తే అహంభావంగానీ లేని స్థితి కనిపిస్తుంది. స్వామి సేవే ఆయన చరమ లక్ష్యం. స్వామి కార్య నిర్వహణలో తనకు కళంకమంటినా, సమసిపోయినా సరే, ఆయన దాన్ని లక్ష్యపెట్టడు. సీతాన్వేషణలో



అందరికన్నా మించిన ఉత్సాహం హృదయంలో ఉన్నప్పటికీ, ఆ ఉత్సాహాన్ని ప్రదర్శించని నిరభిమానత ఆయనది. స్వయంగా ఆ కార్యాన్ని స్వామి తన భుజస్కంధాల మీద పెట్టేవరకు ఆయన ముందుకు రాలేదు. ఒకవేళ ఆయనే ముందుకు వస్తే, హనుమశ్శక్తి సామర్థ్యాలు ఎరిగిన తక్కిన వానరులు నిరుత్సాహపడిపోతారు. వెనుక వచ్చిన హనుమంతుడికి మాత్రం సమస్తమూ లభించింది. అందరు వానరుల వెనుక ఉన్నప్పుడు ఆయన వాయునందనుడు. వాయువు లాగా వారిని ముందుకు తోస్తాడు. ఏదైనా కష్టం సహించవలసివచ్చినపుడు ముందు ఉండే ఆయన హనుమంతుడు. ఇంద్రుడి వజ్రాయుధాన్నైనా సరే తన హనుమ (గవద)మీద సహించేవాడు.

వానరుల మనసు అత్యుత్సాహంతో నిండి ఉన్నంతకాలం వారు ముందుకు సాగారు. అపుడు వారి శరీరం మనస్సు చెప్పినట్లు విన్నది. కానీ ఆహారం లేక శరీరంలో ఉత్సాహం తగ్గటం వల్ల వారి మనసులు నీరసించాయి. మనం బలం అంతా ఉపయోగించి ఏదైనా పనిచేస్తే, బాగా అలసిపోవటం జరుగుతుంది. మనలో అవసర పరిస్థితి కొరకు దాచి ఉంచిన శక్తి అంతా ఒకేసారి ఖర్చయిపోగా వచ్చే ఇబ్బంది ఇది.

సీతాన్వేషణ అనే ఈ సాధనా ప్రక్రియలో వానరులు ఉత్సాహంతో యువకుడైన అంగదుడి నేతృత్వంలో ముందుకు సాగారు. కనిపించిన దుష్ట సంస్కారులను (రాక్షసులను) సంహరించారు. వీలయిన చోట్ల సత్సంగం (ఋషుల కలయిక) చేశారు. కాస్త జ్ఞానిలా కనిపించిన వారినల్లా భక్తి (సీత) జాడ అడిగారు. కానీ ఈ యువనాయకుడి ఆరంభ శూరత్వం ఎంతవరకు నిలుస్తుంది? ఒక నెల రోజులలో భక్తిని (సీతను) కనుక్కుంటా మన్నారు. ఇలా ముందే సమయం నిర్ణయించుకోవటం సాధకుడు చేసే పొరపాటు. భక్తి రాముడి కృపతో లభించవలసి ఉన్నది. అప్పుడు ఫలానా సమయం లోపల అది లభించగలదని మనం ఎలా నిర్ణయించగలం? అందుకే నదీ ప్రవాహం లాగా శీఘ్రగాములైన వానరుల వేగం తగ్గి ఇక

నడవలేని స్థితికి వచ్చారంటుంది వేదమంత్రం.

వారి పరిస్థితి చూసిన హనుమంతుడు, 'ఇక వీరికి అన్నపానాలు లభించకపోతే మరణించగలరు' అనుకున్నాడు. సాధకులందరికీ ప్రస్తుతం తమ స్వార్థమే గుర్తుంది. ఒక్క ఆంజనేయస్వామికే రామకార్యం మీద మనసు ఉంది. మరి ఆయనను ఆకలి దప్పులు ఎందుకు బాధించలేదూ? స్వామివారు ఆయనకు రామనామాంకిత ఉంగరం ఇచ్చారు. శరీరం పైన కౌపీనం తప్ప మరొకటి లేని హనుమంతుడు దాన్ని ఏం చేయాలో, ఎక్కడ ఉంచాలో తెలియని సందిగ్ధావస్థలో పడ్డాడు. దానిని తన వేలికి తొడిగితే అవమానించినట్లవుతుంది. మరింకేదైనా అంగానికి దాన్ని అలంకరిద్దా మంటే, ఏ నాటికీ ఆభూషణమంటూ లభించని అంగం ఒక్క నాలికే ఆయనకు కనిపించింది. దాన్ని వెంటనే నోటిలో పెట్టాడు. రామనామం నోట్లో ఉండగా ఇక ఆయనకు ఆకలెక్కడిది? బుద్ధిమంతుడైన యాత్రికుడు యాత్రలో తనకు కావలసిన ఆహారాన్ని ముందే సమకూర్చు కుంటాడు. ఈ ఆధ్యాత్మిక సాధనలో సాధకుడికి కావలసింది రామనామాహారం.

బ్రహ్మాంబోధి సముద్భవం కలిమల ప్రధ్వంసనం చావ్యయం।
శ్రీమచ్ఛంభు ముఖేన్దు సుందర వరే సంశోభితం సర్వదా॥
సంసారామయ భేషజం సుఖకరం శ్రీ జానకీ జీవనం।
ధన్యాస్తే కృతినః పిబన్తి సతతం శ్రీరామనామామృతమ్॥

వేదసముద్ర మథనం నుండి పుట్టిన అమృతమే రామనామరసం. ఇది భవరోగ నివారణకు, తృప్తినివ్వటానికి పనికి వస్తుంది. సదాశివుడు సదా దాన్ని తన కంఠంలో ధరిస్తాడు. శ్రీరామ ప్రియ జానకికి ఇది జీవన సర్వస్వం. దానిని నిరంతరం పానం చేసే పుణ్యాత్ములు ధన్యులు.

స్వయంగా తృప్తుడై ఉన్నప్పటికీ, హనుమంతుడు వానరుల బాధ తీర్చటానికి వ్యగ్రుడైనాడు. దగ్గరలో కనిపించిన పర్వతం మీదకి ఎక్కాడు.



సమస్యకు సరియైన సమాధానం లభించనపుడు దగ్గరలో ఉన్న పర్వతం ఎక్కడమంటే ఈ సమస్యలన్నింటికీ అతీతమైన ఎత్తుకు ఎదిగి చూడాలి. అప్పుడు పరిష్కారం లభిస్తుంది.

దగ్గరలో ఉన్న గుహలోనికి కొన్ని పక్షులు వెళుతూ ఉండటం, కొన్ని బైటికి వస్తూ ఉండటం ఆంజనేయస్వామికి కనిపించింది. లోపలికి వెళ్లే పక్షుల రెక్కలు పొడిగానూ, లోపలి నుండి వచ్చే పక్షుల రెక్కలు తడిగానూ ఉండటం చూశాడు.

సాధనలో ఇటువంటి సూక్ష్మదృష్టి చాలా అవసరం. అతికష్టం మీద వానరులనందరినీ కొండమీదకి చేర్చిన తర్వాత కూడా అంగదుడు వారిని గుహలోకి నడపడానికి సిద్ధపడలేదు. ఒకసారి తన నాయకత్వంలో విజయం సాధించలేకపోవటంతో ఇక ఆయనకు తన మార్గదర్శకత్వం మీద నమ్మకం పోయింది. స్వయంగా మార్గం ఎరగనివాడు ఇతరులకేమి మార్గం చూపగలడు? పైగా ఒకప్పుడు తన తండ్రి వాలి గుహలోకి ప్రవేశించిన కారణంగానే, వాలి సుగ్రీవులిద్దరిలోనూ శత్రుత్వం ఏర్పడింది. కనుక తాను గుహలో ప్రవేశించటానికి వెనకాడాడు.

ఇంద్రుడి వజ్రాయుధాన్ని చిన్నతనంలోనే తన గడ్డం (హను) మీద సహించిన హనుమంతుడు ముందుకు నడవగా, ఆయన తోకను అంగదుడు పట్టుకుని వెనుక నడిచాడు. అలా వానరులందరూ, ఒకరి తోకనొకరు పట్టుకుని ముందుకు సాగారు. శివుడు విశ్వరూపుడు. ఆయన అవతారం హనుమంతుడు. రజోగుణాధిక్యత గల అంగదుడి నాయ కత్వంలో కన్నా, విశ్వాసాధిక్యతగల హనుమంతుడి నాయకత్వంలోనే సాధన బాగా సాగగలదు. అంతరంగం అనే చీకటి గుహలో, భగవత్ కృప అనే అమృత జలం దాగి ఉంది. దానితో తృష్ణ తీరుతుంది. కానీ రజోగుణ సాధకుడికి గుహలో చీకటి తప్ప మరొకటి కనపడదు. ఈ భగవత్కృప ప్రస్తుతము ప్రత్యక్షం కాదు గనుక వారికి అంతరంగపు

చీకటిలోనికి చొచ్చుకు పోవాలంటేనే భయం వేస్తుంది. కేవలం విశ్వాసమే మనను అక్కడకు చేర్చగలదు. చీకట్లోనూ, వెలుతురులో కూడా సమానంగా పరమాత్మ రాజ్యమేలుతాడని కేవలం విశ్వాసానికే తెలుసు.

రామనామ మణిదీపధరు జీహ హరీద్వార।
తులసీ భీతర బాహెర రహు, జో చాహసి ఉజియార॥

రామనామమనే మణిదీపాన్ని నాలుక అనే గడప మీద ఉంచినపుడు శరీరం అనే ఇంట్లోకి, బైటికి కూడా వెలుతురు వస్తుంది. దీపాన్ని లోపల ఉంచితే ప్రాణవాయువు సరిపోక ఆరిపోవచ్చును. బైటపెడితే గాలికి ఆరిపోవచ్చును. అందుకే దాన్ని మధ్యలో ద్వారం వద్ద పెట్టాలి. ఇలాంటి దీపం నాలిక మీద ఉన్న హనుమంతుడిని గుహలోని చీకటి ఏమి చేయగలదు?

లోపలికి వెళ్లిన వానరులకు అక్కడ ఒక స్వర్ణ నగరం, సరోవరం, పండ్లచెట్లు, ఒక చెట్టు క్రింద తేజోపుంజంలో వెలుగుతున్న ఒక తపస్విని కనిపించారు. వానరుల అలికిడికి కండ్లు తెరిచి ఆవిడ వారిని దగ్గరికి పిలిచి, వారి క్షుద్బాధా విషయం తెలుసుకొని ముందు ఆకలి, దాహం తీర్చుకోమన్నది. ఔను మరి!, ఆకలితో నున్నవాడికి సత్సంగం ఏమి రుచిస్తుంది?.

వానరులంతా ఆకలిదప్పులు తీర్చుకొని వచ్చిన తర్వాత ఆవిడ తన కథను ఇలా చెప్పింది. దేవతలు మయదానవుడికి హేమనిచ్చి వివాహం చేశారు. అతడికి హేమ వల్ల మండోదరి అనే పుత్రిక-దుందుభి, మాయావి అనే కుమారులు కలిగారు. మండోదరి రావణుడి భార్య అయింది. దుంధుభి, మాయావిలు వాలి చేతిలో చనిపోయారు. హేమదేవి కార్యార్థమై కొంతకాలం దేవలోకానికి వెళ్లిపోయింది. మయుడు దక్షిణ- పశ్చిమ వింధ్య పంక్తులలో ఉన్న ఋక్షబిల గుహలో ఈ స్వర్ణ నగరాన్ని నిర్మిస్తూ ఇక్కడే ఉండిపోయాడు. హేమ కొంతకాలానికి మేరు సావర్ణి కుమార్తె



స్వయంప్రభను మయుడి వద్దకు పంపింది. కానీ అప్పటికే మయుడు హేమ విరహంతో మరణించాడు. స్వయంప్రభకు వెనక్కువెళ్లి ఈ విషయం చెప్పే ధైర్యం లేక ఇక్కడే ఉండిపోయింది. (వా.రా. 4-52-1 నుండి 32)

ఆధ్యాత్మిక రామాయణాన్ని అనుసరించి విశ్వకర్మ కుమార్తె అయిన హేమ తన నృత్యంతో శివుడిని ప్రసన్నం చేసుకొని ఈ నగరాన్ని పొందింది. బ్రహ్మలోకానికి వెళ్లిపోతూ తన సఖి అయిన స్వయంప్రభతో 'నువ్వు ఇక్కడే తపస్సు చేసుకుంటూ ఉండు, త్రేతాయుగంలో రామదూతలు వచ్చినపుడు వారికి అతిథి సత్కారాలు చేయి' అని చెప్పింది.

పైవృత్తాంతం చెప్పిన స్వయంప్రభ ఆవచ్చిన వానరులే రామ దూతలని తెలుసుకున్నది. సీతాన్వేషణలో వారికి కలుగుతున్న నిరుత్సాహాన్ని తెలుసుకుని ధైర్యం చెప్పింది 'నేను కూడా మీలాగే సాధకురాలిని. మీరు భక్తిని వెతుకుతున్నవారయితే నేను భగవంతుడిని వెతుకుతున్న దాన్ని. మీరు నాకు భగవంతుడున్న స్థలాన్ని గూర్చి చెప్పారు. నేను మీకు భక్తి లభించే సాంకేతిక మార్గాన్ని వివరిస్తాను' సాధకులెప్పుడూ పరస్పర సహాయకులే. సాధకులు ఇలా కలుస్తూ ఉండటం వల్ల ఒకరి సమస్యలు ఒకరు విని అర్థం చేసుకుంటారు. పరస్పరం సలహాలిచ్చు కుంటారు. సాధకులంతా ఒకే స్థాయిలో ఉండరు. స్వయంప్రభ వానరుల కన్నా ఉన్నత స్థాయిలో ఉన్నది. ఆవిడకు భక్తి ప్రాప్తించింది. జ్ఞానరూపుడైన రాముడినే పొందవలసి ఉన్నది. వానరుల కండ్లముందు జ్ఞానరాశి రాముడున్నా హృదయంలో భక్తి లేని కారణంగా వారు ఆయనను చూస్తూ కూడా పొందలేకపోయారు. అందుకే భక్తి అన్వేషణ ప్రారంభమైనది.

జ్ఞానఫలం భక్తా, భక్తి ఫలం జ్ఞానమా అనే విషయం అనాది నుండి చర్చనీయాంశం అయింది. ఇవి రెండూ ఒకటి లేకుండా మరొకటి అపూర్ణాలని పెద్దల నిశ్చయం. సాధకుడు తన సంస్కారాన్ని బట్టి, అయితే

భక్తితో ప్రారంభించి, జ్ఞానానికి చేరుకుంటాడు లేదా జ్ఞానం నుండి ప్రారంభించి భక్తిని అందుకుంటాడు.

చివరకి స్వయంప్రభ భక్తి దేవి దర్శనం పొందడానికి ఒక చక్కటి మంత్రం ఉపదేశించింది. అది 'మూందహు నయన బిబర తజి జాహూ, వైహహు సీతహి జని పఛితాహూ! మీరు కండ్లు మూసుకోండి, గుహ విడిచి పెట్టండి. బాధపడకండి. తప్పక మీరు సీతను చూడగలరు'.

ఆవిడ చెప్పినవి నాలుగు విషయాలు

*1. సీత లభిస్తుంది. 2. పశ్చాత్తాపపడకండి.*

*3. కండ్లు మూసుకోండి. 4. గుహను విడిచి పెట్టండి.*

మనసులో సంశయం పెట్టుకున్న వ్యక్తి ముందుకు పోలేడు. సంశయశీలుడు ఏనాటికీ గమ్యం చేరలేడు. ఎందుకంటే, మళ్ళీ వెనక్కువస్తూ ఉంటాడు. లేదా భద్రత కోరుకునే వ్యక్తి కూడా సాధన చేయలేడు. 'ఈ ఇల్లు విడిచిపెడితే, గమ్యం చేరగలనే లేనో, మధ్యలో విశ్రాంతి నివ్వడానికి నాకు ఏదైనా స్థలం లభిస్తుందో లేదో' అని సంశయిస్తాడు.

*కబీరా ఖడా బజార్ మే లిఏ లుకాటీ హాథ్।*
*జోఘర్ ఫూంకే ఆప్‌నా చెలె హమారే సాథ్॥*

నా శిష్యులై నా వెంట ఆధ్యాత్మిక మార్గంలో నడవదలచినవారు, ఇదిగో ఈ కాగడా పట్టుకువెళ్లి మీ ఇండ్లను తగలబెట్టిరండి - అంటాడు కబీర్ దాస్.

సుదృఢ విశ్వాసం లేని వ్యక్తి సంసారాసక్తిని విడవలేడు. సుగ్రీవుడు వానరులకిచ్చిన నెలరోజుల గడువు తీరిపోయింది. ఇంతవరకు సీత జాడ తెలియలేదు. సీత జాడ తెలుసుకోకుండా సమయం దాటిన వారికి తన చేతిలో చావు మూడుతుందన్నాడు సుగ్రీవుడు.



*'భీతవ్యం తస్య సతతం రామస్యచ మహాత్మనః' (వా.రా. 4-49-9)*

దండంచడంలో కనికరం చూపని సుగ్రీవుడికి భయపడాలి. మహాత్ముడైన రాముడికి కూడా భయపడాలి. అంటాడు అంగదుడు. కానీ మళ్లీ 'ఇహాస్తినో నైవ భయం పురన్దరాన్న రాఘవాద్ వానర రాజతో2పివా (వా.రా. 4-53-26) - ఇక్కడ ఈ గుహలో మాత్రం ఇంద్రుడి నుండి గానీ, రాముడి నుండి గానీ, వానరరాజు సుగ్రీవుడి నుండి గానీ భయం లేదు' అంటాడు. అంటే అక్కడ పండ్లు తింటూ దాహం తీర్చుకుంటూ, ఎవరి భయం లేకుండా ఆ గుహలో సుఖంగా ఉండిపోవాలనే ఉద్దేశ్యం అంగదుడి మాటల్లో కనిపిస్తుంది. సాధనా మార్గంలో సుఖాన్ని, భద్రతను, ఆసక్తిని విడవకపోతే భక్తిగమ్యాన్ని చేరలేము. కనుక 'గుహను విడిచి పెట్టండి' అనే ఉపదేశం సార్థకం అయింది. 'సీత లభిస్తుంది అనే విశ్వాసాన్ని నిలుపుకోండి' అనే రెండవ ఉపదేశం కూడా సార్థకమయింది.

పశ్చాత్తాపం వెనక, భూతకాలంలో చేసిన తప్పుల స్మరణ ఉంటుంది. పాత తప్పులను సరిదిద్దుకుంటూ, ఆత్మనిరీక్షణలో భవిష్యత్తును నిర్ధారించు కుంటూ, వర్తమానంలో జాగరూకత కలిగి ఉండటం సాధకుడికి మంచిదే. కానీ అధిక పశ్చాత్తాపం క్రమంగా నిరాశను పెంచుతుంది. దాని నుండే జాగ్రత్త పడాలి. దారిలో వెళ్ళేటప్పుడు ఏదైన రాతికి కాలు తగిలి రక్తం కారితే దాన్నే చూస్తూ అయ్యో అమ్మో అనుకుంటూ కూర్చోవడమో లేదా ఆ రాయిని మోసుకువెళుతూ దారిలో కనిపించిన వారికందరికీ తన దుఃఖభరిత కథను చెప్పుకోవడం తగని పని. ఈ అనుభవం ఆధారంగా ఇక ముందు దెబ్బ తగలకుండా చూసుకోవాలి. అంతే. ఇప్పటివరకు సమయం వ్యర్థమైతే అయింది, ఇకనైనా భక్తి మార్గాన్వేషణలో పురోగమిస్తాను అనుకోవడమే భక్తి సాధన. దీనితో 'పశ్చాత్తాపపడకండి' అనే మూడవ ఉపదేశం సార్థకం అయింది.

ఆది గురువు దక్షిణామూర్తి అయిన శివుడు మూడునేత్రాలవాడైనా

ఎప్పుడూ కండ్లు మూసుకుని ధ్యానం చేస్తుంటాడాయన. వానరులకు కూడా స్వయంప్రభ కండ్లు మూసుకోమని ఉపదేశించింది. వ్యక్తి, భక్తిని బైటకాదు అంతర్ముఖుడై లోపల వెతకాలి. ఒకసారి అంతర్ముఖుడైన వ్యక్తికి భక్తి బైటకూడా సాక్షాత్కరిస్తుంది. బైట విషయవస్తు దృష్టి ఉన్నవాడికి మనస్సంతా చంచలమౌతుంది. ఇక భక్తి లభించేది ఎలా?

లౌకికంగా కన్నుకిచ్చిన ప్రాధాన్యత మరే ఇంద్రియానికి ఇవ్వరు. కానీ ప్రత్యక్షంగా దర్శించబడేవి అన్నీ సత్యం కావాలని ఏమీ లేదు. కన్ను మోసం చేసినట్లుగా మనను మరేదీ మోసం చేయదు. శివుడి మాటను ప్రమాణంగా కాక తన కంటినే ప్రమాణంగా స్వీకరించిన సతి శరీరత్యాగం చేయవలసివచ్చింది. మాయా జింక వెంట పరుగెత్తే రాముడిని చూసి మామూలు మనిషి అనుకోవడం వల్లే రావణుడు నశించాడు. మారీచుడు, మండోదరి, విభీషణుడు, కుంభకర్ణుల మాటలు విన్నా బాగుపడేవాడు. రావణుడు కేవలం తన కంటి చూపుకే ప్రాధాన్యం ఇచ్చి, సపరివారంగా సర్వనాశనం అయినాడు.

'సకల దృశ్య నిజ ఉదరమేలే సోవై నిద్రా తజిజోగి'

సమస్త విశ్వ ప్రపంచాన్ని తన కడుపులో దాచుకుని నిద్రవిడిచి, నిదురించే యోగి హరిపదాన్ని పొందగలడు - అంటాడు తులసి.

ఈ రకంగా తన నాలుగవ మహామంత్రోపదేశంలో స్వయంప్రభ వానరులను అంతర్ముఖులను చేసి భక్తి సాధనలో ప్రవృత్తులను చేసింది. ఒకసారి వారంతా కండ్లు మూసుకొని తెరిచేసరికి సముద్రతీరంలో ఉన్నారు. ఎంతో ప్రయత్నం, శ్రమ వల్ల చేరుకోవలసిన దూరాన్ని ఒక్క క్షణకాల అంతర్ముఖత్వంలో అందుకున్నారు.

భక్తిని ప్రాప్తించుకున్న స్వయంప్రభ, తాను స్వయంగా భగవంతుడి దర్శనార్థమై ప్రవర్షణ పర్వతం మీది బదరీవనానికి వెళ్లిపోయింది.



ఈ కథనే పై వేదమంత్రం సోమస్తుతి రూపంలో వర్ణిస్తోంది. సాక్షాత్తు రాముడే సోముడు. ఆ వివరణ ముందు ఇతర మంత్రాలలో వేదమాత వివరించగలదు.

అవతారిక:- సాధనలో ఉపవాసం స్థానం ఏమిటి? మనిషి ఏ ఆకలి చేత ప్రేరేపించబడి కర్మలలో ప్రవృత్తుడైతాడు? స్వార్థరహితులై కర్మ చేసేవారికి మార్గ మధ్యంలో సహాయం ఎలా లభిస్తుంది? మొదలైన ప్రశ్నలకు జవాబు చెబుతుంది వేతమాత.

**మంత్రాలు 70, 71, 72, 73 :**

**శుచిః పునానస్తన్వమరేప సమవ్యే హరిర్న్యధావిష్ట సానవి। జుష్టో మిత్రాయ వరుణాయ వాయవే త్రిధాతు మధుక్రియతే సుకర్మభిః॥** (ఋగ్: 9-70-8)

**పవస్వ సోమ దేవవీతయే వృషేంద్రస్య హార్ది సోమధాన మావిశ। పురా నో బాధాత్ దురితాతి పారయ క్షేత్రవిద్ధి దిశ ఆహా విపృచ్ఛతే॥**
(ఋగ్: 9-70-9)

**హితో న సప్తిరభి వాజమర్షేన్ద్రస్యేన్దో జఠరమా పవస్వ। నావా న సిన్ధుమతి పర్షి విద్వాఞ్ఛూరో న యుధ్యన్నవ నో నిదః స్పః॥** (ఋగ్: 9-70-10)

**ఆ దక్షిణా సృజ్యతే శుష్మ్యా2సదం వేతి ద్రుహో రక్షసః పాతి జాగృవిః। హరిరో పశం కృణుతే నభ స్పయ ఉపస్తిరే చమ్వో2ర్బ్రహ్మ నిర్ణిజే॥** (ఋగ్: 9-71-1)

తాత్పర్యము:- స్వభావరీత్యా శుద్ధులైనప్పటికీ, నిష్పాపులైనప్పటికీ

శరీరాలను ఉపవాసాలతో పవిత్రం చేస్తూ వానరులు మేరుశిఖరం మీద అభయస్థానమైన బ్రహ్మలోకానికి వెళ్లడానికి సంసిద్ధులైనారు. అప్పుడు సకృతవంతుడైన సంపాతి అనే పేరు గల పక్షి వాతపిత్తకఫాత్మకమైన వానర శరీరులను తనకు ఆహారంగా మార్చుకోవడానికి నిశ్చయించుకున్నది. ఎందుకంటే సుపక్వ ఆహారంతో దేహాగ్ని సంతుష్టం అవుతుంది. సరస భోజనం వల్ల రసనాదేవత వరుణుడు సంతుష్టుడౌతాడు. సుస్పర్శ చర్మం వల్ల త్వక్ దేవత వాయువు సంతుష్టుడౌతాడు.

తమను చంపడానికి వస్తున్న పక్షిని చూసి పునఃజీవనం కొరకు వానరులు సోముడిని ఇలా స్తుతించారు. 'ఓ ఈశ్వరా! నీవు ఇచ్ఛాఫలదాతవు, దేవతల రక్షకుడవు, నీవు రాముడి హృదయంలో (సీత రూపంలో) ఉంటావు. ఈ పక్షి ద్వారా మాకు సంప్రాప్తం కాబోతున్న మరణం నుండి మమ్ము కాపాడు. రాముడి ద్వారా సీత జాడ అడగబడడంతో జటాయువు సీత జాడ చెప్పి చనిపోయాడు. మేము మాత్రం వ్యర్థంగానే చనిపోతున్నాము.

ఓ హితకారి రామా! యుద్ధానికి వెళ్లే అశ్వంలాగా ఇంద్రహవిస్సును స్వీకరించే ఓ రామా! సోమరూపంలో వావిద్వారా ఉదరంలో ప్రవేశించండి. నౌకలాగా మమ్ము ఈ కష్టం నుండి తరింపచేయండి. మా మనస్సులను ఎరిగే ఓ స్వామీ! వ్యర్థంగా మమ్ము చంపనున్న రాక్షసులను మీరు సంహరించండి.

ఈ వానరులు స్వామి భక్తులని గ్రహించిన సంపాతి "సీతాన్వేషణకై రాముడి చేత ప్రార్థించబడిన మీరు దక్షిణదిశలో ఉన్న లంకలో ఆవిడను వెతకండి అన్నది. ఈ విధంగా ఆజ్ఞాపించబడిన బలసంపన్నులైన వానరులు సీతను చూడగలిగారు. జాగరూకులైన ఈ వానరులు రావణుడి నుండి ఆవిడను రక్షించగలరు. దూడను చూచిన ఆవుకు పాలు పొంగిన విధంగా సీతకు ఆ వానరుల మీద ప్రేమ పొంగింది.



వ్యాఖ్యానం :- స్వయంప్రభ ఉపదేశంతో కండ్లు మూసిన వానరులు, కండ్లు తెరిచేసరికి సముద్రతీరాన ఉన్నారు. కానీ సీత మీకు కనిపిస్తుంది అనే ఆవిడ మాట మీద మాత్రం విశ్వాసం కలగలేదు. ఎదురుగా ఉన్న విశాల సముద్రం వారికి భయాన్ని కలిగించింది. దీనిని దాటి వెళ్లటం అసంభవం అనిపించింది. గుహలో ఉండగా వారు సంశయ గ్రస్థులై ఉన్నారు గనుక, అప్పటి నిరాశను సంపూర్ణం అనలేము కానీ ఇప్పుడు వారి వైరాగ్యం చరమస్థాయిని చేరుకుంది. స్వయంప్రభ వారిలో క్రొత్త ఆశలు చిగురించేలా చేసింది. వానరులు ఆవిడ మాటలను మరోలా అర్థం చేసుకున్నారు. ఇలా కండ్లు మూసుకుని తెరిచేసరికి సీతామాత కండ్లముందు ఉంటుందనుకున్నారు. కానీ అలా కాకపోవటంతో ఇప్పుడేం చేయాలో అర్థం కావటం లేదు. చిన్న పిల్లలు భూమిలో విత్తనం నాటి ప్రతి పది నిమిషాలకొకసారి అంకురం వచ్చిందేమోనని చూడటం మొదలుపెడతారు. అలాంటి ఆతృతలో చిక్కిన వానరులకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది.

సాధకుడిలో ఉండవలసిన మొదటి అర్హత విశ్వాసం. ఈ విశ్వాసం ఫలవంతం అయ్యేంతవరకు ఎదురుచూడగల ధైర్యం రెండవ అర్హత. ఈ రెండు అర్హతలు గల పాత్రగా మనం శబరిని చూడవచ్చు. శ్రీరాముడు ఎప్పుడు వస్తాడో చెప్పలేదు. అయినా ఆవిడ రోజూ పూలు, పండ్లు పట్టుకొని రాముడి రాక కొరకు ఎదురుచూసేది. సాయంకాలం వరకు చూసి ఆయన రాకపోతే నీరసపడక రేపు తప్పక వస్తారు అంటూ విశ్రమించేది. ఈ ప్రక్రియ చాలా సంవత్సరాల పాటు కొనసాగింది. రాముడిని చూచినప్పుడు గురువు మాటలు గుర్తుకు వచ్చి కృతజ్ఞతతో మనస్సు ఉప్పొంగింది.

కానీ వానరుల మనఃస్థితి అలా లేదు. సుగ్రీవుడు పెట్టిన నెలరోజుల గడువే వారి భయానికి కారణమైంది. నిజానికి సుగ్రీవుడు కేవలం నెలరోజుల లోపల సీతజాడ మీరు తీసుకురావాలి అనలేదు. నెలరోజుల తరువాత

సీత జాడ తెలుసుకోకుండా వచ్చిన వారికి మరణదండన అన్నాడు. సాధకుడి జీవితంలో సాధనా కాలపరిమితి లేకపోతే తమోగుణం ఆవరిస్తుంది. కానీ కాలపరిమితి నిర్ణయిస్తే వారు హతోత్సాహులు కూడా కావచ్చు. సాధకులు ఈ రెండురకాల మాయల నుండి బయటపడాలి. కానీ వైరాగ్యపు చరమ బిందువు వరకు వెళ్లిన వానరులతో అంగదుడు మళ్లీ గుహలోకి ప్రవేశించి అక్కడే చరమ జీవితాన్ని గడిపేద్దామన్నాడు. అందుకు హనుమంతుడు ఒప్పుకోలేదు. ఇక చివరికి ప్రాణత్యాగమే మార్గమంటూ నిర్ణయించాడు అంగదుడు.

అంగదుడు సముద్రతీరంలో దర్భలను పరచుకొని పడుకున్నాడు. తక్కిన వానరులు కూడా అతడిని అనుసరించారు. ఆంజనేయుడు దూరంగా, ఒంటరిగా మౌనంగా కూర్చుండిపోయాడు. దానితో వారికి నచ్చజెప్పవలసిన బాధ్యత జాంబవంతుడిదైంది.

అంగదుడి మాటల వల్ల నైరాశ్యానికి లోనైన వానరులకు బుద్ధిదేవత -బ్రహ్మదేవుడి అవతారంగా పేర్కొనబడే జాంబవంతుడు ఉద్బోధించటం మొదలుపెట్టాడు. రాముడే సర్వాంతర్యామి అయిన పరమాత్మ అని, ధర్మసంస్థాపనకు ఈభూమి మీద అవతరించాడని, ఆయన చేత ప్రేరేపించబడే వానరులందరు ఆయన ధర్మసంస్థాపనా కార్యంలో పాలుపంచుకుంటున్నారని ఉద్బోధించాడు. 'నీవు గానీ, సుగ్రీవుడు గానీ, రాముడి చేతి బొమ్మలు మాత్రమే. ఈ విధమైన దృష్టికోణంలో ఆలోచించినపుడు సుగ్రీవుడి పైన ద్వేషం గానీ, అతను మనను సంహరిస్తాడనే భయంగానీ వ్యర్థం' అంటూ ఉపదేశించాడు.

దగ్గరలోని కొండగుహలో ఉన్న వృద్ధ పక్షి సంపాతి ఈ వానరుల మాటలకి బయటకు వచ్చి వీరిని చూచింది. ఆనందం పట్టలేక పెద్దగా 'ఆహా! ఎన్నాళ్లకు నాకు జగదీశ్వరుడు ఆహారాన్ని పంపాడు. నేను కడుపు నిండా తిని ఎన్నాళ్లయింది' అన్నది. దానితో అప్పటివరకు ప్రాణత్యాగం



చేయటానికి సిద్ధపడ్డ వానరులంతా ప్రాణభయంతో వణికిపోయారు.

అప్పటివరకు కేవలం అంగదుడు మాత్రమే మనకు చావు మూడింది అన్నా అతడిని అనుసరించినవారు ఎవరూ లేరు. మేము ఏమన్నా ఆ విషయం సుగ్రీవుడికి తెలుస్తుందేమోననే భయంతో ఏమీ మాట్లాడలేదు. కానీ సంపాతి రూపంలో వారందరికి సాక్షాత్తు మృత్యువే దర్శనం ఇవ్వటం మొదలుపెట్టింది.

వానరులు మృత్యువును గురించే మాట్లాడుకుంటున్నప్పుడు గ్రద్ద కనిపించటంతో అది భవిష్యత్ సూచనగానూ, ఇక తమకు మృత్యువు అనివార్యం అని భావించటం మొదలుపెట్టారు.

ఆ పరిస్థితిలో వానరులు వారికి శక్తినిచ్చే సోముడిని రాముడి హృదయవాసి అయిన సీతారూపంలోనూ, సాక్షాత్తు రాముడి రూపంలోను ఉన్నట్లు భావించి స్తుతించటం మనకు పై మంత్రంలో కనిపిస్తుంది. ఆ స్తుతితో పాటు వారు రామకార్యంలో అసువులు బాసిన జటాయువును కూడా స్మరించారు. జాంబవంతుడి ఉపదేశం వ్యర్థం కాలేదు. అప్పటివరకు గ్రద్దను మృత్యురూపంలో చూచిన వారు రామసేవకురాలైన జటాయువనే మరో గ్రద్దను స్మరించగలిగారు. ఆ జటాయువు ప్రాణాలు విడిచినా చివరి క్షణాలలో రాముడికి సీతజాడ చెప్పగలిగింది. కానీ తాము ఆ పని కూడా చేయలేకపోయామే అని బాధపడ్డారు కూడా. మృత్యుసమయంలో భయాన్ని కాక రామచరణసేవలో గల ప్రేమను ప్రకటించగల శక్తి, వారికి జాంబవంతుడి సత్సంగం నుండే లభించింది.

జటాయువు పేరు వినగానే తన ఆకలిని మరచిపోయి వానరుల ద్వారా రామకార్యార్థమై జటాయువు ప్రాణత్యాగం చేసిన రోమాంచిత గాథను విని ఆనందాశ్రువులు కురిపిస్తున్న సంపాతితో నీకూ జటాయువుకు గల సంబంధం ఏమిటని వానరులు అడగగా, వారికి సంపాతి తన కథను

ఇలా చెప్పసాగింది......

పురా వృత్ర వధో వృత్తే సచాహం చ జమైషిణౌ।
ఆదిత్యముపయాతౌ స్వోన్వలంతం రశ్మి మాలినమ్॥

(వా.రా. 4-58-4)

పూర్వకాలంలో వృత్రవధ చేసిన ఇంద్రుడి వృత్తాంతంవిని ఆయనను జయించటానికి జటాయువు, నేను స్వర్గానికి వెళ్లాము. గరుడుడు లాగానే మేము కూడా శీఘ్రంగా ఇంద్రుడిని జయించి తిరిగి వస్తుండగా సూర్యమండలానికి దగ్గరగా వెళ్లాము. ఇంతలో నాకు, జటాయువు సూర్యకిరణాల వల్ల సంతప్తుడౌతూ ఉండడం కనిపించింది. నేను ప్రేమ వల్ల అతడికి నా రెక్కలతో నీడ కల్పించాను. దానితో జటాయువు రక్షింపబడ్డాడు కాని రెక్కలు కాలిన నేను వింధ్య పర్వతం మీద పడిపోయాను. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను కానీ 'నిశాకర ముని' సీతను వెదుకుతూ రామదూతలు ఇక్కడికి వచ్చినపుడు వారికి సీతజాడ చెప్పగలవు, అప్పుడు నీకు తిరిగి రెక్కలు వస్తాయి అని చెప్పి అనుగ్రహించాడు.

అంటూ తన కథను చెప్పిన సంపాతి వానరుల సహాయంతో సముద్రం వద్దకు వెళ్లి తన సోదరుడు జటాయువుకు తర్పణం విడిచాడు. ఆ తరువాత 'నేను గ్రద్దను కనుక నూరు యోజనాల సముద్రానికి ఆవల లంకలో రావణుడి చెరలో ఉన్న సీత నాకు కనిపిస్తోంది. మీరు ఇక దిగులు పడకండి. తప్పక మీకు సీతమ్మ దర్శనం కాగలదు' అన్నది. అయినా వానరుల ముఖంలో ఎటువంటి ఆనందం కనిపించలేదు. మళ్లీ సంపాతి వారితో 'నన్ను చూచి అయినా మీరు ధైర్యం తెచ్చుకోండి. చూడండి రామకృపతో నా శరీరంలో ఎటు వంటి మార్పులు వస్తున్నాయో' అన్నది. వానరులు చూస్తూ ఉండగానే సంపాతికి మరల రెక్కలు మొలుచు కొచ్చాయి. ఆ పక్షి ఆనందంతో ఆహారాన్వేషణకై వెళ్లిపోయింది.



జీవితంలో మనకు ఎదురయ్యే పాత్రలు కొన్ని ఎంత గొప్పగా ఉంటాయంటే వాటిని చూచి మనం గౌరవం, భక్తి శ్రద్ధలైతే పెంచుకోగలం కానీ వారి నుండి ప్రేరణ పొందటం చాలా కష్టం. మరికొన్నిసార్లు దుర్బలులని చూచినప్పుడు వారి ప్రభావం తమపై పడటం వల్ల తమలో కూడా భవిష్యత్తులో అటువంటి బలహీనతలు ఏర్పడవచ్చేమో అనే భయం కలుగుతుంది. కాని అన్నిటికన్నా జీవితంలో దెబ్బతిని పతనమై, అనారోగ్యం పాలై ఇక జీవితాంతం ఇలాగే ఉంటారనుకునేవారు పుంజుకొని బాగుపడి ఉన్నతంగా ఎదిగినప్పుడు వారి సంగంలో, వారి ఉపదేశంతో స్ఫూర్తిని పొందగలిగిన క్షణాలే ఉత్తమక్షణాలు. వీరు కూడా పైకి లేవగలిగినప్పుడు, వీరి మీద కూడా భగవత్కృప ప్రసరించినప్పుడు మన మీద ప్రసరించదా! అనే ఉత్సాహంతో సంపాతి సమక్షంలో వానరులకు జాడ్యం వదిలి పోయింది.

మనందరి జీవితాలను పోషించేవాడు, వెలుతురిచ్చేవాడు, వేడినిచ్చే వాడు, ఆధ్యాత్మిక దృష్టితో ప్రత్యక్షదేవత కూడా ఆదిత్యుడే. అయనను అంతా కింద నిలబడే అర్చిస్తారు కానీ ఆయనదాకా వెళదామని మాత్రం ఎవరూ అనుకోరు. అందుకు సిద్ధపడింది రజోగుణాధిక్యత గల సంపాతి. సాత్వికుడైన తమ్ముడు జటాయువును కూడా అందుకై బలవంత పెట్టింది. ఒక స్థాయివరకూ ఎగిరేసరికి ఇది సాధ్యమయ్యే పని కాదని చెప్పి జటాయువు తిరిగి వచ్చేసింది. కానీ అహంకారి అయిన సంపాతి మాత్రం ముందుకు వెళ్లి రెక్కలను కాల్చుకొన్నది.

నామరూప ప్రపంచానికి అతీతంగా ఎదగడమే నిజమైన ఉత్థానం. కానీ దాని స్థానంలో ఏ వ్యక్తి అయినా శరీరాన్నే పైకి లేపుదామని చూచినప్పుడు సమస్య వచ్చి పడుతుంది. ఇలా శారీరకంగా పైకి ఎగరాలనే (ఎదగాలనే) అహంకారానికి కొందరు సంపాతి, రావణుడు లాంటి వారు శౌర్యం అని పేరు పెట్టుకుంటే త్రిశంకు లాంటివారు పురుషార్థం అనిపేరు

పెట్టుకుంటారు. శారీరకంగా పైకి పంపగల తపోబలం ఉన్నప్పటికీ వసిష్ఠ మహర్షి అందుకు సిద్ధపడలేదు. కానీ ఆయనకు పోటీగా విశ్వామిత్రుడు ప్రయత్నించాడు. మళ్లీ దేవతల ద్వారా తోయబడి క్రిందపడిన త్రిశంకుడికి మరో స్వర్గం సృష్టించాడు. కానీ త్రిశంకు శాశ్వతంగా ఎటూ కాకుండా మధ్యలో వ్రేలాడ సాగాడు. ఇతడితో పోల్చితే సంపాతి అదృష్టవంతుడు అనవలసివస్తుంది. రెక్కలు కాలి క్రిందపడటం వల్ల తన అహంకారం అంతం అయి పశ్చాత్తాపపడి సత్సంగం చేసి, రామసేవ చేసి, మళ్లీ పైకి లేవగలిగాడు. సంసారి దృష్టిలో ఏదో ఒక పదవి, ధనం, స్థాయి ఉన్నతం కావచ్చు. కానీ అక్కడికి ఎదిగిన వారిలో కూడా లోపలి స్థాయి నీచంగానే ఉంటుంది. కనుక గ్రద్దల్లాగా మళ్లీ వాళ్లు ఎక్కడో క్రింద చచ్చిపడి ఉన్న శవాల కోసం వెదుకుతారు. అన్ని ఇంద్రియాల ప్రభావానికీ అతీతంగా స్థితప్రజ్ఞత్వంలోకి ఎదగడమే నిజమైన పెరుగుదల.

సంపాతి వెళ్లిపోగానే ఈ నూరు యోజనాల సముద్రాన్ని లంఘించి సీతను చూచిరాగల సమర్థులు మనలో ఎవరున్నారో చెప్పండి అన్నాడు అంగదుడు. ఒకరు పది యోజనాలు దాటగలనంటే మరొకడు ఇరవై, అలా ఎనభై వరకూ వెళ్లారు. అప్పుడు జాంబవంతుడు, 'విష్ణువు కృత యుగంలో త్రివిక్రమ రూపాన్ని ధరించి బలిని పాతాళానికి పంపినప్పుడు నేను నిండు యవ్వనంలో ఉన్నాను. ఆ బలంతో అలనాడు నేను ఆ త్రివిక్రమమూర్తికి ఏడు ప్రదక్షిణలు చేయగలిగాను. కానీ ఇప్పుడు వృద్ధుడిని అయిపోయాను. కనుక తొంభై యోజనాల కన్నా దాటలేను' అన్నాడు. ఇక అంగదుడు 'నేను మొత్తం నూరు యోజనాలు దాటగలను కానీ మళ్లీ తిరిగి వస్తాననే నమ్మకం లేదు' అన్నాడు. అంగదుడి ఈ మాటకు అనేక మంది వ్యాఖ్యాతలు అనేక రకాల అర్థాలు చెప్పారు. తాను నూరు యోజనాల సముద్రాన్ని లంఘించడం వల్ల కలిగిన అలసట వల్ల వెనక్కు రాలేడని కొందరు అంటే, అక్కడి రాక్షసులతో తలపడవలసి రావచ్చు ఆ అలసట



వల్ల రాలేనని అన్నాడని కొందరు వ్రాశారు. ఒక రామాయణంలో మాత్రం కథ ఒకటి కనిపిస్తుంది..... 'అంగదుడు, రావణ కుమారుడైన అక్షయ కుమారుడు ఒకే పాఠశాలలో చదువుకున్నారనీ, ఆరోజులలో చిలిపివాడైన అంగదుడు అక్షయుడిని ఊరికే ఏడిపిస్తుంటే, ఉపాధ్యాయులు కొందరు ఈసారి నువ్వు అతడి జోలికి వెళ్లావంటే తప్పక వాడి చేతిలో మరణించగలవని శపించారని' ఉంది. కనుక లంకలోని ఒక అక్షయ కుమారుడి వల్ల తప్ప ఏ రాక్షసుడి భయమూ తనకు లేదని అతడి చేతిలో మరణించవచ్చునేమోనని తను తిరిగి రాలేనన్నాడని వ్యాఖ్యానించ వచ్చు. అంగదుడి మాట విన్న జాంబవంతుడు వెంటనే 'యువరాజా! మీరు వెళ్లడంలోనే కాదు తిరిగి రావడంలో కూడా సమర్థులే. కానీ మా నాయకులైన మిమ్మల్ని మేమెలా పంపగలం?' అన్నాడు.

ఇక్కడ ఇంత పెద్ద చర్చ జరుగుతూ ఉంటే దగ్గరలోనే ఉన్న ఆంజనేయుడు ఇదేమీ పట్టించుకోకుండా కూర్చున్నాడు. స్వయంప్రభ దగ్గరికి గుహలోకి ప్రవేశించినప్పటి నుండి కూడా ఆంజనేయస్వామి మౌనంగా ఉండటం కనిపిస్తుంది. 'కండ్లు మూసుకోండి' అనే ఉపదేశానికి సరియైన అర్థం తీసుకున్నది హనుమంతుడు ఒక్కడే. ఇక్కడ కండ్లు అంటే మనోసహితంగా సమస్త ఇంద్రియాలు అని అర్థం చెప్పవచ్చు. అందుకే ఆ సమయం నుండీ ఆంజనేయుడు అన్ని ఇంద్రియాలనూ నిగ్రహించి అంతర్ముఖుడై శ్రీరామచంద్రస్వామిని ధ్యానించడం మొదలు పెట్టాడు. సముద్రతీరంలో సంపాతితో వానరులు చేసిన సంభాషణ కూడా ఆయన వినలేదు. ఒకవేళ విని ఉంటే లంకలో సీతను అన్వేషించేటప్పుడు ఎక్కువ శ్రమపడవలసి వచ్చేదే కాదు.

*'తహఁ అశోక ఉపబన జహఁ రహఈ।*
*సీతాబైఠి సోచరత అహఈ॥*

అక్కడ ఆ లంకలోని అశోకవాటికలో విచారమగ్నమై కూర్చుని

ఉన్న సీత నాకు కనిపిస్తోంది అని స్పష్టంగా సంపాతి చెప్పింది. ఆంజనేయస్వామి శారీరకంగా అక్కడే ఉన్నప్పటికీ అంతర్ముఖత్వం వల్ల సంపాతి చెప్పిన మాటలు వినలేదు. అందుకే ఆరాత్రి అంతా సీత కొరకు లంకలో వెదకి తెల్లవారుఝామున విభీషణుడి వద్ద సీత జాడ తెలుసుకొని అశోకవాటికలో ప్రవేశించాడు.

జాంబవంతుడు మెల్లిగా ఆంజనేయస్వామి వద్దకు వచ్చి ఆయనను బహిర్ముఖుడిని చేశాడు. 'మౌనంగా కూర్చున్నావేమయ్యా! బలంలో వాయువుతో సమానమైన పవనపుత్రా! బుద్ధీ, వివేకం, విజ్ఞానాలలో దిట్టవైన ఓ స్వామీ! మీకు సాధ్యం కానిదేముంది ఈ లోకంలో. చిన్నతనంలోనే ఆకలికి తాళలేక సూర్యుడిని ఎర్రని పండని భ్రమించి మింగటానికి వెళ్లి, సూర్యుడిని తినడానికి వచ్చిన రాహువును బెదరగొట్టి, ఇంద్రుడి వజ్రాయుధాన్ని సైతం సహించి అందరు దేవతలచేత అనేక వరాలు పొందిన మహావీరా! అసలు నీవు అవతరించిందే రామకార్యార్థమై, మరి ఎందుకని ఇలా జాప్యం చేస్తావు' అన్నాడు.

అన్ని ఇంద్రియాల ద్వారా లోపలికి తీసుకునేదంతా ఆహారమే (ఆహరతీతి). శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు, ఇంద్రియాహారం, ప్రేమ, ఆప్యాయతలు మానసిక ఆహారం. జ్ఞానం బౌద్ధిక ఆహారం. ఈ మూడు తీరినవాడు నాలుగవదైన ఆకలి ఒకటి ఉన్నదన్న సంగతి మనకు అర్థమవుతుంది. ఆకలి కాకపోవడం అనారోగ్యాన్ని సూచిస్తుంది. కనుక పైన చెప్పిన ఆహారాలలో ఏ ఒక్కటి కోరుకోకపోయినా వ్యక్తి సంపూర్ణ ఆరోగ్యంలో లేడని చెప్పవచ్చు. క్రమంగా ఈ ఆకలులన్నీ తీరిపోగా వ్యక్తి పరిపూర్ణుడౌతాడు.

ఆకలిగా ఉన్నవాడు ఎటువంటి ఆహారాన్నైనా తృప్తిగా తింటాడు. మరొకడు ఆకలి లేకపోయినా మంచి రుచికరమైన ఆహారం ఉంటే తింటాడు. అతడికే ఇబ్బంది వచ్చిపడుతుంది. ఆకలి నుండి పుట్టే రుచి



ఆరోగ్యానికి హాని చేయదు. మరొక రకమైన ఆహారం ఇటు ఆకలినీ తీరుస్తుంది అటు నాలికనూ తృప్తి పరుస్తుంది. అంతేకాక శరీరానికి పుష్టిని కూడా ఇస్తుంది. ఈ శారీరకమైన ఆహారంలో మూడు రకాలు ఉన్నట్లు మానసిక, బౌద్ధిక ఆహారాల్లో కూడా మూడు రకాలు ఉంటాయి. మనస్సు ఆకలిని తీర్చేది. మనోరంజనాన్ని ఇచ్చేది. మనసుకు ఆరోగ్యం చేకూర్చేది. ఇలా మానసిక ఆహారం కూడా మూడు రకాలుగా ఉంటుంది. మనో రంజనాన్ని ఇచ్చే సినిమాలు మొదలైనవి ఉత్తమ విషయాలను బోధిస్తే సరేగాని, లేకపోతే ఉద్రేకాన్నీ, ద్వేషాన్ని పెంచి హాని చేస్తాయి.

*'బుధ విశ్రామ సకల జనరంజని।*
*రామకథాకలి కలుష బిభంజని॥'*

ఈ రామకథ బుద్ధిమంతులకు విశ్రాంతినీ, సాధారణ జనులకు మనోరంజనాన్ని కూడా ఇస్తుంది. మానసిక అనారోగ్యానికి దారి తీయనంతవరకూ మనోరంజనం కూడా హీనవస్తువేమీ కాదు. ఈ విషయాన్నే పై వేదమంత్రం ప్రస్తావిస్తోంది. హనుమంతుడు మైనాకుడి ఆకలిని స్పర్శ ద్వారా తీర్చాడు.

సూర్యుడిని పండుగా భావించి తినబోవడంలో హనుమంతుడి ఆకలి బౌద్ధికమైనది. ఇటు హనుమంతుడు అటు సంపాతి కూడా సూర్యుని దగ్గరికి బౌద్ధికమైన జ్ఞానాకలితోనే వెళ్లారు. కానీ కథననుసరించి సూర్యుడు తన తేజస్సును తగ్గించి హనుమంతుడికి హాని కలగకుండా చేశాడు. సంపాతి రెక్కలను కాల్చాడు. ఈ ఇద్దరి మధ్య తేడా ఏమిటి? జ్ఞానం పొందాలనే కోరిక మంచిదే కానీ, సమాజం నన్ను జ్ఞానిగా గుర్తించాలి కనుక నేను జ్ఞానార్జన కొరకై వెళతాను అనే ఉద్దేశ్యమే మంచిది కాదు. అటువంటి వారి రెక్కలే కాలతాయి. అహంకార రాహిత్యమే జ్ఞానం అని వారికి తెలియదు. నిజమైన జ్ఞానాభిలాష కలవాడు పొగడ్తల నుండి దూరంగా ఉంటాడు. ఆహంకారాన్ని ప్రదర్శించడు, 'మేమంతా సముద్రాన్ని ఎలా దాటాలో తెలియక బాధపడుతుంటే నువ్వు మౌనంగా ఉన్నావే

మిటయ్యా!' అని జాంబవంతుడు ప్రశిస్తే 'మీరు మీ శక్తి సామర్థ్యాలు చెపుతున్నారు. నాకు ఏ శక్తి సామర్థ్యాలు లేవు గనుక నేను మౌనంగా ఉన్నాను' అంటాడు హనుమంతుడు. రామ సామర్థ్యమే తన గుండా ప్రకటమౌతోంది, కానీ వ్యక్తిగతంగా తనకు ఏ శక్తీ లేదని అతడికి తెలుసు. ఇదీ జ్ఞాని లక్షణం.

పైకి సూర్యుడిని మింగే రాహువు, హనుమంతుడూ ఒకే రకంగా కనిపించవచ్చు. రాముడు సూర్యవంశంలో పుట్టాడు. ఆయన సేవ కొరకై హనుమంతుడు పుట్టాడు. రామసేవకుడైన తానుండగా రఘువంశపు మూలపురుషుడిని ఎవడో మింగడానికి వస్తే తానెలా ఊరుకుంటాడు. అందుకే సూర్యుడిని హనుమంతుడు తన నోట భద్రపరిచి రాహువును దండించటానికి వెళ్లాడు. సూర్యుడిని (జ్ఞానాన్ని) తనవరకే పరిమితం చేసుకొని లోకానికి అంధకారాన్ని (అజ్ఞానాన్ని) అందించే వ్యక్తి (రాహువు) ఒకడైతే, జ్ఞానాన్ని రక్షించి దానిని ప్రపంచానికి అందింపచూచేవాడు (హనుమంతుడు) మరొకడు.

అలా సూర్యుడిని రక్షిద్దామని చూచిన బాల హనుమంతుడిని ఇంద్రుడు చంపుదామని చూశాడు. లోకంలో ఇటు దేవతలూ అటు దైత్యులూ అందరూ స్వార్థపరులే. ఒకరు తమ పుణ్యంతోనూ, మరొకరు పశుబలంతోనూ సుఖపడదామని చూస్తారే కానీ లోకాన్ని అజ్ఞానాంధకారం నుండి బయటపడనిద్దామని చూడరు. అలా జరిగిన మరుక్షణం తమ ఆట కట్టు అవుతుందని ఇటు దైత్యులకు అటు ఆదిత్యులకు కూడా తెలుసు. జీవుల ఇంద్రియాలలో కూర్చుని విషయ సుఖాల ననుభవించేవారు దేవతలు. మనసులో కూర్చొని పాప చింతనలు పెంచి సంతోషించేవారు దైత్యులు. జ్ఞానులు ఈ రెంటికీ అతీతంగా ఉంటారు. అందుకే ఇటు దైత్యులు అటు ఆదిత్యులు ఇరువురు కూడా జీవులకు జ్ఞానం కలగనివ్వరు.

కనుక అందరికీ ఆకలి వేసింది. కానీ కొందరు శారీరక ఆకలికి



లోనై అది కూడా రుచి కొరకు తిని అనారోగ్యం పాలైనారు. మరికొందరు మానసిక ఆకలికి లోనై కేవలం మనోరంజనానికి వారి ఆకలిని పరిమితం చేసి పతనమైనారు. మరికొందరు బౌద్ధిక ఆకలికిలోనై అహంకార పుష్టి కొరకు జ్ఞానార్జన చేసి లేదా జ్ఞానాన్ని తమ వరకే పరిమితం చేసుకొని పతనమైనారు. ఆకలులకు అతీతంగా ఎదిగిన హనుమంతుడి లాంటి మహాత్ములు తమ ఆధ్యాత్మిక ఆకలిని ఎరిగి దానిని కూడా పూర్తి చేసుకొని తరించారు.

ఎప్పుడైతే జాంబవంతుడు 'రామకార్యం కొరకే నీవు అవతరించావు' అని హనుమంతుడితో అన్నాడో వెంటనే హనుమంతుడు ఉప్పొంగిపోయి పర్వతం అంత ఎత్తుకు ఎదిగి బంగారు రంగులో మెరిసిపోతూ సింహ నాదాలు చేయడం మొదలు పెట్టాడు.

## కిష్కింధాకాండము సమాప్తము

శ్రీః

# శ్రీరామ చూర్ణిక

1. శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండ భాండ తండోప తండ కరండమండల శాంతోద్దీపిత సగుణ నిర్గుణాతీత సచ్చిదానంద పరాత్పరతారక బ్రహ్మాహ్వయ దశదిశ ప్రకాశం-సకల చరాచరాధీశమ్॥

2. కమల సంభవ శచీధవ ప్రముఖ నిఖిల బృందారక బృంద వంద్యమాన సందీప్త దివ్యచరణారవిందం-శ్రీముకుందమ్॥

3. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనోత్కట కపటవాటక సూత్రచరిత్రాంచిత బహువిధావతారం-శ్రీరఘువీరమ్॥

4. కౌసల్యాదశరథ మనోరథా2 మందానంద కందళిత నిరూఢ క్రీడావలోకన శైశవం-శ్రీ కేశవమ్॥

5. విశ్వామిత్ర యజ్ఞవిఘ్న కారణోత్కట తాటకాసుబాహుబాహుబల విదళన బాణప్రవీణపరాయణం-శ్రీమన్నారాయణమ్॥

6. నిజపాద జలజ రజఃకణ స్పర్శనీయ శిలారూప శాపవిముక్త గౌతమ సతీవినుత మహీధవం-శ్రీమాధవమ్॥

7. ఖండేందుధర ప్రచండ కోదండ ఖండనోద్దండ దౌర్దండ కౌశిక లోచ నోత్సవ జనకచక్రేశ్వర సమర్పితసీతావివాహమహోత్సవానందం- శ్రీ గోవిందమ్॥

8. పరశురామ భుజా2ఖర్వ గర్వనిర్వాపణ గతానుగత రణవిజయ వర్ధిష్ణుం-శ్రీ మహావిష్ణుమ్॥



9. పితృవాక్యపరిపాలనోత్కటజటావల్కలోపేతసీతాలక్ష్మణసహిత మహిత రాజ్య చ్యుతాభిమత దృఢవ్రత కలితప్రయాణ రంగ ద్గంగావతరణ సాధనం-శ్రీమధుసూదనమ్॥

10. భరద్వాజోపచార నివారిత శ్రమక్రమ నిరాఘాట చిత్రకూట ప్రవేశక్రమం -శ్రీ త్రివిక్రమ్॥

11. జనక వియోగ శోకాకులిత భరత శత్రుఘ్నులాల వానుకూల బంధుర పాదుకా ప్రదాన సుధానిర్మితాంతః కరణ దుష్టచేష్టాయమాన క్రూర కాకాసుర గర్వోపశమనం-శ్రీవామనమ్॥

12. దండకాగమన నిరోధక్రోధ విరాధానలజ్వాలాజలధరం శ్రీ శ్రీధరమ్॥

13. శరభంగ సుతీక్ష్ణా త్రిదర్శనాశీర్వాద నిర్వ్యాజ కుంభసంభవ కృపాలబ్ధ మహాదివ్యాస్త్ర సముదయార్చిత ప్రకాశం శ్రీ హృషీకేశమ్॥

14. పంచవటీతటి సంఘటిత విశాల పర్ణశాలాగత శూర్పణఖా నాసికాశ్రవణ చ్ఛేదన మానావ బోధన మహాహవారంభ విజృంభణ నియోగ మాయా మృగ సంహార కార్యార్థలాభం-శ్రీపద్మనాభమ్॥

15. రాత్రించర వరవంచనాపహృత సీతాన్వేషణ రభస రథపంక్తి గళక్షోభ శిథిలీకృత పక్ష జటాయు మోక్షబంధు ప్రియానూన నిర్బంధన కబంధ వక్త్రోదర శరీర నిరోధరం-శ్రీదామోదరమ్॥

16. శబర్యుపదేశ పంపాతట హనుమత్ సుగ్రీవ సంభాషిత బంధుర దుందుభి కళేబరోత్పతన సప్తతాళచ్ఛేదన వాలి విదారణ ప్రసన్న సుగ్రీవ సామ్రాజ్య సుఖమర్షణం-శ్రీ సంకర్షణమ్॥

17. సుగ్రీవాంగద నీలజాంబవత్పవన కేసరి ప్రముఖాఖిల కపినాయక సేనా సముదయార్చిత దేవం-శ్రీవాసుదేవమ్॥

**18.** నిజదత్తముద్రికా జాగ్రత్సమ గ్రాంజనేయ వినయవచన రచనాంబుధి లంఘనోల్లంఘిత లంకిణీప్రాణోల్లంఘనజనకజాదర్శనాక్షయకుమార మారణలంకా పురీదహనతత్ప్రతిష్ఠిత సుఖప్రసంగ ధృష్టద్యుమ్నం -శ్రీప్రద్యుమ్నమ్॥

**19.** అగ్రజోదగ్ర మహోగ్రనిగ్రహపలాయమాన మాననీయ నిజశరణ్యాగణ్య పుణ్యానయవిభీషణాభయప్రదాననిరుద్ధమ్-శ్రీమదనిరుద్ధమ్॥

**20.** అపారలవణ పారావార సముజ్జృంభితోత్కరణ గర్వనిర్వాపణ దీక్షా సమర్థ సేతునిర్మాణప్రవీణాఖిలతరుచరోత్తమం- శ్రీపురుషోత్తమమ్॥

**21.** నిస్తుల ప్రహస్త కుంభకర్ణేంద్రజిత్కుంభ నికుంభాగ్ని వర్ణాతికాయ మహోదర మహాపార్శ్వ దనుజ తనుఖండనాయనామ కోదండగుణ శ్రవణ క్షపితాశేష రాక్షసవ్రజం-శ్రీమదధోక్షజమ్॥

**22.** అకుంఠిత రణోపకంఠ దనుజ కంఠీరవ కంఠలుంఠనాయమాన జయసింహమ్-శ్రీనారసింహమ్॥

**23.** దశగ్రీవానుజ పట్టభద్రత్వాశక్య విభవలంకాపురీస్ఫురణ సకల సామ్రాజ్య సుఖోత్థితం-శ్రీమదచ్యుతమ్॥

**24.** సకల సురాద్భుతప్రజ్వలిత పావకముఖపూతనాయమాన సీతా లక్ష్మణానుగత మహనీయ పుష్పకాధిరోహణ నందిగ్రామస్థిత భ్రాతృ భీతృత్వ జటావల్కలవిసర్జితాంబరభూషణాలంకృత శ్రేయో వివర్ధనమ్ -శ్రీజనార్ధనమ్॥

**25.** దంభోళిశత ధారాధావళ్య నవ్యశుభకీర్తిచ్ఛటాంతర పాండురీభూత సభా విభ్రాజమాన నిఖిలభువనైకయశస్సాంద్రం-శ్రీఉపేంద్రమ్॥

**26.** భక్తజన సంరక్షణ దీక్షాకటాక్ష శుభోదయ సమర్థం-శ్రీ శ్రీహరమ్॥



**27.** కేశవాది చతుర్వింశతినామ గర్భ సందర్శిత నిజకథాగీత కృతమేధా వర్ధిష్ణుం-శ్రీ శ్రీకృష్ణమ్॥

**28.** అయోధ్యానగర పట్టాభిషేక మహోత్సవానందనిరంతర దిగంత విశ్రాంత హారహీర కర్పూరపయః పారావార పారదవాణీకుందేందు మందాకినీ చందనసురధేను శరదంబు దాళీధరం-శ్రీకౌస్తుభధరమ్॥

**29.** సర్వసుపర్వపార్వతీహృదయకమలం తారకబ్రహ్మనామం-సంపూర్ణ కామమ్॥

**30.** భవతరణ సుగుణసాంద్రం భవజనిత భయోచ్ఛేదవిచ్ఛిద్రమచ్ఛిద్రం భక్తజన మనోరథోన్నిద్రం-శ్రీభద్రాచలరామభద్రం-రామదాస ప్రసన్నం-భజేహమ్।భజేహమ్।భజేహమ్॥

*— శ్రీ భద్రాచల రామదాసు రచన*



రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥



## విషయసూచిక